ణోద్ధృతాంతద్వత్కుర్యాత్పృథ్వీంసపఙ్కజామ్ । వరుణంచాసనగతంశాఙ్ఖ్యశంమ కరోపరి ॥ ౬ ॥ హుతాశనంమేషగతంవాయుంకృష్ణమృగాసనమ్ । తథాకోశాధిపంకుర్యాన్మూషకస్థంవినాయకమ్॥ ౭॥ విన్యస్యఘటమధ్యేతాన్వేదపఞ్చకసంయుతాన్ । ఋగ్వేదస్యతుసూత్రంస్యాద్యజుర్వేదస్యపఙ్కజమ్॥ ౮ ॥ సామవేదస్య వీణాస్యాద్వేణుందక్షిణతోన్యసేత్ । అథర్వవేదస్యపునస్స్రుక్స్రువాకమలంకరే॥౯ ॥ పురాణవేదోవరదస్సాతుసూత్రకమణ్డలుః । పరితస్సర్వధాన్యానిచామరాసనదర్పణమ్॥ ౧౦ ॥ పాదుకోపానహచ్ఛత్రందీపికాభూషణానిచ । శయ్యాంచజలకుమ్భాంశ్చపఞ్చవర్ణంవితానకమ్ ॥ ౧౧ ॥ స్నాత్వాధివాసనంకుర్యాదిమంమన్త్రముదీరయేత్ । నమోవస్సర్వదేవానామాధారేభ్యశ్చరాచరే ॥ ౧౨ ॥ మహాభూతాదిదేవేభ్యశ్శాన్తిరస్తుశివంమమ । యస్మాన్నకించిదప్యస్తిమహాభూతైర్వినాకృతమ్॥ ౧౩ ॥ బ్రహ్మాణ్డేసర్వభూతేషుతస్మాచ్ఛ్రీరతుయాస్తుమే । ఇత్యుచ్చార్యమహాభూతఘటంయోవినివేదయేత్ ॥ ౧౪ ॥ సర్వపాపవినిర్ముక్తస్సయాతిపరమాంగతిమ్ । విమానేనార్కవర్ణేనపితృబన్ధుసమన్వితః ॥ ౧౫ ॥ స్తూయమానోవరస్త్రీభిఃపదమభ్యేతివైష్ణవమ్ । షోడశైతానియఃకుర్యాన్మహాదానానిమానవః॥ ౧౬ ॥ నతస్యపునరావృత్తిరిహలోకేనజాయతే ॥ ఇతిపఠతియఇత్థంవాసుదేవస్యపార్శ్వేససుతపితృకళత్రస్సంశృణోతీహసమ్యక్॥౧౭॥మురరిపుభవనేవైమన్దిరేచార్కలక్ష్మ్యాత్వమరపురవధూభిర్మోదతేసోఽపినిత్యమ్॥ ౧౮ ॥ * * *

ఇతిశ్రీమత్స్యపురాణేమహాదానానుకీర్తనేమహాభూతఘటప్రదానికోనామ సప్తాశీత్యుత్తరద్విశతతమోధ్యాయః.

---

## కల్పనామానుకీర్తనమ్.

మనుః ॥ కల్పమానంత్వయాప్రోక్తంమన్వన్తరయుగేషుచ। ఇదానీంకల్పనామానిసమాసాత్కథయాచ్యుత ॥ ౧ ॥ శ్రీమత్స్యః ॥ కల్పానుకీర్తనంవక్ష్యేసర్వపాపప్రణాశనమ్ । యస్యానుకీర్తనాదేవవేదపుణ్యేనయుజ్యతే ॥ ౨ ॥ ప్రథమంశ్వేతకల్పస్తుద్వితీయోనీలలోహితః। వామదేవస్తృతీయస్తుతతోరాథన్తరోఽపరః ॥ ౩ ॥ రౌరవఃపఞ్చమఃప్రోక్తష్షష్ఠోదేవఇతిస్మృతః । సప్తమోఽథబృహత్కల్పఃకన్దర్పోఽష్టమఉచ్యతే ॥ ౪ ॥ సద్యోఽథనవమఃప్రోక్తఈశానోదశమస్స్మృతః । తమఏకాదశఃప్రోక్తస్తథాసారస్వతఃపరః ॥ ౫ ॥ త్రయోదశఉదానస్తుగారుడోఽథచతుర్దశః। కౌర్మఃపఞ్చదశోజ్ఞేయఃపౌర్ణమాస్యామజాయత॥ ౬ ॥ షోడశోనారసింహస్తుసమానస్తుతతోఽపరః । ఆగ్నేయోఽష్టాదశఃప్రోక్తస్సోమకల్పస్తథాపరః ॥ ౭ ॥ మా

నవోవింశతిఃప్రోక్తస్తత్పుమానితిచాపరః । వైకుణ్ఠశ్చాపరస్తస్మాల్లక్ష్మీకల్పస్తథాప
రః ॥ ౮ ॥ చతుర్వింశతిమఃప్రోక్తస్సావిత్రీకల్పసంజ్ఞకః । పఞ్చవింశస్తతోఘోరో
వారాహస్తుతతోఽపరః ॥ ౯ ॥ సప్తవింశోఽథవైరాజోగౌరీకల్పస్తథాపరః । మ
హేశ్వరస్తథాప్రోక్తస్త్రిపురోయత్రఘాతితః ॥ ౧౦ ॥ పితృకల్పస్తథైవాన్తే
యాకుహూర్బ్రహ్మణాస్మృతా । ఇత్యేవంబ్రహ్మణోమాసస్సర్వపాతకనాశ
నః ॥ ౧౧ ॥ ఆదావేవహిమాహాత్మ్యంయస్మిన్నస్యవిధీయతే । తస్యకల్పస్యతన్నా
మవిహితంబ్రహ్మణాపురా ॥ ౧౨ ॥ సఙ్కీర్ణాస్తామసాశ్చైవ రాజసాస్సాత్వికాస్త
థా।రజస్తమోమయాస్తద్వదేతేత్రింశదుదాహృతాః॥౧౩ ॥సఙ్కీర్ణేషుసరస్వత్యా
పితౄణాంవ్యుష్టిరుచ్యతే। అగ్నేశ్శివస్యమాహాత్మ్యంతత్స్వరూపేణవర్ణ్యతే॥ ౧౪॥
రాజసేషుచమాహాత్మ్యమధికంబ్రహ్మణస్స్మృతమ్ । యస్మిన్కల్పేతుయత్ప్రోక్తం
పురాణంబ్రహ్మణాపురా ॥ ౧౫॥ తస్యతస్యతుమాహాత్మ్యంతత్స్వరూపేణవర్ణ్యతే।
సాత్వికేష్వధికంతద్వద్విష్ణోర్మాహాత్మ్యముచ్యతే ॥ ౧౬ ॥ తేష్వేవయోగసంసి
ద్ధాగమిష్యన్తిపరాంగతిమ్ । బ్రాహ్మంపాద్మమిమంయస్తుపఠేత్పర్వణిపర్వణి॥ ౧౭॥
తస్యధర్మేమతింబ్రహ్మకరోతివిపులాంశ్రియమ్ । యస్తుదద్యాదిమాన్కృత్వాహైమా
న్పర్వణిపర్వణి ॥ ౧౮ ॥ బ్రహ్మవిష్ణుపురేకల్పంమునిభిఃపూజ్యతేదివి । సర్వపాపక్ష
యకరంకల్పదానంయతోభవేత్ ॥ ౧౯ ॥ మునిరూపాంస్తథాకృత్వాదద్యాతక
ల్పాన్విచక్షణః । పురాణసంహితాచేయంతవభూపమయోదితా ॥ ౨౦ ॥ సర్వ
పాపహరానిత్యమారోగ్యశ్రీఫలప్రదా । బ్రహ్మసంవత్సరశతాదేకాహంశైవముచ్య
తే ॥ ౨౧ ॥ శివవర్షశతాదేకంనిమేషంవైష్ణవంవిదుః । యదాసవిష్ణుర్జాగర్తితదిదం
చేష్టతేజగత్ ॥ ౨౨ ॥ యదాస్వపితిశాన్తాత్మాతదాసర్వంప్రలీయతే ॥ సూతః ॥
ఇత్యుక్త్వాసర్వదేవేశోమత్స్యరూపీజనార్దనః ॥ ౨౩ ॥ పశ్యతాంసర్వభూతానాంత
త్రైవాన్తరధీయత । వైవస్వతోపిభగవాన్వ్యసృజద్వివిధాఃప్రజాః ॥ ౨౪ ॥ స్వా
న్తరంపాలయామాసమార్తణ్డకులవర్ధనః । యస్యమన్వన్తరంచైతదధునాచానువర్త
తే ॥ ౨౫ ॥ పుణ్యంపవిత్రమేతద్వఃకథితంమత్స్యభాషితమ్ । పురాణంసర్వశాస్త్రా
ణాంయదేతన్మూర్ధ్నిసంస్థితమ్ ॥ ౨౬ ॥ * * * *

ఇతిశ్రీమత్స్యపురాణేమత్స్యమనుసంవాదే కల్పనామానుకీర్తనంనామ
అష్టాశీత్యుత్తరద్విశతతమోధ్యాయః.

---

## ॥ ఏతత్పురాణవిషయానుక్రమణికా. ॥

సూతః ॥ ఏతద్వఃకథితంసర్వంయదుక్తంవిశ్వరూపిణా । మాత్స్యంపురాణ
మఖిలంధర్మకామార్థసాధనమ్॥ ౧ ॥ యత్రాదౌమనుసంవాదోబ్రహ్మాణ్డకథనంతథా।

సాఙ్ఖ్యంశారీరకంతద్వచ్చతుర్ముఖముఖోద్భవమ్ ॥ ౨ ॥ దేవాసురాణాముత్పత్తిర్మారుతోత్పత్తిరేవచ । మదనద్వాదశీతద్వల్లోకపాలాభిషేచనమ్॥ ౩ ॥ మన్వన్తరాణాముద్దేశో వైన్యరాజాభివర్ణనమ్ । సూర్యవైవస్వతోత్పత్తిర్బుధస్యాగమనంతథా ॥ ౪ ॥ పితృవంశానుకథనంశ్రాద్ధకల్పస్తథైవచ । పితృతీర్థప్రచారశ్చసోమోత్పత్తిస్తథైవచ ॥ ౫ ॥ కీర్తనంసోమవంశస్యయయాతిచరితంతథా । కార్తవీర్యస్యమాహాత్మ్యంవృష్ణివంశానుకీర్తనమ్ ॥ ౬ ॥ భృగుశాపస్తథావిష్ణోర్దైత్యశాపస్తథైవచ। కీర్తనంపురువంశస్యవంశోహౌతాశనస్తథా ॥ ౭ ॥ పురాణకీర్తనంతద్వత్క్రియాయోగస్తథైవచ । వ్రతంనక్షత్రపురుషంమార్తణ్డశయనంతథా ॥ ౮ ॥ కృష్ణాష్టమీవ్రతంతద్వద్రోహిణీచన్ద్రసంజ్ఞితమ్ । తటాకవిధిమాహాత్మ్యంపాదపోత్సవఏవచ ॥౯॥ సౌభాగ్యశయనంతద్వదగస్త్యవ్రతమేవచ । తథానన్తతృతీయాతురసకల్యాణినీతథా ॥ ౧౦ ॥ ఆర్ద్రానన్దకరీతద్వద్వ్రతంసారస్వతంపునః।సప్తమీసప్తకంతద్వద్విశోకద్వాదశీవ్రతమ్ ॥ ౧౧ ॥ ఉపరాగాభిషేకంచసప్తమీస్నపనంపునః । భీమాఖ్యాద్వాదశీతద్వదనఙ్గశయనంతథా ॥ ౧౨ ॥ అశూన్యశయనంతద్వత్తథైవాఙ్గారకవ్రతమ్ । మేరుప్రదానందశధాగ్రహశాన్తిస్తథైవచ ॥ ౧౩ ॥ గ్రహస్వరూపకథనంతథాశివచతుర్దశీ । తథాసర్వఫలత్యాగసూర్యవారవ్రతంతథా ॥ ౧౪ ॥ సఙ్క్రాన్త్యుద్యాపనంతద్వద్విభూతిద్వాదశీవ్రతమ్ । షష్టివ్రతానాం మాహాత్మ్యంతథాస్నానవిధిక్రమః ॥ ౧౫ ॥ ప్రయాగస్యచమాహాత్మ్యంభువనస్యతుకీర్తనమ్ । ఐలాశ్రమఫలంతద్వల్లోకేద్వీపానుకీర్తనమ్ ॥ ౧౬ ॥ తథాన్తరిక్షచారంచధ్రువమాహాత్మ్యమేవచ । భువనానిసురేన్ద్రాణాంత్రిపురప్లోషణంతథా ॥ ౧౭ ॥ పితృపిణ్డదమాహాత్మ్యంమన్వన్తరవినిర్ణయః । వజ్రాఙ్గస్యచసమ్భూతిస్తారకోత్పత్తిరేవచ ॥ ౧౮ ॥ తారకాసురమాహాత్మ్యంబ్రహ్మదేవానుకీర్తనమ్ । పార్వతీసమ్భవస్తద్వత్తథాశివతపోవనమ్ ॥ ౧౯ ॥ అనఙ్గదేహదాహస్తురతిశోకస్తథైవచ । గౌరీతపోవనంతద్వద్విశ్వనాథప్రసాదనమ్ ॥ ౨౦ ॥ పార్వతీఋషిసంవాదంతథైవోద్వాహమఙ్గళమ్ । కుమారస్యతథోత్పత్తిఃకుమారవిజయస్తథా ॥ ౨౧ ॥ తారకస్యవధోఘోరోనారసింహోపవర్ణనమ్ । పద్మోద్భవవిసర్గస్తుతథైవాన్ధకఘాతనమ్ ॥ ౨౨ ॥ వారాణస్యాస్తుమాహాత్మ్యంనర్మదాయాస్తథైవచ । ప్రవరానుక్రమాస్తద్వత్పితృగాథానుకీర్తనమ్ ॥ ౨౩ ॥ తథోభయముఖీనామదానంకృష్ణాజినస్యచ ।తత్రసావిత్ర్యుపాఖ్యానంరాజధర్మస్తథైవచ ॥ ౨౪ ॥ యాత్రానిమిత్తకథనంస్వప్నమఙ్గళ్యకీర్తనమ్ । వామనస్యతుమాహాత్మ్యంతథైవాథవరాహజమ్ ॥ ౨౫ ॥ క్షీరోదమథనంతద్వత్కాలకూటాభిశాసనమ్ । దేవాసురవిమర్దశ్చవాస్తువిద్యాతథైవచ ॥ ౨౬ ॥ ప్రతిమాలక్షణంతద్వన్మణ్డపానాంచలక్షణమ్ । ప్రాసాదలక్షణంతద్వత్ప్రతిష్ఠావిధిముత్తమమ్॥ ౨౭ ॥

——• ఏతత్పురాణపఠనఫలశ్రుతిః. •——

భవిష్యరాజ్ఞాముద్దేశో మహాదానానుకీర్తనమ్ । కల్పానుకీర్తనంతద్వద్గ్రన్థానుక్రమ
ణంతథా ॥ ౨౮ ॥ ఏతత్పవిత్రమాయుష్య మేతత్కీర్తివివర్ధనమ్ । ఏతత్సర్వగుణోపే
తమేతత్కల్మషనాశనమ్ ॥ ౨౯ ॥ అస్మాత్పురాణాదపిపాదమేకంపఠేత్తుయస్సర్వవి
ముక్తపాపః । నారాయణాఖ్యంపదమేతినూనమనఙ్గవద్దివ్యసుఖానిభుఙ్క్తే ॥ ౩౦ ॥
పురాణమేతత్సకలంరహస్యంశ్రద్ధాన్వితఃపుణ్యమిదంశృణోతి । కృత్వాశ్వమేధావ
భృథంశ్రీధరాయశృణోతివా॥ ౩౧॥ శ్రావయేద్వాపిధర్మజ్ఞస్తత్ఫలంశృణుతద్విజాః।
బ్రాహ్మణోలభతేవిద్యాంక్షత్రియోలభతేమహీమ్ ॥ ౩౨ ॥ వైశ్యోధనమవాప్నో
తిశూద్రస్తుసుఖమేధతే । ఆయుష్మాన్పుత్రవాన్ధన్యోలక్ష్మీవాన్పాపవర్జితః ॥ ౩౩ ॥
శ్రుత్వాపురాణమఖిలంశత్రుభిశ్చాపరాజితః ॥ ౩౪ ॥ * * *

ఇతిశ్రీమత్స్యపురాణే మత్స్యమనుసంవాదే చతుర్దశసాహస్ర్యాం
సంహితాయామేతత్పురాణానుక్రమణికాదికథనంనా
మైకోననవత్యుత్తరద్విశతతమోధ్యాయః.

సమాప్తమిదంమత్స్యపురాణమ్.

స్వస్త్యస్తు.

శ్లో॥ త్రైయ్యన్తసౌధవిలసన్నవముక్తికాన్తాసంసర్గకాఙ్క్షివిదుషఃకృపయాచ
కార। వ్యాసఃపురాణదశకేనసమాప్తకేనసోపానమార్గమతులంపృథులంమునీన్ద్రః॥ *

శ్లో॥ శ్రీవత్సవంశవిలసన్నవమౌక్తికశ్రీః పువ్వాడవేఙ్కటమణిఃపృథుకీర్తిరమ్యః॥
కాలక్రమేణశిథిలంహిపురాణజాతముద్ధర్తుమైహతయథాహరిరత్రధర్మమ్॥ *

శ్లో ॥ శ్రీమద్వేఙ్కటరాయభూసురమణిః పువ్వాడవంశోద్భవో నానాధర్మక
థావిచిత్రమతులంమాత్స్యంపురాణంమహత్ ।విద్వద్భిఃపరిశోధ్యలేఖనగతాన్దోషా
నకార్షీత్స్ఫుటంముద్రామన్దిరముద్రితంబుధజనానన్దాయధాత్రీతలే॥ * *





శ్రీరస్తు.

# శ్రీమత్స్యపురాణసారసంగ్రహవిషయసూచిక.



శ్రీరస్తు.

# శ్రీమత్స్యపురాణసారసంగ్రహము.

## మత్స్యావతారకథ - సంస్కృతము - అధ్యాయము - ౧.

శ్రీమద్రమారమణ చరణారవింద మకరంద పానానంద పరిపూర్ణహృదయారవింద దేవబృంద నిషేవితంబును, అగణ్య పుణ్యక్షేత్రతీర్థాది భరితంబును, సతత సద్ధర్మ నిష్ఠాగరిష్ఠ మునిజనశ్రేష్ఠనిలయంబును, అగు నైమిశారణ్యంబున ప్రవర్తిల్లిన దీర్ఘసత్రాంతంబున శౌనకాది మునివరులెల్ల పౌరాణికుండగు సూతునివలననేక పుణ్యపురాణాదుల వినియు దనియక యిట్లనిరి - మహాత్మా! అమృతంబెంత గ్రోలినను దృప్తిగలుగని చందంబున శ్రియఃపతి సత్కథలువినవినజవులు నిక్కుచుండు, కావున సకలచరాచరాత్మకంబగు ప్రపంచంబెట్లుబుట్టె? శ్రీవత్సుండు మత్స్యంబెత్తెరంగున నయ్యె? గౌరీపతికి భైరవత్వపురారిత్వ కపాలిత్వము లెట్లుగలిగె? వీనినిపుడు దెలియజెప్పుమని ప్రార్థించినసూతుండు ప్రీతిచేతస్కుండై వారింగనియోమునివరులారా! మీరలడిగిన యర్థంబు నెరుంగ గరతలామలకోపమానంబగు నుపాఖ్యానమును మత్స్యరూపియగు విష్ణుండే వక్కాణించియుండె. దానివివరించెదవినుడు.

పూర్వము సూర్యసుతుండగు మనువు మలయ పర్వతంబున నలువంగూర్చి కోటి వత్సరంబు లత్యుగ్రతపం బొనర్చిన నాకమలాసను డాతనికి బ్రత్యక్షుండై నీతపంబునకు మెచ్చితి వలయు వరమిచ్చెద వేడుమనిన నతండు ప్రళయకాలంబున సర్వప్రపంచంబులు నీటమునుంగుతఱి సకల భూతంబులును నాచే గాపాడబడునట్లువరంబొసంగుమని ప్రార్థించిన బ్రహ్మసమ్మతించి యవ్వరంబొసంగి యంతర్హితుడయ్యె.

అంత నారవినందనుడు పితృతర్పణము సేయుచుండనతనిదోసిట నొకచిన్నచేపపడిన దానిగని యారవిసూనుడు కరుణించి తనకమండలునందునిచె. అందదియొకయహోరాత్రంబుండి పదియారంగుళముల పొడవుంగలిగి తనకాకమండలు చాలదని మొరలిడ దానికతండు సంతసించి తత్క్షణంబ దానినెత్తి యొకమణికంబున (నీళ్లకాగున) నునిచె. అందది యొకరాతిరియుండి మూడుమూరల పొడవుగలదై యదిసగా జాలదు జచ్చెద రక్షింపుమని ప్రార్థించిన నతండు దానిగొని యొక నూతింద్రోచె. అదిసగా బట్టకుండునటుల మేను బెంచిన దాని నొకసరసిం

జేర్చె. అదియును బట్టకున్న నొక నదిని విడిచె. అదిసగా బట్టకపోయిన తుదకు సముద్రమునవిడిచె. అయిననేమి? ఆమీనము సముద్రముజొచ్చిన తోడనే జలధికల్లోలంబగునట్లు మేను బెంచి రెండు లక్షల యోజనముల ప్రమాణముగల శరీరముగలదై మరలదన్ను గాపాడమని మొరలిడియె. అందునకాతండు తనడెందంబున నాశ్చర్యంబంది యామీనముం గాంచి యిట్లనియె. ఓమత్స్యమా? ఇల నీలీలలు మున్నెన్నడును వినబడినవియును గనబడినవియునుగావు- కావున నాకుంజూడ నీవు అసురుడవో! లేక వాసుదేవుడవో! ఇంతియకాని వేరుగాదనిన నామీనంబమ్మనువుంజూచి నీవు నన్నెరింగితివని నుడివి యాతని కొకనావంజూపి యిట్లనియె. ప్రళయకాలమాసన్నమవుచున్నయది-, అపుడిప్పుడమి యంతయు వనపర్వత సహితంబుగ జలార్ణవంబున మునుంగుంగాన నక్కాలంబున నీవు జీవకోటినంతయు నీనావనెక్కించి కాపాడవలయు. పిదప యుగాదిని నీవుమనువై ప్రజలంబాలించెదవు. ఇంతియ కాదపుడు ప్రళయమారుత మీమహార్ణవమును గల్లోలము జేయుగాన నీ యోడ కదలును. ఐన నీవోడక యియ్యోడను నాశృంగంబునకు కట్టి నే మొదట నుడివినటుల భూతసముదాయంబు నేలుము.

అవాంతరప్రళయము, బ్రహ్మాండసృష్టియు - సం - అ - ౨.

అనిన మను వా మత్స్యంబుం గాంచి ప్రళయ మిక నెంతకాలమునకు సంభవించు? అట్టి లయకాలంబున నేభూతకోటిని రక్షింప నెట్లు సమర్థుడ నవుదు? నీ సంబంధంబు నాకెట్లు గలుగు? చెప్పుమని యడిగిన నా మత్స్యండిట్లనియె. ఇపుడు చాక్షుష మన్వంతరము నడుచుచున్నయది. దీని యవసాన మిది మొదలు మొదలిడినది కావున నిక నూరేండ్ల పర్యంతము తొలుత ననావృష్టిదోషంబును దత్కారణంబున క్షామంబును సంభవించు. పిదప సముద్రంబునం బుట్టెడు బడబాగ్నియు పాతాళలోకవాసియు జనార్దన స్వరూపుండునగు ఫణిపతి వక్త్రంబునుండి వెడలు నగ్నియు శూలిఫాలనేత్రాగ్నియు, నేకమై భూసారంబునంతం బీల్చి భూమిని గూర్మాకృతివలె ముద్దం గావించు. పిమ్మట నగ్నిస్వేదంబునం బుట్టెడు సంవర్తము, భీమనాదము, ద్రోణము, ఇంద్రము, వలాహకము, విద్యుత్పతాకము, శోణము, అను సప్తమేఘములు విజృంభించి యధికవృష్టిం గురియునపుడు సప్తసముద్రంబు లేకంబై పైనం జెప్పినమాడ్కి ద్రేతాగ్నులచే ముగ్ధగనున్న భూమినంతయు ముంచు. అపుడు నీవిచట మత్స్యభావంబుచే నుండుము. అపుడనంతనామక సర్పం బీనీటం దేలుచుండు. దానిచే నీ యోడను నాశృంగంబునకుగట్టుము. సూర్యచంద్రులు, నేను, సృష్టికారణుడైన బ్రహ్మ, నర్మదానది, మార్కండేయుడు, ధ్రువుడు, దేవతలు మొదలగు వారలును, వేదములు, పురాణసందోహము, విద్యలు, బీజ

ములు మొదలగునవి యును ఈ నావయందునే చేరక్షింప బడవలయునని చెప్పి యంతర్ధానము నొందిన మనువు సంతుష్టాంతరంగుండై భగవద్ధ్యానాయత్తచిత్తుండై యుండె.

అంత గొంత కాలంబునకు మత్స్యుండు వచించిన చాడ్పున లయము సంఘటిల్లిన తదాజ్ఞానుసరణి మనువు అనంతుని రజ్జువుగా గొని దానిచే నన్నావ నామీన శృంగంబునకుం గట్టి సమస్తంబును జలార్ణవంబున మునింగి యెల్లెడల గాఢాంధకారంబు వెల్లిగొని యుండుతఱి మత్స్యుని శృంగ సమీపవాసియై యుండి నమ్మత్స్యంబు నడిగిన నతనికి మత్స్యస్వరూపుండగు విష్ణుం డిప్పురాణమును జెప్పుటం బట్టి యిది మాత్స్యంబని పరంగు. అత్తెరంగెల్ల వివరించెద వినుడు.

అటులనా చేపకొమ్ము చెంత జేరి మనువు మత్స్యుంగాంచి దేవా ! స్థావరజంగమాత్మకంబగు ప్రపంచం బుత్పన్నం బగుటయు, ప్రళయ వివరణమును, వంశ వివరణమును, మన్వంతరములను, వంశానుచరితమును, భువన విస్తారమును, దానధర్మములను, శ్రాద్ధకల్పమును, వర్ణాశ్రమవిభాగములను, ఇష్టాపూర్తములను, దేవతా ప్రతిష్ఠలను, వివరించి నన్నుద్ధరింపుమని ప్రార్థించిన మత్స్యుండు తద్దయునొద్దిక చేనిట్లనియె.

ప్రళయంబున నెల్లెడల నీటివెల్లువలు వెల్లిగొని తమోమయమై యుండుతఱి నొక పరమపురుషుండు తనంతట తానే పుట్టె, కావున నతండు స్వయంభువు, ఆదిత్యుండు, బ్రహ్మ అను మొదలగు ననంత నామంబులం బరంగుచు బ్రకృతికిబరుడై యుండు. అతండు జగత్తును సృజించ నిచ్ఛాపరుడై తన వీర్యమును జలంబుల విడిచిన నందు స్వర్ణకాంతిగల యొకయండంబు పుట్టె. అట్టి గ్రుడ్డు వుట్టియు వేయు వత్సరముల పర్యంతమందు తేజోవిహీనమైయుండ నాపరమ పురుషుడు దానింజొచ్చి తన్మధ్యంబున వేడి వెలుంగై వెలిగిన నది యగ్రభాగంబునం జీలె. అందావిర్భవించిన బ్రహ్మభూనదీ పర్వతాదులను సృజించె.

### బ్రహ్మచేసిన సృష్టియు, బ్రహ్మకు నాలుగు మోములు గలుగుటయు- సం - అ- 3.

అనిన మత్స్యుం గాంచి అట్టి బ్రహ్మకు నాలుగు ముఖము లెట్లు గలిగె ? అతనికి లోక పితామహుడను నామంబు రాగతం బెట్టి ? చెప్పుమన నద్దేవుం డిట్లనియె.

ఆబ్రహ్మ వదనము వలన తొలుత సకల వేదంబులును, తదంగంబులును, పురాణమీమాంసాదివిద్యలునుపుట్టె. పిదప నాబ్రహ్మకు మరీచి, అత్రి, అంగిరస్సు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, ప్రచేతస్సు, వసిష్ఠుడు, భృగువు, నారదుడు అను మానస పుత్రులును. పిమ్మట నాతని దక్షిణాంగుష్ఠమున దక్షుడును పుట్టిరి. పిదప నాభిని ధర్ముడు, హృదయంబున మన్మథుడు, భ్రూమధ్యంబున క్రోధుడు, అధరమున లోభుడు, బుద్ధివలన మోహుడు, అహంకారమువలన మనస్సు, కర్ణముల

నుండి ప్రమోదుడు, నేత్రములనుండి మృత్యువు, అగంబువలన నేకకన్యయు నాత్మవిహీనసంతానముగా జనించిరి.

అనిచెప్పిన శౌనకాదులు సూతుం జూచి బుద్ధివలన మోహాంబుజనించెనన్నను డివితివి- అహంకారంబన నెద్ది? బుద్ధియన నెద్ది? నెరింగింపుమని యడిగిన నతండు వారల కిట్లనియె. సత్వరజస్తమంబులను త్రిగుణంబులు గలవు. వీటి సామ్యావస్థ మూలప్రకృతియని చెలంగు; దానిని కొందరుప్రధానం బనియు అవ్యక్తంబనియు వచించెదరు - అది మిశ్రంబై యందుండి త్రిమూర్తులుద్భవిల్లి సత్వంబున విష్ణుండనియు, రజంబున బ్రహ్మయనియు, దమంబున రుద్రుండనియు పరంగిరి- అయ్యవ్యక్తతత్త్వంబువలన మహత్తత్త్వంబు, నద్దాన నహంకారంబును బొడమె- అయ్యహంకార మూలంబున శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులను జ్ఞానేంద్రియ పంచకంబును, వాక్పాణిపాదపాయూపస్థలను కర్మేంద్రియపంచకంబును బుట్టె. అందు జ్ఞానేంద్రియములకు క్రమముగా శబ్దస్పర్శరూప రసగంధములు గుణంబులుగను, కర్మేంద్రియములకు క్రమముగ, ఉత్సర్గము, ఆనందము,ఆదానము, గతి, వాకు- అనునవిక్రియలుగను ఉండు. పై యింద్రియ దశకంబునకుమనస్సు పదనకొండవదియై యుండు. ఇంద్రియ గుణంబగు శబ్దంబువలన నాకాశముపుట్టుటంబట్టి యది శబ్దగుణము మాత్రము గలది. తద్వికారంబు వలన వాయువు జనించెం గాన నది శబ్దస్పర్శ గుణంబులంగలిగి యుండు. ఆస్పర్శ తన్మాత్రంబు వలన తేజస్సు గలిగెం గావున నది శబ్దస్పర్శ రూపంబులం జెలంగు. అత్తేజో వికారంబున నుదక ముదయించుటం జేసి యది శబ్దస్పర్శ రూప రసంబులంగలిగి వెలయు. ఆరస తన్మాత్రంబువలన భూమిప్రభవించి నందున నది శబ్దస్పర్శరూపరసగంధంబులను నైదు గుణంబులం గలిగి తక్కిన నాలుగు భూతములకన్న నెక్కుడు బలువై యుండు. ఇట్టి చతుర్వింశతి తత్త్వముల కతీతుండై పంచవింశతి తత్త్వాత్మకుండై యుండువాడు పరమాత్మ. ఇయ్యిరువదేను తత్త్వంబులంగూడి యిరువది యారవదిగా నుండునదియ శరీరము. అందు బుద్ధి కర్మగుణ యుక్తమై యుండు. ఇది యటు లుండనిండు. అమ్మనువునకు నమ్మత్స్యుడు ముందు జెప్పిన రీతిం జెప్పెద వినుండని సూతుండు మఱియు నిట్లనియె.

పైనం జెప్పబడినట్టి స్వాయంభువునకు బుట్టిన స్వాయంభువ మనువే విరాట్పురుషుడై వెలసె. అతని వెనుకటి యారుగురు మనువులును ముందురాగల సూర్యసావర్ణి మొదలగు నేడుగురు మనువులును బ్రహ్మసమానులే. సృష్టిహేతు భూతుండగు బ్రహ్మ తన హృదయంబున సావిత్రి నిడికొని సృష్టింజేయ దలంచుతఱి నతని తనువు అర్ధ పురుషాకృతిగను అర్ధనారీ రూపంబుగను అయి యాయర్ధనారీ రూపము శతరూపని యను నతి రూపవతియగు సుత యయ్యె. అది గాయత్రీ సరస్వ

త్యాది నామంబులచే బరంగు. బ్రహ్మ యమ్ముగ్ధియ సౌందర్యాతిరేకంబునకు గం
దర్ప శరాహత చేతస్కుడై యప్పడతి నెప్పుడును బొగడ దొడంగిన వసిష్ఠాదులు
దాని నెఱింగి మాకు సోదరియని మొఱలిడిరి- అయిననేమి? ఆకమల జునకెద్దియుదో
చకనుండె. అంత నాయువతి బ్రహ్మకు నమస్కరించి ప్రదక్షిణం బొనర్చుటకై దక్షి
ణదిశ కేగిన బ్రహ్మ నాయువతిని మోముద్రిప్పి జూచిన వసిష్ఠాదులు గందురనులజ్జ
చే దక్షిణపార్శ్వంబున నొక ముఖము గల్పించికొని యాలావణ్యవతి నాలోకింపదొ
డంగె. పిదప పశ్చిమదిశ కేగిన నతండు పశ్చిమంబున వేరొకవదనంబు గల్పించికొని
చూడసాగె. పిదప నాసుదతి యుత్తర దిక్కున కేగిన నా బ్రహ్మ యుత్తర ముఖ
ముం దాల్చె. ఇట్టులం జతుర్దిక్కులం జతుర్ముఖములు గలవాఁడై యక్కలువకంటిని
దిలకింప నారంభించిన నాశృంగారవతి గగనంబున కెగసిన యాబ్రహ్మ తన శిరం
బున సగా నొక వదనమును ధరించి యారమణీమణి యెందరిగినను బరికించుచు
మరీచ్యాదుల సృష్టిం గావింప ననిచి మనసిజబాణ జాలంబున కోర్వనేరక యా
నారీరత్నంబును వరించి కమలమందిరంబున నూరు వత్సరంబులు సుఖంబుననుండు
తఱి స్వాయంభువ మనువు పుట్టె.

నలువ మన్మథునకు శాపమిచ్చుట - సం - అ - ౪.

అని చెప్పిన మనువు వెఱగొంది మత్స్యం గాంచి యో భక్తవత్సలా! ఇది
యేటి విచిత్రంబు, సకల సృష్టికిం గారణభూతుండగు ప్రజాపతియ తన సుతను వ
రించునట్టి యకృత్యంబునకు లోబడందగునా? అనియడిగిన వనజనాభుం డిట్లనియె.
మహాత్ము లొనరించు కార్యంబులు దోషకృత్యంబులని దూషించిన దోషము వచ్చు.
ఆభాషామయోషాధిపు డొనరించినది దోషము కాదని వేదంబులుద్ఘోషించుచుండు
గాన దక్కువారల కెఱుంగ శక్యము గాదు. మఱియు నెచట భారతి యుండెడినో
యచట వారిజగర్భుండును, ఎచట నా పంకజాసను డుండెడినో యచట నా పంక
జేక్షణయు నుండెదరుగాని వారొండొరుల బాసి యేకాకిత్వంబున నుండరని తెలి
యుము. అటులాతఁడా కుటిలకుంతలను గూడకున్న నున్మాదియగుచుండెం గాన ద
త్సంసర్గము నింద్యంబుగాదు. అది యట్లుండనిమ్ము-అటుల నా స్రష్ట యాయొప్పుల కు
ప్పం గూడి తన కామంబు దీర్చికొని పిదప దెలివి నొంది కలువ విల్తుం దిలకించి కడు
నలిగి యిట్లు బలికె. ఓ మీనకేతనా! నీమష్టకృత్యమువలనగదా నే దెలివిం దప్పి
యాకలికిం గలియవలసె. కావున నీవు ఫాలనేత్రు కోపాగ్నిచే భస్మంబయ్యెదవు,
అని శపించిన మనసిజుడు కడు జడిసి జనకా! జనులనెల్ల నింద్రియ వ్యాపారత జి
క్కించి మగలకును మగువలకును దగులుపాటు సేయను నను నీవ పుట్టించి యట్టు
లొనర్ప నాజ్ఞ సగా నిచ్చితివి. త్వదాజ్ఞానుసరణి నేజేసినందుకు నాయందు నేర

మి లేకయ యూరక నిట్టుల దిట్టం దగునా ? ఐనను నేనటుల జపించిన పిదప మఱల దనువుం దాల్చునటుల ననుగ్రహింపుమని పలువిధంబులం బ్రార్థించిన నాసరసిజోద్భవుడు గరుణించి అట్లు నీవు దగ్ధంబై పోయినను వైవస్వత మన్వంతరంబున ధరను జనార్దనాంశచే యాదవ కులంబున నవతరించు బలరాముని తమ్ముండగు కృష్ణునకు సుతుడవై పుట్టి ప్రద్యుమ్నాఖ్యచే బఱంగి మఱి కొంతకాలంబునకు భరతవంశంబున వత్ససుతుడుగా జనించి కీర్తివడసి పిదప విద్యాధరాధిపతివై తుదకు మఱల నిప్పటి శరీరంబు నొందెదవని చెప్పె.

అని చెప్పిన ఋషులామన్మథుడు రుద్రకోపాగ్నిచే భస్మంబగుటయు, భరతవంశంబునంబుట్టుట మొదలగు కథలంజెప్పుమని వేడిన సూతుండిట్లనియె.

అట్లు బ్రహ్మ సరస్వతిం బొంది దానియందు సప్తాపత్యములను బుట్టించినవారు సర్వజ్ఞానసంపన్నులై నెగడిరి - పిదప నాబ్రహ్మ వామదేవ సనత్కుమారాది సుతులంగాంచి వామదేవుని సృష్టిగావింప నియమించిన నతండు బ్రహ్మక్షత్రియవైశ్య శూద్రులను, అనేక కోట్లసాధ్య గణములంబుట్టించిన స్రష్ట వామదేవుంగని జరామరణంబులులేని కోట్లకొలది సాధ్యులంబుట్టించియు వ్యర్థంబనిన నతండు సృష్టికి విముఖుండయ్యె.

అంత స్వాయంభువమనువునకు ప్రియవ్రత, ఉత్తానపాదులను నిరువురు తనయులు జనించిరి. అందుత్తానపాదునకు, అయంపత్యాది సుతులుగలిగిరి - ధ్రువునకు శిష్టియు, నతనికి రిపుచాక్షుషాదులును, చాక్షుషునకు ఊరు పురూరవాదులును, ఊరువునకు అంగుడు వేనుడు మొదలగు వారలును, వేనునకు బృథుచక్రవర్తియు బృథువునకు హవిర్ధానాదులును హవిర్ధానునకు ప్రాచీనబర్హిస్సు మొదలగువారలును, ప్రాచీన బర్హిస్సునకు ప్రాచేతసులును, ప్రాచేతసదశకంబునకు దక్షుడును, దక్షునకు అనంత భద్రవతులునుగలిగిరి. మఱియు నాదక్షుడు రెండుమూడు నాలుగు మొదలగు పాదంబులును ఉలూకవ్యాఘ్రశ్వానసూకర ఉష్ట్రము మొదలగు వికారముఖంబులుంగల దేవదానవమనుష్యాదుల బెక్కండ్రంబుట్టించె.

దక్షసృష్ట్యాదివివరణము - సం - అ - ౫.

మఱియు దక్షుడు ప్రాచేతసులకుబుట్టక పూర్వము స్మరణమాత్రంబునను, దర్శనమాత్రంబునను, స్పర్శమాత్రంబునను, కోట్లకొలది సంతానము గలుగుచుండెంగాని మిథున సంయోగంబున సంతానాపేక్షయుండనందున దక్షునకుయేబదివేల సుతులు గలిగి జనుల సృజింపబూనిన నారదుడు వారల కడకేగి మీరెల్లనీతీరున సృష్టిసేయదొడంగిన మీరు సృజించెడు ప్రజలంబట్టి భూమి చాలెడినో చాలదో,

కావునదొలుత భూప్రమాణము నెఱింగిపిదప సృజింపుడని చెప్పిన వారలాతని వాక్యపద్ధతి భూప్రమాణ మరయనేగి సముద్రంబుంజొచ్చునది చాడ్పున మఱలదిరుగనైరి - అంతదక్షుడు వేరు సహస్రసుతులంగనిన నారదుడు వారలనగా భూ విస్తీర్ణము దెలిసికొనుటకును దమయన్నల జాడ నెఱుంగుటకును, అనిచినవారలు నగావారియన్నల దారిపోయిరి కాని మఱలరైరి. కావుననే యీలోకంబున దేశాంతర్గతులగు నన్నలను వెతకుటకు దమ్ములు చనిన నశుభంబుగలుగునను పద్ధతి యాచరణీయంబై యున్నది. పిదప దక్షుడు వైరిణియందు నఱువది కన్యలంగని వారల ధర్ముడు కశ్యపుడు, చంద్రుడు మొదలగువారికిచ్చి బరిణయ మొనరించె. అందుధర్ముని సతులలో విశ్వయనుదానికి విశ్వే దేవతలును, సాధ్యకు సాధ్యులును, మరుత్వతికి మరుత్వంతులును, వసువుకు వసువులును, భానుకు భానవులును, ముహూర్తకు ముహూర్తములును, రేవకు ఘోషులును, జామికి నాగవీధ్యులును, బుట్టిరి. అందు వసువులు, ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు, అన, అష్టవసువులు. వీరిలో ప్రభాసుసుతుండగు విశ్వకర్మ శిల్పవిద్యానిపుణుడై వెలసె. ఆధర్మునిసంతతియందే, అజైకపాదుడు, అహిర్బుధ్న్యుడు, విరూపాక్షుడు, రైవతుడు, హర్యశ్వుడు, బహురూపుడు, ప్రబలుడు, సావిత్రుడు, జయంతుడు, పినాకి, అపరాజితుడు, అను నేకాదశరుద్రులు వుట్టి యెనుబదికోట్ల బలముం గలిగి దిక్పాలుంగా పాడుచుండెదరు.

కశ్యపసంతతి - సం - అ - ౬.

ఇక గశ్యపుభార్యలలో నదితికి జాక్షుష మన్వంతరమున దేవతలుగానున్న వారలు వైవస్వతమన్వంతరమున, ఇంద్రుడు, ధాత, భగుడు, త్వష్ట, మిత్రుడు, వరుణుడు, యముడు, వివస్వంతుడు, సవిత, పూషుడు, అంశుమంతుడు, విష్ణువు, అన ద్వాదశాదిత్యులుగలిగిరి - దితికిహిరణ్యకశిపు హిరణ్యాక్షులు జనించిరి. అందుహిరణ్యకశిపునకు ప్రహ్లాదాదులును, ప్రహ్లాదునకు శిబి, విరోచనాదులును, విరోచనునకు బలియు, బలికి బాణాదిపుత్రశతంబును బొడమిరి. ఈబాణుడు సహస్రకరములం గలవాడై శివునారాధించి తత్సమానపదవినుండె. హిరణ్యాక్షునకు దుర్ధరాదులు గలిగిరి. వారి సంతానంబు డెబ్బదేడుకోట్లకొలదిగలదై లోకంబంతయు వ్యాపించె. కశ్యపుమూడవభార్యయగు దనువుకు, విప్రచిత్తి, మరీచి, మయుడు, తారకుడు, స్వర్భానుడు, వృషపర్వుడు మొదలగు నూర్వురు కొమరులుద్భవిల్లిరి. అందు విప్రచిత్తికి సైంహికేయుడును, సర్భానునకు శచియు, మయునకు ఉపధ, మండోదరి, కుహువులును, వృషపర్వునకు శర్మిష్ఠ చంద్రలును, మరీచికి పౌలోమకాలకేయులును ప్రభవించిరి. వీరిలో పౌలోమకాలకేయులఱువదివేల సంఖ్యగలవారై హిరణ్య గ

ర్భువరప్రభావంబున హిరణ్యపురమున గండుమీరియుండ బాండవ మధ్యముండగు గాండీవి వీరలనెల్లం జెండాడె. వినతకు అరుణుడును, గరుడుడును సౌదామినియను కన్నియయు గలిగిరి. అందు అరుణునకు సంపాతి జటాయువులు బుట్టిరి. వీరిసంతతి యేగృధ్రంబులు - కద్రువకును, సురసకును సర్పంబులు జనించె. ఈసర్పంబుల జనమేజయుడు సర్పయాగంబున నశింపజేసె. (కాకున్న నీలోకంబంతయు సర్పమయమై యిప్పటికన్న నెక్కుడు బాధవాటిల్లు) ఇక గశ్యపునితక్కు భార్యలకు, కిన్నెర గంధర్వ యక్షరాక్షస వృక్షులతా గుల్మాదులు జనించె. మఱియు గశ్యపు తేజంబునదితికి నలువది తొమ్మండ్రు మరుత్తులుపుట్టిరి.

మరుత్తులజననము - సం - అ - ౭.

అనినమునులచ్చరువంది సూతుంజూచి దైత్యులమాతయగుదితికిబుట్టినమరుత్తులు దేవతలలో నెట్లుగలిసిరి? దాని వివరింపుమని వేడిన నతండిట్లనియె. దితి తన సుతులగు దైత్యులకు దేవతలవలన నపజయంబు గలుగుటకు జింతించి తపంబొనరింపుచుండ వసిష్ఠాదు లవ్వనితను మదన ద్వాదశీవ్రతము సలుపునటులంజేసిరి - అవ్వ్రతము సేయుతెఱంగెట్లన్న - చైత్రమాస శుక్లపక్షంబున ద్వాదశినాడు నియతిచేనుండి యొకవ్రణ్మయపాత్ర నలంకరించి, ఫలేక్షుఖండాదుల దానమొంచి విధిపూర్వకముగ బూజించి వివిధభక్ష్య నైవేద్యంబుల సమర్పింపవలయు - మఱియు నొక రాగి ప్రాతయందు గుడమునుంచి యావ్రణ్మయకలశంబు పైనిడవలయు. ఆ పాత్రాంతర్గతగుడంబుపై కదళీపత్రంబునునిచి కనకాకృతిగల మదనుని దద్వామభాగంబున రతీదేవిని స్థాపించి విధి పూజలంజేయవలయు. అట్లు జేయంజాలరేని మదనకేశవు లనేకాకృతిగ నొనర్చియైన నవ్విష్ణుని మన్మథనామంబులచే బూజింపవలయు.మఱియునావ్రతమాచరించువారా ద్వాదశీదినంబున నిరాహారతనుండి త్రయోదశీదినంబున శక్తికొలది హరిపూజం జేయవలయు. ఇట్లు బదమూడు శుక్ల ద్వాదశులు వ్రతముసలిపి పదమూడవ ద్వాదశిని ఘృతధేను శయ్యాదానంబు లొసంగవలయు. పిదప నొక పత్నీయుక్తుడగు సద్బ్రాహ్మణునకు మన్మథ ప్రీతిగా నాబంగరు ప్రతిమ నిచ్చి తత్ప్రతిమాదక్షిణగా నొక తెల్లయావు నివ్వందగు. పిదప దెల్లనుప్పులను ఆవునెయ్యి క్షీరాన్నము, వీటిని మదన ప్రీతిగా హోమము సేసి శక్తికొలది బ్రాహ్మణ భోజనాదు లొసంగవలయు. ఇట్లు జేసిన నీలోకంబున బెక్కండ్రు పుత్రులం బడసి సుఖించుటయ గాక యంత్యంబున విష్ణు సాలోక్య పదవిం గను.

ఇట్టివ్రతమును సలిపి దితిధన్యయై యుండ గశ్యపుడా మగువ కడకేతెంచిన నతనిగాంచి దితి దేవతలం బరిభవింప సమర్థుండగు నొక కొడుకు నాకు బుట్టునట్టులనను గ్రహింపు మనిన నతండు నీకోరినట్టుల నిపుడు ఆపస్తంబుడు పుత్రేష్టిని

జేయించి నీసునోవాంఛితంబుమాడ్కి జేయునని చెప్పి చనియె. అంత నాపస్తంబుడు పుత్రేష్టిని జేయుచో నింద్రుని జయించునట్టి సుతుని పొందుమని శుభాశీర్వాదం బొనర్చిన నాఫలంబునను గశ్యపు తేజంబునను దితి గర్భము దాల్చె. ఆసమయమున గశ్యపుడు దితికడ కరుగుదెంచి యో తరుణీ! నీవు దాల్చిన గర్భమునూరేండ్లు కాపాడితివేని పరాక్రమ వంతుండగు సుతుడు జనించు గావున నీవతి జాగరూకత నీగర్భమును గాపాడవలయు. ఎట్లన్న. సంధ్యాకాలంబున భుజించుటయు నొక చోటనే కూర్చొని యుండుటయు చెట్టునీడం జనుటయు, రోలు రోకలి మొదలగు వానిపై కూర్చుండుట యు, నీళ్ల దొంగిచూచుటయు, పాడిండ్ల కేగుటయు, పుట్టలపైకూర్చుండుటయు, చింతాభరితయై యుండుటయు, గోళ్లచేనేని బూడిదె బొగ్గులచేనేని భూమినిగీచుటయు, ఎపుడును శయ్యంజేరి యుండుటయు, అలసటగలుగునటుల సంచరించుటయు, ఊముక, బొగ్గులు, బూడిదె, ఎముకలు, పుర్రెలు, వీటిపైకూర్చుండుటయు, కలహము సేయుటయు,శరీరమును గదలించుటయు, వెంట్రుకల విరియబోసికొని యుండుటయు, అపరిశుద్ధముగానుండుటయు, పశ్చిమోత్తరముల శిరంబునిడిపరుండుటయు, వస్త్రిము లేకయుండుటయు, తడికాళ్ల చేనుండుటయు,అశుభ వాక్కుల బలుకుటయు, వీటినివర్జించి గురుశుశ్రూష సేయుచు నోషధిమిశ్రితోష్ణోదక స్నానం బొనర్చుచు వాస్తుపూజ సేయుచు గర్భిణి స్త్రీ యుండవలయు. నీ వీరీతియ యుండ వేని నీగర్భంబు పతనం బగునని చెప్పి నిజేచ్ఛం జనియె.

పిదప దితి పతివాక్యానుసరణి వ్రతమునలుపుచుండ నింద్రుండా తన్విగర్భంబును భేదింప గడంగి శుశ్రూష జేయు నెపంబున దితికడ కేగుదెంచి కడువినయంబునం బ్రవర్తింపుచు నాయమ దురాచారం బొనర్చిన తత్క్షణంబ గర్భంబు ఛేదింప సమయము నన్వేషించుచుండె. అంత నాదితి కడుపరిశుద్ధత దొంబది తొమ్మిదేండ్లు పదునకొండు మాసములు ఇరువదేడు దినము లుండి నాపతిచెప్పిన వ్రత కాలము గడిచెంగదా? ఇక మూడుదినము లున్నవి, నేనిన్నాళ్లు క్రమంబుగ నుంటినని యుబ్బిమైమఱచి దివాకాలంబుననే పాదశౌచ మొనరింపక శయ్యంజేరి వెంట్రుకల విరియ బోసికొన్ని నిద్రించె. అట్టి యశుచి సమయాసన్నమున కింద్రు డెదమెచ్చి దితిగర్భముం జొచ్చి తద్గర్భస్థుని నేడు ఖండములుగ ఖండించె. అందునంజేసి యయ్యేడు ఖండము లేడ్వసాగిన నింద్రుండు వారల నెంత వారించిన వారలేడుపు లుడుగకున్న నతండా యేడుతునియలను మఱల నొక్కొక్కదాని నేడేడు ఖండములం జేసె. ఐన నానలువది తొమ్మిది తునకలు చావక యేడ్వసాగిన నింద్రుం డదియంతయు మదన ద్వాదశీవ్రతఫల పరిపాకంబని నిజదివ్య దృష్టి నెఱింగి వారిగొని దితి నాదరించి దితిసయితము నాకంబున కేగె. అన్నలువది తొమ్మండ్రు, (మారుదః అనగా

నేక్ష్వవద్దు.) అను కారణంబున మారుతులనియు మరుత్తులనియు బఱంగి దానవమై త్రిలోక దేవాళింగూడి నాకవాసులై యజ్ఞ హవిర్భాగ భోక్తలై యున్నారలు.

పృథ్వ్యాదిరాజ్యాభిషేకము - స - అ - ౮.

అనిచెప్పినసూతుంజూచిమునులు పౌరాణికోత్తమా ! ఆది సర్గ వివరణముం జెప్పితివి. అందు ప్రభువులుగానున్న వారల నెఱుంగింపుమనిన నాతండు వారలకి ట్లనియె.

స్రష్టయట్టుల సృష్టింజేసి భూమికి బృథుచక్రవర్తిని, ఓషధీయజ్ఞ వ్రతనక్షత్రాదులకు జంద్రుని, ఉదకమునకు వరుణిని, ధనమునకును యక్షులకును గుబేరుని, ద్వాదశాదిత్యులకు విష్ణుని, వసువులకగ్నిని, ప్రజాపతులకు దక్షుని, దేవతలకు శక్రుని, దైత్యదానవులకు బ్రహ్లాదుని, పితరులకు యముని, పిశాచరక్షఃపశుభూత యక్షబేతాళములకు శివుని, పర్వతములకు హిమవంతుని, నదులకు సముద్రుని, గంధర్వవిద్యాధరకిన్నరులకుజిత్రరథుని, సర్పములకువాసుకిని, దిగ్గజంబులకైరావతంబును, పక్షులకు గరుత్మంతుని, హయములకు నుచ్చైశ్శ్రవస్సును, మృగములకుసింహంబును, వనస్పతులకు బ్లక్షంబును,తూర్పుదిక్కునకు సుధర్ముని,దక్షిణదిశకు శంఖపదుని, పశ్చిమమునకు సుకేతుమంతుని, ఉత్తరమునకుహిరణ్యరోముని, అధిపులుగనేర్పఱిచె. వీర లేయిపుడయ్యె యధికారంబులంగలిగి యుందురు. అందుగడపటి నలువురే చాక్షుషమన్వంతరానంతరము వైవస్వతమన్వంతరంబున బృథుచక్రవర్తిని భూమీపతిగా నభిషేచన మొనర్చెదరు.

మన్వంతరవివరణము - స - అ - ౯.

అనిచెప్పిన మత్స్యుంగాంచి మనువు మన్వంతరముల వివరణమును జెప్పుమని వేడిన మత్స్యుండు సంగ్రహముగ జెప్పెదవినుమని యిట్లనియె.

స్వాయంభువమన్వంతరంబున యాములను దేవతలును మరీచ్యాదిసప్తర్షులును, అగ్నీధ్రుడు మొదలగుమను పుత్రులును, స్వారోచిషమన్వంతరంబున దుషితులు దేవతలుగను, దత్తాది సప్తర్షులును, నభస్సుమొదలగుమను పుత్రులును, ఉత్తమ మన్వంతరంబున భానవులు దేవతలుగను, కౌకరండ్యాది సప్తర్షులును, ఇషాదిమను పుత్రులును, తామసమన్వంతరంబున సాధ్యులు దేవతలుగను, కవ్యాదిసప్తర్షులును, అకల్మషాదిమనుపుత్రులును, రైవతమన్వంతరంబున భూతరజులు దేవతలుగను దేవబాహ్వాదిసప్తర్షులును, అరుణాదిమను పుత్రులును, చాక్షుషమన్వంతరంబున లేఖులు దేవతలుగను, భృగ్వాదిసప్తర్షులును, ఊరువాదిమను పుత్రులును, వెలసిరి;

ఇంకరాగలవైవస్వత మన్వంతరంబున సాధ్యాది దేవగణంబులును, అత్ర్యాదిసప్తర్షులును, ఇక్ష్వాక్వాదిమనుపుత్రులును, తక్కు మన్వంతర ములయందు వీరలే వేరు నామంబుల భాసిల్లెదరు.

భూమికిపృథ్వియను పేరువచ్చుటయుభూమిగోవగుటయు - స - అ - ౧౦.

అని చెప్పినవిని మునులు సూతుంగాంచి యిద్ధచరిత్రా! గోరూపంబగు నిద్ధరకు బృథ్వియను నామంబెట్లుగలిగె? తెలియంబలుకుమని ప్రార్థించిన నతండిట్లనియె. తొల్లిస్వాయంభువ వంశంబునంబుట్టిన అంగుడను వానికి దుర్ముఖసునీథయను రెండుపేళ్లచే వెలయు మృత్యువు సుతయందు వేనుడను పుత్రుడుగ్గలిగి కడు దుర్మార్గుడై పరదారల బరిభవింపుచుండ సైరింపక విప్రులెల్ల వానిబట్టికట్టి మథించినవానివామపార్శ్వంబునుండి మ్లేచ్ఛులుపుట్టిరి. దక్షిణహస్తంబునుండి పృథురోముడను సుతుడుజనించె. ఆపృథురోమునకు బృథువుగలిగిహరిపూజాపరుడై విష్ణువలన సర్వప్రభుత్వమును వడసి విప్రులచే రాజ్యాభిషేచనముంగొని భూమియందెచ్చటచూచినను సారములేక ఆచారములుచెడి స్వాధ్యాయాది పఠన వర్జితంబగు భూమింగాంచి కోపగిల్లి చేతధనువుంబూని భూమిని గాల్పంగమకించిన పుడమి గడగడవడంకి యొకగోవైపరువు లిడందొడంగె. ఐనను బృథువుదాని వెన్నంటియెందు జనినను విడువకున్నం దుదకు నాగోవునిలిచి పృథువుంగాంచి నన్నేల నలజడపెట్టెదవు? నీకేమి కావలయునో కోరుమిచ్చెదనన్నిన బృథువు ధరాగోవుంజూచి సకలప్రాణులు బ్రతికియుండుట కాధారంబెద్దియో దాని నిమ్మనియడిగె. అందునకాయావు నాపాలు పితుకమని చెప్పిన సంతసించి స్వాయంభువునివత్సంబుగాగొని తనదోసిట పాలుపితికినదానినుండియన్నముపుట్టి సర్వజీవకోటికి నాధారభూతమయినయది. ఇదిగని ఋషులు తమకాధారము లేదనివచ్చిరి. వారిలోబృహస్పతి, చంద్రునివత్సముగను, వేదములంబాత్రగనుగొని పితకగాదపోరసంబుజనించె. మాకునేమియులేదని వగచి దేవతలు ఇంద్రునివత్సముగనిడి మైత్రునిచేస్వర్ణపాత్రయందు బితికించిన బలము గలిగె. దీనిజూచిపితరులకుగాను, అంతకుడు యముని దూడగాగొని రజితపాత్రంబితికిన స్వధారసముపుట్టె; దానింగాంచిసర్పములుప్పొంగి తక్షకుని వత్సగానిడి ప్రవాళ పాత్రయందు ధృతరాష్ట్రుడను సర్పముచే బితికించిన విషముత్పన్నంబయ్యె. పిదపరాక్షసులు విరోచనుని దూడగానిడి అయస్పాత్రను విమూర్ధునిచే బితికించినమాయజనించె. పిమ్మటయక్షులు కుబేరుని దూడగానిడి మృణ్మయపాత్రలోబితికిన అంతర్ధానముసంభవించె. ఆవెనుక ప్రేతములు సుమాలిని వత్సముగానిడి రౌప్యనాభునిచే బితికించిన రక్తముత్పన్నంబయ్యె. పిదప గంధర్వులు చిత్రరథునివత్సంబుగాగొని వసురుచిచే బితికించినగానవేదముడ

యుంచె. పర్వతములు హిమవంతుని వత్సముగా నిడి మేరువుచే బితికించిన నోషధు లుపుట్టె. తుదకు వృక్షములు పితికిన నవి ఛేదింపబడి వేలు స్థలంబున నాటంబడె నేని మఱల జిగురించు సారమును పొందె. ఇటుల నాగోవు యెల్లవారల యుల్లంబుల కుల్లాసము కొల్ల గొల్పి మఱల ధరాకృతి బూనె. అట్టి గోరూపయగు ధరను బృథుచక్రవర్తి బితికెంగాన నది పృథ్వి యనం బఱంగె. దానంజేసి దాని నేలువారలెల్లం బార్థివులని పేరొ్కందురు.

సూర్యవంశవివరణము. స - అ - ౧౧.

ఇట్లు వక్కాణించిన సూతుంజూచి ఋషులు సూర్యచంద్రుల వంశవివరణమును జెప్పుమని యడిగిన నతండు వారల కిట్లనియె. కశ్యపునకు నదితియందు సూర్యుడుపుట్టె. ఆసూర్యుని ముగ్గురు భార్యలలో రాజ్ఞియనుదానికి రైవతుడును, ప్రభయనుదానికి ప్రభాతుడును, సంజ్ఞ యనుదానికి మనుయములనునిరువురు సుతులును, యమునయను సుతయుజనించిరి. పిదపసంజ్ఞ తనశరీరమునుండి ఛాయయను వనితను బుట్టించిననది సంజ్ఞంజూచిన న్నేలబుట్టించితివి ? నే జేయందగు పనియెయ్యది ? చెప్పుమనియడిగిన సంజ్ఞ దానిం గాంచి నీవు నామాఱుగా నాభర్తయొద్ద నీవే నేనను భావము పుట్టించి యుండి నాబిడ్డల నందఱ గారాబంబున గాపాడుచుండుమని చెప్పి నిజేచ్ఛంజనియె. అంత నాఛాయకు సూర్యునితేజంబువలన సావర్ణి మనువు శనియనుకొమరులును, తపతి, విష్టియను గన్యలును గలిగిరి. కావున నాఛాయ తనబిడ్డలయందుంచిన వాత్సల్యము సంజ్ఞకొమరులయం దుంచకుండిన యముడది తెలిసికొని యాఛాయను దన యెడమకాలందన్నె. అందున కాయమ కోపించి యతనిపాదంబున గీటకంబులుపడి రక్తముగాఱునట్టులం దిట్టె. ఈశాపంబందు యముడు తండ్రికడకేగి తండ్రీ! నాయన్న యెంతవలదని చెప్పినను వినక నాజనని నాకాలంబు రుగులు వడునట్లుశపించినది. ఈసతి సుతులయెడ సమాన వాత్సల్యము లేకుండుట జూడ నీయమ మాజనని కాదని తోచుచున్నదనెను. అందునకు సూర్యుడు సేయునది లేక నీకర్మంబుకొలదివచ్చిన శాపం బనుభవింపకతీరదు. ఐనను నీపాదంబుననుండు పురుగులు భక్షించుటకై యొక కుక్కుటంబు నిచ్చెదననిన యముడు దానింగైకొని గోకర్ణక్షేత్రంబునకేగియందు శివుంగూర్చి కోటివత్సరంబులు నిష్ఠుర తపంబు సలిపి యాపశుపతిని మెప్పించి తాను లోకాధిపతియు పితృదేవాధిపతియు ధర్మపరి శీలకుండును అగునట్లువరంబు వడసె.

అంత సూర్యుడు ఛాయయొక్క చేష్టలచే నది సంజ్ఞకాదని యెఱింగి సంజ్ఞాజనకుండగు త్వష్టపాలికేగి తనసతివృత్తాంతం బడిగిన నతం డిట్లనియె. సంజ్ఞ నీ

తేజంబునకు సహింపనేరక నాయొద్ది కేతెంచిన బెద్దకాలమాడువారు పుట్టినింట నుండం దగదని చెప్పి నేననుపగా నదినీవేడిమి కోడి భూమిని మేరుపర్వత సమీపంబున నశ్వాకృతి బూని తపంబు సేయుచున్నది. కావున నీవు నాపై కోపగించకున్న నీ తేజము నొరచెదనని చెప్పి యతని సమ్మతిగొని యతని తేజము నొరచి యందు బుట్టిన రజంబుచే విష్ణునకు జక్రంబును శివునకు త్రిశూలంబును ఇంద్రునకు వజ్రాయుధంబును జేసి యిచ్చె. అంత దివాకరుడు సౌమ్యరూపుడై సంజ్ఞ తప మొనరించు తలంబున కేగి తాను అశ్వాకృతిబూని గోడిగయైయున్న సంజ్ఞముఖము నాఘ్రాణించిన దాని నాసికారంధ్రములనుండి యశ్వినీ దేవతలు జనించిరి. పిదప సూర్యుడును సంజ్ఞయు నిజరూపములం దాల్చి నిజస్థానంబున కరిగిరి. సూర్యుని సంతానములో వైవస్వతుడు మనువయ్యె. యముడు పితృపతి యయ్యె. శని గ్రహసామ్యంబు నొందె. యమునాతపతులు నదులైరి. విష్టి మహాపుణ్య కాలమయ్యె. సావర్ణియిక మనువు కాగలడు.

సూర్యవంశజుడగు ఇళునకు స్త్రీరూపము గలుగుట.

పై వైవస్వతునకు, ఇళుడు, ఇక్ష్వాకుడు, మొదలగు పుత్రులు పుట్టిరి. అందు జ్యేష్ఠుండగు ఇళుని రాజ్యాభిషిక్తుం గావించి తండ్రివనంబున కేగె. ఇళుడు కడుబల పరాక్రమ వంతుడై దిగ్విజయము చేయబూని సమస్త దేశంబులు ద్వీపములు మొదలగువాని నెల్లం దిరిగి వనపర్వతాదులం సంచరింపుచు శరవణమను శంకరుని యుద్యాన వని కరిగె. అందు సదాశివుడు గౌరీయుతుడై క్రీడించుచుండుటంజేసి యత్తలంబున దశయోజనముల వలయము లోపలికి వచ్చెడు నే పురుషజంతువేని స్త్రీరూప మొందునట్లు వచించియుండె. దీని దెలియక యామానవనాయకు డావనముజొచ్చి తనగుఱ్ఱము సయితము స్త్రీత్వము నొంది యసమాన రూపలావణ్యాది విశేషంబులం దేలుచు బూర్వ స్మరణను మఱచి తనలో దాను నేనెవ్వానిసుతను ? ఇవ్వనంబున కేల వచ్చితి ? నావిభు డెవ్వండు ? అనితలపోయుచు విహరించుతఱి జంద్ర సుతుండగు బుధుడా సమీపాశ్రమ వాసి యగుటచే బువ్వులకై వచ్చి యవ్వనిత నీక్షించి పువ్వువిలుకాని చిక్కులంజిక్కి యక్కలికి జాడల తనదివ్యదృష్టి నెఱింగి దాని డగ్గరి యయ్యిళ తనసతియను భావము దానికిదోచునట్లు బిగ్గరనిట్లనియె. ఓయిందుముఖీ ! నీవీచందంబున మందిరంబునువదలి గృహకృత్యంబులమాని యింత తడవిక్కడ నొక్కతియ యుండందగదు. ఇంతకును, ఇది సంధ్యాకాలముగాన వనవిహార సమయముకాదు. అనిన నావనజనేత్రియాతని గాంచి యోసుందరాకారా ! ఔనౌను, నను నేమఱచియుంటిని, ఐనను నీవెవ్వండవు? నేనెవ్వతెను? చెప్పుమనియడిగిన నతండిట్లనియె. నీవుయిళ నేకాముక నామధేయుండగు బు

ధుడను తేజోవంతునకు బుట్టినవాఁడను. మజ్జనకుఁడు ద్విజపతియై వెలయు. కావున నీవిం కదడవు సేయ నేల రమ్మనిన నమ్ముద్దుగుమ్మ యాతని వెంటనరిగి సర్వాలంకార భూషితమగు నాతనిమందిరంబును గాంచి తన డెందంబున నానందించి ఆహా ! నా పూర్వకృతపుణ్యమేమందు ? నాకెట్టియుత్కృష్టభవనంబబ్బె ? నేనెంతటి యైశ్వర్యవంతనైతి ? ఇవియన్నియు గాక నాసౌందర్యము నతిక్రమించు మగనింగంటినని తలంచి యాబుధుని సతియై యతని గూడివలుగతుల రతిక్రీడలందేలుచుండె.

ఇక్ష్వాకుప్రభృతులిళుని వెదకుట - స - అ - ౧౨.

అంత నాయిళుని సోదరులగు నిక్ష్వాకుప్రభృతులు తమయన్న దిగ్విజయార్థమేగి పురంబునకు మఱలి రాకుండుటకు గడుదిగులొంది యాతని నెల్లదిక్కుల నరసి తుదకు శరవణసమీపంబున కేతెంచి యచ్చట నొకగోడిగం గాంచి దాని నలంకరించిన భూషణంబులచే నదితమయగ్రజు హయముగా నెఱింగి యది తొలుత ఘోటకముగానుండి యిపుడు ఘోటియై యుండుటకు గారణము దెలియనేరక తమకులగురుండగు వసిష్ఠునడిగిన నతండు తనదివ్యదృష్టిచే నంతయు నెఱింగి యిళుఁడు శరవణముజొచ్చి పార్వతివాక్యానుసరణి స్త్రీత్వము నొందుట మొదలగు వానిం జెప్పె. అప్పుడా యిక్ష్వాకు ప్రభృతులు గౌరీసమేతుఁడై యుండు పురారికడకేగి యద్దేవు బహువిధంబుల వినుతించి తమయన్నకు మఱల బురుషత్వము గలుగనట్టుల ననుగ్రహింపుమని ప్రార్థించిన నతండు కరుణించి యిక్ష్వాకుఁడు మదర్పితంబుగ నొకయశ్వమేధయాగ మొనరించెనేని నిళకింపురుషుఁ డగునని యానతినొసంగె. తదాజ్ఞానుసరణి నిక్ష్వాకుఁడశ్వమేధముం జేసిన దత్ఫలంబున నిళకునొకమాసము పురుషత్వంబును, ఒకమాసము స్త్రీత్వంబును గలుగుచుండె. అట్టి స్త్రీత్వంబున బుధునకు బురూరవుఁడను సుతుం గనియె. పురుషత్వంబున సుద్యుమ్నుఁడన బఱంగి ఉత్కలుఁడు, గయుఁడు, హరితాశ్వుఁడు, అనముగ్గురు తనయులం గాంచె. పైపురూరవుఁడు సూర్యచంద్రవంశంబుల రెంటికిని దీపకుఁడై ప్రతిష్ఠానపురమేలె. ఉత్కలాదులును, ఇక్ష్వాక్వాదులును తక్కు దేశంబులం బాలించిరి. ఇట్లొనర్చి యయ్యిళుఁడు తపంబునకరిగె. అతనింబట్టియే యతనిరాజ్యము యిళావృతవర్షమనంబఱగె. మఱియు నీసూర్యాన్వయంబున నిక్ష్వాకుని సంతతిలో నిరువదిరెండవవాఁడగు మాంధాత, ముప్పదవవాఁడగు హరిశ్చంద్రుండు, ముప్పది నాలవవాఁడగు సగరుఁడు, ముప్పదెనిమిదవ వాఁడగు భగీరథుఁడు, నలువదియవ వాఁడగు అంబరీషుఁడు, నలువది తొమ్మిదవవాఁడగు రఘువు ఏబదినాలవవాఁడగు దశరథుఁడు, ఏబదేనవవాఁడగు శ్రీరాములు, అఱువదియవవాఁడగు నళుఁడు కడుప్రసిద్ధిం గాంచిరి. వారిలో భగీరథుఁడే గంగను భూమికి దెచ్చినవాఁడు. దశరథునకు నారాయణుఁడు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులన నలువురు సుతులుగా

జనించె. అందురాముడు లోకకంటకుడగు రావణుంజంపి లోకోపకారమొనర్చె. ఆచరిత్రము నంతయు వాల్మీకివిస్తరించియుండు.

పితృవంశవివరణము స - అ - ౧౩.

అంతమనువు మత్స్యంగాంచి దేవా! పితృవంశమునుసూర్యచంద్రులు శ్రాద్ధదేవతలుగా నుండుటయు వివరింపుమని యడిగిన నతండిట్లనియె. పితృదేవతలెల్ల నేడుగణములుగా నుందురు. అందు మూడుగణములు శరీరములు లేకయు నాలుగుగణములు శరీరములతోటి నుందురు. వారిలో శరీరము లేనివారు వైరాజులని పఱంగుచు దేవపూజ్యులై యోగభ్రష్టులై బ్రహ్మాదినాంత్యంబునబ్రహ్మవేత్తలుగాజనించి పూర్వస్మృతినొంది నుత్తమ పదవిబడయుదురు. కానయోగులనే శ్రాద్ధనిమంత్రణ చెప్పవలయు. ఈపితరులకు మేనయను మానస కన్యగలిగి హిమవంతునిభార్యయయ్యె. ఆమేనకకు మైనాకుడను సుతుడుజనించె. ఆమయినాకునకు క్రౌంచుడను తనయుడుగలిగి క్రౌంచద్వీప మాపేరబఱంగుటకుగారణభూతుడయ్యె. మఱియునామేనకకు ఉమ, ఏకపర్ణ, అపర్ణ, అనముగ్వురు కూతుండ్లుగలిగిరి. వారల క్రమముగా రుద్రుడు, భృగువు, జైగిషవ్యుడు, పరిణయంబందిరి.

అనిచెప్పిన సూతుంజూచిమునులు రుద్రాణి తొలుత దక్షకన్యగాబుట్టియుండె. ఇపుడు హిమవంతునకుగూతురెట్లయ్యె? దక్షుడు రుద్రునకేమిద్రోహముచేసె? తెలియంజెప్పుమనియడిగిన నతండు వారలకిట్లనియె. తొల్లి దక్షుండొక యజ్ఞముసేయుతఱి నతనిసుతయగు సతీదేవి దక్షుంజూచి యీయాగమునకు సురలు, మునులు మొదలగువారలెల్ల వచ్చియుండ మత్పతియగు పశుపతి రాకుండుటకుగతంబేమనిన నతండునవ్వి యవ్వనితంగాంచి నీపతి లయంబొనర్చువాడు గావున నిట్టిశుభకార్యంబునకు రానర్హుడుగాడనియె. అందున కాయిందీవరాక్షి కోపారుణనేత్రయై దక్షునీక్షించి సకలభువనములకధ్యక్షుండగు ఫాలాక్షు నాక్షేపించు నీచుండవగుటచే నీవు పదుగురుతండ్రులకు గొడుకుగాబుట్టెదవు. మఱియు నీచేయుజన్నంబు పన్నగభూషుచే భిన్నంబగుననికడుబెడిదముగానుడివి యోగాగ్నిచే దన తనువు విడనాడ గడంగిన నని మిషులు మనంబునం బెదఱుచుండ దక్షుం డడ్డవింజేరి ఓజగన్మాతా! సకలంబునకు హేతుభూతంబగు నీవు నాపుణ్యాకతం బున నాకు జనించితివి. నాపై నలుగవలదు. అనుగ్రహింపుమని వేడిన నాగౌరి నేదలంచినదాని ద్రిప్ప వేరికిని దరముగాదు కావున నీవట్లు బదుగురకు సుతుడవై బుట్టినను నాసాన్నిధ్యంబుజేరి నన్నారాధించిన మేలు గలుగు ననియె. అందునకా దక్షుడు డెందంబున దిగులొంది యోయిందుధరమనోహరీ! నీవెయ్యేస్థలంబుల నెట్టినామంబులచే బఱంగుచుందువు? నిన్నారాధించు తెఱంగెయ్యది? తెలియం బలుకుమన నాయలివేణి కాశీ మొ

దలగు (౧౦౮) పేళ్లచేనెప్పట మొదలగువానిం జెప్పి యోగాగ్నిని దన తనువు విడనాడె.

పితృవంశీయాచ్ఛోదోపాఖ్యానము - సం - అ - ౧౪.

అనిచెప్పి సూతుండు మఱియు నిట్లనియె. మరీచి నందనులగు పితృగణములు సోమపథులు అగ్నిష్వాత్తులు, అని పఱంగుచు దేవతలచే పూజింపబడుచు పితృలోకంబున వసించెదరు. మానుషలోకంబున ననేక యజ్ఞంబులం జేసి మృతులైన వారలును సోమపథులు అగ్నిష్వాత్తాదులతో గలిసి యుండెదరు. వీరికి అచ్ఛోదయను మానస కన్యక పుట్టి తనపితలచే నిర్మితంబగు అచ్ఛోదంబను సరోవర తీరంబున సహస్ర దివ్యవర్షంబులు తపంబు సలిపి పితరుల మెప్పించినవారలు దివ్యాలంకార భూషితులై పొడసూపిన దనతండ్రులగు వారలలో మావసుడను వాని తనపతిగా గోరె. ఈవ్యభిచారంబున నది యోగభ్రష్టయై స్వర్గంబునుండి క్రిందికి బడెంగాని భూమినంటక మధ్యంబున నిలిచె. అది దుర్మతియై కోరినను ధీరతచే మావసుడు తన మనసుం జలింప నివ్వకుండుటంజేసి యకార్యము ప్రవర్తిల్లిన దినంబు అమావాస్యయని పఱంగె. ఇది పితృసంబంధంబగునది గావున నద్దినంబు పితరులకు ముఖ్యంబు. ఆ అమావాస్యను వారలకు జేసెడు స్వల్పక్రియలైనను అక్షయములుగ వారలు భావించి తృప్తిం జెందుదురు. అట్లచ్ఛోద తలక్రిందుగా బడి పితరులందఱ బలుచందంబుల వినుతించి నావ్యభిచారమును మన్నించి నాకు మఱల గతులుగలుగునట్లు గరుణింపుడని వేడిన నాపితరులు దానిం జూచి నీవిపుడు దేవతలు చేసెడు కర్మ ఫలంబు లనుభవింపుచుండి యిరువదెనిమిదవ ద్వాపరంబున మీనయోనిం బుట్టి సత్యవతియని పేర్గాని తొలుత బరాశర మహాముని తేజంబున వ్యాసమహామునిం గని పిదప శంతను భార్యవై విచిత్రవీర్యుడు, చిత్రాంగదుడను, నిరువురు పుత్రులంగాంచి యంత్యంబున అచ్ఛోదయను బుణ్యనది వయ్యెదవని చెప్పి యంతర్హితులైరి.

దానవుల పితృగణములవివరణము- సం - అ - ౧౫.

పైన నుడువంబడిన వారలుగాక . విభ్రాజులనియు బర్హిషదులనియు రెండు పేళ్లచే వెలయు వేలు పితృగణములు గలరు. వారలు దర్భవిమానంబు లెక్కి యభ్యుదయస్థలంబుల నాసన్నులగుచుందురు. వీరు పులస్త్య వంశజులై దానవ యక్షరాక్షస గంధర్వాదులచే బూజింప బడుదురు. వీరలకు బీవరియను యోగిని మానస కన్యగా బుట్టి విష్ణుం గూర్చి ఘోరతపంబు చేసిన నతండు ప్రత్యక్షుడై వర మొసంగెద నడుగుమన నాపీవరి తనకు యోగవంతుడును సుందరాకారుండునగు మగడు గలుగునట్లు వేడిన నతండు నీకోరినట్టుల భగవ దంశను వ్యాసులకు

శుకుడను యోగిబుట్టి నిన్ను వరించు. అతనివలన నీవుకృత్తియను కన్నియను కృష్ణ, గౌర, ప్రభు, శంభులను నలువురు సుతులను బడసెదవు. ఆకృత్తిని పాంచాల దేశాధిపతికిమ్ము. తుదకు నీవు నీపతిసయితము మోక్షపదవిం గందువనిచెప్పి యంతర్హితుడయ్యె. వీరలుగాక వసిష్ఠునకు సుమూర్తి మంతులను మానస పితృగణములుగలిగి బ్రాహ్మణులచే బూజింపబడుచు ధర్మస్వరూపులై తేజస్సువలన బ్రకాశింపబడు స్వర్గమున నూర్ధ్వలోకంబున నివసింతురు. వీరలకు "గౌః" అనుమానస కన్యగలిగి శుక్రుభార్యయయ్యె. మఱియు అంగిరస్సుసుతులగు మరీచిగర్భులను పితరులు, సూర్యమండలంబున నివసింపుచు క్షత్రియులకు బితరులుగానుందురు. వీరి మానస పుత్రియగు యశోదయను భామిని పంచవనపుత్రుడగు పాశుమతు బెండ్లాడెం.దిలీపునకు దల్లియు భగీరథునకు బితామహియు నయ్యె. వీరుగాక కర్దమపులహప్రజాపతుల సంతానము స్వధులు, ఆజ్యపులు, అను నామంబులచే వైశ్యులకు బితృదేవతలై యుందురు. వీరి మానసపుత్రియగు విరజ నహుషుని భార్యయై యయాతియను తనయుం బడసె. మఱియు మానసులన నాలవపితృగణము (శూద్రులకు బితరులై) బ్రహ్మలోకంబున నుందురు. వీరి మానసకన్య ధర్మదయను భామిని. ఇంతియకాదు సోమపులను వేఱు పితృగణములు బ్రహ్మలోకంబున నూర్ధ్వంబునమానసలోకంబునన్నివసింపుచు దదాజ్ఞను వివిధసృష్టిం గావింపుచుందురు. వీరిమానసపుత్రియగు నర్మద కడు బ్రసిద్ధవాహినియైయుండు. కావునబ్రాహ్మణాదులు తమపితరులిట్టి వారనియెఱింగి శ్రాద్ధాదులొనర్చిరేని దత్ఫలము నొందెదరు. ప్రథమసృష్టియందు బ్రహ్మపితృతృప్తికై శ్రాద్ధమును నిర్మించె - మఱియు నెల్లపితరులకు రజతపాత్రప్రీతి నిచ్చుగావునదక్రియలయందు రజతపాత్ర నుపయోగింపుచు స్వధాశబ్దోచ్చారణ సేయవలయు. అగ్నిష్వాత్తునకును, యమునకిని దృప్తిగా హోమము సేయవలయు. అగ్ని లేమిని బ్రాహ్మణహస్తంబునందేని, జలమునందేని, అజాకర్ణంబుననేని, శివసన్నిధినేని హోమమును జేయందగు. పితరులకెల్లను దక్షిణదిశ ప్రశస్తంబై యుండు. మఱియు అపసవ్యము, ఉదకము, నువ్వులు, సవ్యాంగము, దర్భ, మత్స్యమాంసము, ఆవుపాలు, మధురరసము, ఖడ్గమృగమాంసము, తేనె, చామలు, యవలు, నీవారము (పత్తకయేపండుధాన్యము) పెసలు, చెఱుకు, బెల్లము, పువ్వులు, నెయ్యి, అనునివి పితృప్రీతికరములు. ఇక, చిఱుశనగలు, శనగలు, అనుములు, అలచందలు, ఉలవలు, తామరపువ్వులు, బిల్వదళములు, జిల్లేడుపువ్వులు, దత్తూరము (ఉమ్మెత్తపువ్వులు) పారిజాతములు, గొఱ్ఱెపాలు, ఆఱికలు, జొన్నలు, దాడిమపండ్లు, వెలగపండ్లు, ఇప్పపండ్లు, అవిసికూర, అనునివి పితృకార్యములయందు వర్జింపదగినయవి. కాబట్టి దీని నెఱింగి పితృతృప్తింజేయవలయు. పితరులు తృప్తింజెందిన సకలాభీష్టంబులు సమకూడుటయగాక యుత్తమపదవిసగాం గలుగుటంజేసి దేవకార్యమునకన్న బితృ కార్యమె

కు_డుగా నెన్నవలయు. మఱియు నేకార్యంబుననేనిదొలుత దేవపితరుల బూజింపవలయు.

పార్వణశ్రాద్ధవిధానము - స - అ - ౧౬.

అనిచెప్పిన మత్స్యంజూచి మనువు వనజనాభా! శ్రాద్ధమునకు కాలంబెద్ది? తద్భేదంబులెవ్వి? నిమంత్రణార్హులగు వారెవ్వరు? ఎట్టివారివర్జింపవలయు? తదారంభ కాలమెట్టిది! శ్రాద్ధమునందివ్వబడిన ద్రవ్యము పితరులకెట్లు జెందు? శ్రాద్ధవిధానంబెట్టిది? అనువాని నెల్లదేటపడం జెప్పుమనిన నప్పురుషో_త్తముండిట్లనియె.

శ్రాద్ధము,. నిత్యము, నైమి_త్తికము, కామ్యము, అనమూడువిధములుగనుండు. అందు బ్రతిదినమును అన్నోదకఫలాదులచే నర్ఘ్యావాహన దైవతవర్జితంబై జేయంబడునది నిత్యశ్రాద్ధమనంబడు. పర్వకాలంబులం జేయంబడునది పార్వణమనంబడు. ఈపార్వణ శ్రాద్ధనిమంత్రణకు, పంచాగ్ని (గార్హాపత్య, ఆహవనీయ, దక్షిణాగ్ని, సభ్య, ఆవసథ్యము) అనునైదగ్నులనుపాసించు వాజసనేయుడు, స్నాతకుడు,(వేదవిద్యావ్రతస్నాతకము చేసినవాడు, త్రిసువర్ణుడు (ఋగ్యజుస్సులలో నేకదేశమైన మంత్రముప్రతపూర్వకముగ నధ్యయనము సేసినవాడు) శ్రోత్రియుడు (వేదముచదివినవాడు) శ్రోత్రియునిపుత్రుడు) విధివాక్య విశారదుడు (కర్మవిధాయక మెఱింగినవాడు) సర్వజ్ఞుడు (సర్వశాస్త్రములు దెలిసినవాడు) వేదవిత్ (ధర్మజ్ఞానవంతుడు) సత్రి(సత్రమనుయాగమును జేసినవాడు) జ్ఞాతవంశ కులాన్వితుడు (తెలియంబడ్డకులవంశంబులంగలవాడు) పురాణవే_త్త (పురాణార్థమెఱింగినవాడు) ధర్మజ్ఞుడు (వర్ణాశ్రమాచారముల నెఱింగినవాడు) స్వాధ్యాయజప తత్పరుడు (సదా వేదముబఠియించునాకాంక్షగలవాడు) సూర్యభ_క్తుడు, విష్ణుభ_క్తుడు, బ్రహ్మజ్ఞాని, యోగవే_త్త, ఇంద్రియనిగ్రహముగలవాడు, యుంజీతాత్మ,(బుద్ధినిస్వాధీనమందుంచు కొన్నవాడు) బలవంతుడు, దౌహిత్రుడు, శ్వశురుడు (పెండ్లాముతండ్రి) గురువు, అల్లుడు, మేనమామ, బంధువు, ఋత్విక్కు (యజ్ఞముచేయించువాడు) ఆచార్యుడు(ధర్మములనుపదేశించువాడు, ) సోమపానముసేసినవాడు (సోమయాజి) వ్యాకరణవే_త్త, మీమాంసవే_త్త, సామస్వరవే_త్త, సామవేదవే_త్త, బ్రహ్మచారి, దేవతాభ_క్తిగలవాడు, అనువారలు, అర్హులుగానుందురు- ఇక, పతితుడు(బ్రహ్మహత్యాదిపాతకుడు) పతితునిసుతుడు, నపుంసకుడు, కొండెగాడు, అంగహీనుడు, రోగి (అచికిత్సితమైన రోగముగలవాడు) పుప్పిగోళ్లవాడు, నల్లపండ్లవాడు, కుండుడు (పతిజీవించియుండగా జారత్వమువలన గలిగినవాడు) గోళుడు (పతిమృతుడైన పిదపజారత్వమువలన బుట్టినవాడు) పాలకుడు (అశ్వాదిపాలకుడు) పరివి_త్తి అనగా (అన్నకుబెండ్లికాక పూర్వమే పెండ్లాడినవాడు) నియు_క్తాత్మ (ఒకనియాజ్ఞలోపనిజేయువాడు,)

మత్తుడు, (మదించినవాడు,) ఉన్మత్తుడు, పిచ్చివాడు, దారుణుడు సదాక్రూర కృత్యముల జేయువాడు. బైడాలబకవృత్తులగలవాండ్రు (మోసగాండ్రు,) డాంభి కుడు, దేవలకుడు, (కూలికి దేవతా పూజచేయువాడు,) కృతఘ్నుడు, ఉపకారికి నప కారము సేయువాడు,) నాస్తికుడు, మ్లేచ్ఛత్రిశంకుబర్బరాది దేశవాసులు, లింగులు, వీ రు నిమంత్రణకర్హులుగారు. నిమంత్రిత బ్రాహ్మణులయందు పితరులావహించియుందు రుగాన శ్రాద్ధకర్తమిగుల నమ్రుడై తాజేయబోవు మాతృపితృశ్రాద్ధములకు పూర్వ దినమందుగాని, లేక, తద్దినమందుగాని నిమంత్రణార్హ బ్రాహ్మణ గృహంబునకరిగి- వారల కుడిపాదమును స్పృశించి, నేజేయబోవు శ్రాద్ధమునకు క్రోధము లేక బ్రహ్మవాదులై నిమంత్రితులుగ నుండవలయునని బ్రార్థింపవలయు. శ్రాద్ధకర్తఆహి తాగ్ని యయ్యేనేని దర్శయందు పిండపితృయజ్ఞమును ముందుగా జరిపి పిదపపా ర్వణ శ్రాద్ధము సేయవలయు. స్వగృహములోగాని పసలదొడ్డిలోగాని నదీతీరము నగాని దక్షిణపువాలుగల భూమిని గోమయాదులచే శుద్ధిజేసి శ్రాద్ధంబొనర్చుట యుత్తమము. శ్రాద్ధోపయోగ చర్వాది సంభారములను శ్రాద్ధమొనర్చెడిస్థలమున కు దక్షిణభాగమునందుంచవలయు. పిదప శ్రాద్ధకర్త గోమయ లిప్తమండలములను తిలాక్షతలచేబూజించి వాటియందు బ్రాహ్మణుల పాదములను సవ్యాపసవ్యములతో కడిగి ఆచమనానంతరం వారిని దర్భాసనములయందు కూర్చుండునటుల బ్రార్థిం పవలయు. అందు విశ్వేదేవస్థానమందిరువురిని పితృస్థానమందు ముగ్వురిని లేక నొ క్కొక్కరినయిన శక్త్యనుసారము నియమింపవలయు. ధనికుడైనను శ్రాద్ధవిస్తరం బు జేయంజనదు. అట్టినిమంత్రితబ్రాహ్మణులకు విశ్వేదేవపూర్వకముగ అర్ఘ్యాదులనొ సంగి యాబ్రాహ్మణుల యనుమతిని స్వసూత్రోక్త విధానముగ కాంస్యపాత్రయందు చర్వునునిచి అగ్నిహోమయముల కాహుతులొసంగి పర్యుక్షణాదికమునుసవ్యముగను తదుక్కార్యముల నపసవ్యముగను జేయవలయు. శ్రాద్ధకర్త సర్వాధానియయ్యేనేని దక్షిణాగ్నియం దగ్నౌకరణ మొనర్పవలయు. పిదప హవిశ్శేషంబుచే నారు పిండము లుజేసి యుల్లేఖనాదులచే భూశుద్ధిగావించి దక్షిణాగ్రములుగ దర్భలనునిచి యెడమ కాలుమడచికొని అపసవ్యముగ పైదర్భలయందారుస్థానములలో కాంస్యపాత్రోదక ముచే నవనేజనముగావించి మాతాపిత్రాదుల నామగోత్రములనుజెప్పి క్రమముగ నారుపిండములనుదర్విలో నొక్కొక్కటిగనునిచి మఱల వాటికవనేజనము సేసిపిండ శేషకణములను లేపభాక్కుల తృప్తికి దర్భలకు చమిరి గంధపుష్పాదులచే బూజించి నమస్కరించి ప్రతిపిండమునకవనేజనముజేసి నిమంత్రితబ్రాహ్మణుల హస్తమునందు తిలోదకసహితముగ పవిత్రమునునిచి దానియందు పైపిండముల యందొక్కొక్క యంశమును దీసియుంచి ముందుగా దాని వారిని భుజింపజేయవలయు. పిదపనని మంత్రితబ్రాహ్మణులకు సవ్యంజనమైనయుష్ణాన్నమును సావధానముగ హరిస్మరణజే

యుచుభుజింపజేసి తృప్తులైనపిదప వారిసమీపమున ఉదక యుక్తవికిరాన్నమునుంచవలయు. ఆబ్రాహ్మణులు హస్తపాదప్రక్షాళనముసేసికొని ఆచమనీయముజేసినపిదపజలపుష్పాక్షతాదుల నొసంగవలయు. స్వస్తివాచనము పిండోపరి జేయవలయు. శ్రాద్ధమునాద్యంతదైవికముగ జేయవలయు. ఇట్లుజేయరేని శ్రాద్ధనాశంబగు- బ్రాహ్మణులకు ప్రదక్షిణ నమస్కారములుసేసి పంపునెడలకర్త దక్షిణాభిముఖుండై నాదాతలు వృద్ధిబొందవలయు, నాసంతతి వేదసంతతిగావలయు, నాకీకర్మయందు శ్రద్ధ గలుగునటులజేయవలయు, విశేషసంపదను అన్నమును అతిథులను యాచకులను కలుగునట్లు జేయవలయు. ఇవి మొదలగు అర్థముగల "దాతారోనోభివర్ధన్తామ్" అనుమంత్రముచే బ్రార్థించిపంపవలయు. ఇది పిండాన్వాహార్యక పార్వణశ్రాద్ధంబని చెప్పంబడు. ఈశ్రాద్ధము అమవసనునిత్యముగ జరుపవలయు. దీనియందుంచబడిన పిండములను బ్రాహ్మణులకుగాని గోవులకుగాని అజములకుగాని యివ్వవలయు, లేక, అగ్నియందుగాని యుదకమునందుగాని యుంచవలయు- పుత్రునిగోరెడు వనిత నియతరై పితృమధ్యపిండమును భుజించిన పుత్రుడుజనించు - పిదపకర్త వైశ్వదేవంబొనర్చి పితృశేషమును స్నేహితులతో భుజింపవలయు. అట్టికర్తృభోక్తలు తద్దినంబునందు పునర్భోజనము, త్రోవనడచుట, అలుపుగల పనులుసేయుట, మైథునము, స్వాధ్యాయము, కలహము, దివాస్వాపము, వీటినివర్జింపవలయు - అగ్నిమంతుడు, కన్యాకుంభవృషభమాసముల కృష్ణపక్షములందును - జరిపెడిశ్రాద్ధముల సపిండీకరణ శ్రాద్ధపరమునందు సలిపెడి గయాశ్రాద్ధాదుల నిటులజరుపవలయు.

## సాధారణశ్రాద్ధకాలనిర్ణయము - స - అ - ౧౭.

అఃసూతుండు మత్స్యునిచే జెప్పంబడిన భుక్తిముక్తి ఫలంబగు సాధారణ శ్రాద్ధమును వక్కాణించెదనని యిట్లనియె. దక్షిణోత్తరాయనములు, విషువత్పుణ్యకాలములు, సంక్రమణములు, అమవసలు, అష్టకలు, కృష్ణపక్షచతుర్దశులు- ఆర్ద్రామఖారోహిణీనక్షత్రములు, ద్రవ్యబ్రాహ్మణుల సన్నిధి, గజచ్ఛాయ, వ్యతీపాత, విష్టి, వైధృతులు, వైశాఖశుద్ధ తృతీయ, కార్తీకశుద్ధ నవమి, దశమి, పూర్ణిమ, మాఘశుద్ధ సప్తమి, పూర్ణిమ, శ్రావణశుద్ధ త్రయోదశి, బహుళాష్టమి, ఆశ్వయుజ శుక్ల నవమి, చైత్రశుద్ధ తృతీయ పూర్ణిమ, భాద్రపదశుద్ధ తృతీయ, ఫాల్గున శుద్ధపూర్ణిమ, బహుళ అమావాస్య, పుష్య శుద్ధైకాదశి, ఆషాఢ శుద్ధ దశమి, బహుళాష్టమి, జ్యేష్ఠశుద్ధ పూర్ణిమ, గ్రహణము, మహాలయ పక్షము, తీర్థక్షేత్రములు, వీటియందు శ్రాద్ధమును జేసిరేని యక్షయంబగు. మఱియు మన్వంతరాదియందు సూర్యుడు రథమును పొందుంగాన యది రథసప్తమి యనంబఱగు. అందు

తిలయుక్తోదకంబేని పితరులకు నిచ్చిన వేయువత్సరంబులు యథోక్తశ్రాద్ధంబు జేసిన ఫలంబును పితరు లిచ్చెదరు. కర్త శీలాదిగుణ వయస్సంపత్తులుగల బ్రాహ్మణులను ముందు దినంబునగాని తద్దినంబునగాని నిమంత్రింపవలయు. విశ్వేదేవస్థానంబున నిరువురిని పితృస్థానంబున మువ్వురిని, లేక ఉభయస్థలంబుల నొక్కొక్కరినైనను నియమింపవలయుగాని శ్రాద్ధవిస్తారమును జేయందగదు. అందు విశ్వేదేవతలను యవపుష్పాదులచేతను, "యవోసి, విశ్వేదేవాస, యాదివ్యా" అను నీ మంత్రములచే నర్ఘ్యపాత్రపూజావాహనాదు లొనర్పవలయు - పితరుల తిలపుష్పాదులచేత, "శన్నోదేవి, తిలోసి" అనుమంత్రములచే బూజింపవలయు- ఆపితృపాత్రలను, దారు, తామ్ర, రజిత, స్వర్ణ, వీటిచే జేయుట యుత్తమము. రజితము శివనేత్రమువలనబుట్టినదిగాన పితరులకు దృప్తికరంబగు. దానిచేనుదకం బిచ్చిన యక్షయపదంబు నిచ్చు. అర్ఘ్యమునకును, పిండప్రదానమునకును రజిత పాత్ర ప్రశస్తంబుగ నుండు. ఐనను, యీరజతము దేవకార్యములయందు వర్జింపందగు. ఇట్లు శక్తికొలది పాత్రలనమర్చికొని వాటిలో విమత్సరుడై దర్భహస్తుడై పితరుల నామగోత్రముల నుచ్చరింపుచు దర్భలనుంచవలయు. "ఉశంతస్త్వా, ఆయంతునః" అనుమంత్రములచే బితరుల నావాహనముజేసి పిదప "యాదివ్య" యనుమంత్రముచే నర్ఘ్యమొసంగి యాపాత్రలను, "పితృభ్యస్థానమసి "యనుమంత్రముచే వారియుత్తర భాగమునందుంచి పరిషేచనముజేసి - బ్రాహ్మణుల గంధపుష్పాదులచే బూజించి దేవపూర్వకముగ వస్త్రము లొసంగి యగ్నియందాహుతి నొనర్చగా మిగిలిన యన్నమును భక్ష్యభోజ్యములతో బ్రాహ్మణుల పాత్రలయందుంచి దత్త మొనర్పవలయు *. వారి భోజన సమయంబున పితృసంబంధమగు మంత్రములను, బ్రహ్మవిష్ణు రుద్రస్తవములను, ఇంద్రాగ్ని సోమ పవమాన సూక్తములను, బృహద్రథంతర జ్యేష్ఠ రౌహిణసామములను, శాంతికాధ్యాయము, మహాబ్రాహ్మణము, మండలబ్రాహ్మణము, వీటిని పితృప్రీతిగ పఠింపవలయు - తేనెతో గలసిన క్షీరఘృత పాయసంబులు పితరుల కక్షయంబగు. కావున శ్రాద్ధమునందు వీటిని ముఖ్యముగ నివ్వవలయు. బ్రాహ్మణ భోజనానంతరము వికిరాన్నమును అగ్నిదగ్ధులయిన వారికిని కానివారికిని తృప్తికొఱకు పిండమును యివ్వవలయు. వారికి యుత్తరాపోశన మిచ్చిన పిదప గోమయాదులచే శుద్ధి జేయంబడిన భూమియందు దర్భల దక్షిణాగ్రములుగనునిచి సర్వపక్వశాకాదిమిళితంబగు నన్నంబుచే జేయబడిన పిండములను పితరుల నామగోత్రంబుల నుచ్చరింపుచు పితృయజ్ఞమువలెనే దర్భలయందునిచి సవ్యాపసవ్యముగా బూజా ప్రదక్షిణ నమస్కారములను చేసి పిండోద్వాసన చేయవలయు. పిదప బ్రాహ్మణులును

---

* శ్రాద్ధమునందు కొన్ని మాంసములు జెప్పియున్నను కలియుగమున వర్జింపదగు.

కర్తయు, హస్తప్రక్షాళనాచమనముల జేసికొనిన పిదప పితరుల నామగోత్రముల నుచ్చరింపుచు పుష్పాక్షతలు అక్షయోదకము వీటిని యివ్వవలయు. అట్టికాలంబున తనను తన పితరుల కిష్టమైన వస్తువులను శక్తికొలది భోక్తల కొసంగి స్వధావాచనికములను జెప్పి విశ్వేదేవతల కుదక మొసంగి తాను ప్రాఙ్ముఖుడై బ్రాహ్మణులచే నాశీర్వాదమును బొంది "వాజే వాజే" అను మంత్రమునుచ్చరింపుచు ప్రదక్షిణము జేసి కుశాగ్రముచే విసర్జనము సేసి పాదములను స్పృశించి ఆసీమాంతము వరకు పుత్రకళత్ర బంధుయుక్తుడై వారితోకూడ జని మఱలి గృహంబునకు వచ్చి మంత్రవత్తుగ నగ్నిం బూజించి వైశ్వదేవముజేసి నిత్యబలుల నొసంగి సుతులు సగోత్రులు బంధువుల్లు, వీరితోడ భుజింపవలయు. ఈసాధారణ శ్రాద్ధము ననుపనీతుడు, అపత్నీకుడు, పరవాసము జేయువాడు, వీరలు జేయందగు - శూద్రుడు నిటులనీశ్రాద్ధమును నమంత్రవత్తుగ జేయవలయు.

ఆభ్యుదయికశ్రాద్ధవివరణము.

ఈశ్రాద్ధము-ఉత్సవము, సంతోషసమయము,యజ్ఞము, వివాహము, మొదలగు శుభకర్మలయందు మొదటజేయందగు. అందు ముందుమాతను, పిదపపితరునిబూజించి వెనుక పితామహులను, వారికనంతరము విశ్వేదేవతులను బూజింపవలయు- అటులజేయుటలోప్రదక్షిణ నమస్కారంబులొనర్చి ప్రాఙ్ముఖుడై పెరుగు, అక్షతలు, ఫలోదకము, వీట్లచే బిండములజేసి - గరిక, కుశ, వీట్లయందునిచి - పితరులతృప్తిబొందవలయునని ప్రార్థింపవలయు- సువర్ణవస్త్రాదులచే భార్యాయుక్తులగు బ్రాహ్మణులబూజింపవలయు. ఇకార్యమునందు తిలలుపయోగింపంజనదు. ఈనాందియందు విప్రులచే మంగళవచనముల జెప్పింపవలయు. ఇటుల శూద్రులును నమంత్రవత్తుగజేయందగు వారికి దానమేప్రధానము.

బ్రాహ్మణాదులకాశౌచవిధి - సం - అ - ౧౮.

పితమరణమును పొందిన-పుత్రులచే నాచరింపతగిన ఏకోద్దిష్టా శౌచములను వివరించెద. బ్రాహ్మణులలో పిత్రాది సపిండులు మృతులైరేని యాశౌచము పదిదినంబులు - క్షత్రియులకు పండ్రెండుదినములు వైశ్యులకు పదునైదుదినములు - శూద్రులకు ముప్పదిదినములు - చూడా కర్మవిహీనులగు శిశువులు మృతిజెందిన యాశౌచ మొకదినము-చూడా కర్మనొనర్చినపిదప యాశౌచము మూడుదినములు - పైవర్ణములవారు జాతాశౌచమును కూడ మృతాశౌచంబువలెనే నాచరింపవలయు. మృతుడు యమపురమునకు నయింపబడెడి పండ్రెండుదినములవరకు ప్రథమదివసము మొదలు పిండప్రదానము సేయవలయు. అది వానికిపాథేయమగును. ఆపండ్రెండుదినములవరకు వాడు మృతిబొందిన స్థలమునుండి గృహపుత్రకళత్రాదులను వీక్షిం

వుచుండు - అట్టిస్థలంబున నుట్టికట్టి యందుపదిదినములవరకు ప్రేతతృప్తికై ప్రత్యహము క్షీరముంచవలయు-పదునొకండవదినమున వృషోత్సర్జనము జేసిపదునొకండు బ్రాహ్మణులకు భోజనం బిడవలయు. మాతృవిషయమందును వృషోత్సర్జనము ముఖ్యముగా జేయందగు. క్షత్రియాదులాశౌచాంతంబున పదివేల బ్రాహ్మణులను గాని, లేక, శక్తికొలది వారిని భోజనాదులచే దృప్తింగావింపవలయు - పండ్రెండవదివసంబున ఏకోద్దిష్టము జరుపవలయు. అందావాహనాగ్నౌకరణములు లేకపోవుటయేగాక పైశ్రాద్ధము దేవహీనముగా జేయవలయు. మఱియు పవిత్రము పిండము అర్ఘ్యమునొక్కొకటిగా బ్రాహ్మణుల కొసంగి పిదప తిలోదకములనిచ్చి వికిరమును స్వదితమని యుచ్ఛరింపవలయు. కడపట(«దత్తంశ్రాద్ధమభిరమ్యతామ్”) అను మంత్రముచే విసర్జింపవలయు. ఇటుల పండ్రెండు మాసములవరకు మృత దినంబున ఏకోద్దిష్టవిధానముగ శ్రాద్ధ మొనర్పవలయు. పండ్రెండవదివసంబున శయ్యాదానంబును బురుషాకృతిగల స్వర్ణవిగ్రహము వస్త్రాలంకారాదులతో బూజించి దానిని భార్యాసహితులగు బ్రాహ్మణుల బూజించి వారికొసంగవలయు. కపిలధేను దానంబిచ్చుట యుత్తమము-సంవత్సరాంతమువరకు ప్రతిదినంబున తిలోదక సహిత యుదకుంభదానము నివ్వవలయు. సంవత్సరాంతమున చేసెడి సపిండీ కరణముతో మృతుడు ప్రేతత్వము వదలి పార్వణశ్రాద్ధమున కర్హుడగు - ఆసపిండీకరణమును దేవాద్యంతపూర్వకముగ జేయవలయు. అటులజేయునెడ ప్రేతకును ప్రేత పితరులకును వేర్వేరుగా నర్చనాదులొనర్పవలయు. మఱల సంకల్పం బొనర్చి ప్రేతకొకపాత్ర పిత్రాదులకు మూడు పాత్రలను నిడి అర్చనాది పూర్వకముగ ప్రేతపాత్రస్థార్ఘ్యమును పితరుల మూడు పాత్రలలో సంయోజన మొనర్చి నాలుగు పిండములుసేసి అందు ప్రేతపిండమును «ఏసమానా” అనుమంత్రముచే మూడుగా విభజించి పిత్రాదిపిండములతో సంయోజనము సేయవలయు. అది మొదలు వృద్ధప్రపితామహుని పిండము వీడిపోవు. మృతుడు ప్రేతత్వమువదలి అగ్నిష్వాత్తాది పితృమధ్యగతుండగు-అది మొదలు సంక్రాంతి గ్రహణాదులయందు పార్వణ విధానముగ శ్రాద్ధమొనర్పవలయు. (ప్రతిసాంవత్సరిక మృతాహమునందు ఏకోద్దిష్ట విధానముగశ్రాద్ధమును మాత్రము జేయవలయుననియు పార్వణశ్రాద్ధము సేసిన యధోలోకంబు గలుగుననియు నుప్పురాణమునందు విధియేర్పడి యున్నయది.) సంక్రాంత్యాదులయందు అన్నశ్రాద్ధము జేయుటకుపపత్తి లేనియడల ఆమశ్రాద్ధము సేయవలయు. అటుల జేయునపుడు అగ్నౌకరణ పిండదానము లామముతోడనే జేయవలయు. పిండము విడిపోయిన వృద్ధప్రపితామహుడు లేపభాక్కగుటచే యతని తృప్తికొఱకు పార్వణశ్రాద్ధమునందలి పిండలేపములను దర్భలకు చరమవలయు. లేపభాక్కులనగా ప్రపితామహునితండ్రి అతనితాత యతనిముత్తాత ఈముగ్గురని దెలిసికొనవలయు. తండ్రితాత ముత్తా

త యిమ్మువ్వురు పిండభాక్కులు. ఈపిండభాక్కులును లేపభాక్కులును పిండదాత యును వీరేడ్గురన్యోన్యము సపిండులనం బఱగెదరు.

పితృతృప్తి ప్రకరణము - సం - అ - ౧౯.

అని చెప్పిన శౌనకాదులు సూతుంగాంచి మహాత్మా! నీనుడువులు చిత్రంబు లత్తి పవిత్రంబులుగ నున్నయవి - ఈలోకంబున జేసెడి హవ్యకవ్యములు బ్రాహ్మణులకును అగ్నికిని దృప్తియగుంగాని లోకాంతరమునందుండెడి వారలకెట్లు తృప్తి యగునని యడిగిన సూతుండిట్లనియె.

పితృపితామహ ప్రపితామహులు క్రమముగ వసురుద్రాదిత్యులుగ నుండెదరు. వీరి కగ్నిష్వాత్తాదులు ప్రభువులు - వీరి నామగోత్రముల నుచ్చరించుచు నిచ్చెడి హవ్యకవ్యములు మరణాంతమునం దెవనికి యేజన్మము గలుగునో ఆజంతువు భక్షించెడి యాహారరూపంబై తృప్తిని జెందించు. అదెట్లన్న - తండ్రి మరణమును జెంది యతని పుణ్య వంశముచే దేవత్వము నొందెనేని యిచట నొసంగెడి యన్నాదు లమృతంబై తృప్తిని జెందించు. దైత్యుడయ్యెనేని భోగరూపముగను, పశువయ్యెనేని తృణరూపముగను సర్పంబయ్యెనేని వాయురూపంబుగను, యక్షులయ్యిరేని మద్యరూపంబుగను, గృధ్రాదులైరేని మాంసాది రూపంబులుగను, తక్కు జన్మంబులందు ఆయాజంతువుకు తగిన యాహారంబగు - విశేషముగ జెప్పనేల పితరులు సంతసించిరేని ఆయువును, పుత్రులను, ధనమును, విద్యను, స్వర్గమును, మోక్షమును, సుఖమును, రాజ్యమును, యొసంగెదరు. పూర్వము కౌశిక పుత్రులు గోవధజేసి శ్రాద్ధ మొనర్చినందున వారి కయిదవ జన్మంబున మోక్షం బబ్బె.

శ్రాద్ధఫలంబున గౌశికపుత్రులకు విష్ణులోకము గలుగుట సం - అ - ౨౦.

అని చెప్పిన సూతుంగాంచి ఋషులు మహాత్మా! కౌశికుని కొమరులగు నేడుగురు యుత్తమంబగు యోగంబెట్లు జెందిరి? వార లైదుజన్మములెత్తి క్షీణకర్ములై ముక్తిని యెట్లుబొందిరి? వివరింపుమన యతండిట్లని వక్కాణింప దొడంగె.

పూర్వము కురుక్షేత్రమున గౌశికుడను బ్రాహ్మణునకు ఖస్సృప, క్రోధన, మిథున, కవి, వాగ్దుష్ట, పితృవర్తులను నేడుగురు కొడుకులు గలిగిరి. వారు తమతండ్రి మృతినొందిన పిదప గర్గుడను విప్రునియొద్ద విద్య నభ్యసించుచుండు తఱి వనావృష్టి దోషంబువలన నధిక క్షామంబు సంభవించె. అట్లుండ నొకనాడాయేడుగురును దమ గురుని హోమధేనువును మేపుటకై యడవికి గొనిచని క్షామకాల మగుటచే నాకలికి జీకాకుపడి యా యావుంగోసితిన సమకట్టిరి. అట్టి చెడుతనమునకు బిట్టులిక్కి పడి వారిలో గనిష్ఠుండగు పితృవర్తి వారింజూచి మీర లావుం జంపె

తినుట కడు క్రూరకృత్యము. ఐనను మీరలు సేయఁబూనిన పనిని మానరు గాన నా గోమాంసము శ్రాద్ధోపయుక్తముగ భక్షించితిరేని దోషము గలుగనేరదనియె. అందునకు వారంద రానందించి యా యావుం గోసిన గడపటివాఁడగు పితృవర్తి తాను గర్తయై మొదటి యిద్దరన్నల విశ్వేదేవస్థానంబునను, మిగిలినవారిలో ముగ్వుర పితృస్థానంబునను, దక్కిన నొక్కని నతిథిగను, ఉనిచి పితృతృప్తిగ శ్రాద్ధమిడియె. అంత వారందఱును దూడనుమాత్రము గురు నొద్దికి గొనిచని యొక పెద్దపులి యా గోవుం దినెనని చెప్పిరి. ఈగోహత్యంజేసి వారలేడుగురును దాశరపురములో నెఱుకలవాండ్రుగా బుట్టినను, ఆ గోమాంసము శ్రాద్ధమున కుపయోగించిన కారణమున బూర్వజన్మ జ్ఞానము గలిగియుండిరి. కొంతకాలమునకు పిదప వారందఱును గాళంజరమను గట్టున జింకలై పుట్టి సదాశివుని యెదట సంచరింపుచు దొల్లిటి జ్ఞానముచే విలసిల్లుచుండి యాజన్మము మాని చక్రవాకపక్షులై మానససరోవర తీరముం జేరిరి. అట్లు వారుపక్షులై మెలంగుకొలంకు నొద్ది కొక నాఁడు పాంచాలదేశాధిపుండగు విభ్రాజుఁడను రాజేతెంచె. అతనిఁజూచి యాయేడుజక్కవపక్షులలో గడపటిదితాను రాజుగావలయుననికోరె. వానికి పైవారిద్దరు రాజమంత్రుల విభవముంగాంచి తాము మంత్రులుగావలయునని యపేక్షించిరికాని తొలినలువురు నేమియుగోరకనిష్కాములైయుండిరి. అందునంబట్టి కనిష్ఠుఁడా విభ్రాజునకు బ్రహ్మదత్తుఁడన కొడుకై పుట్టి సకలయోగవిద్యా ప్రవీణుఁడై సమస్తజంతువుల భాష నెఱుంగుశక్తి గలిగియుండె. అతనిపై యన్నలిద్దరు విభ్రాజునిమంత్రులకు కండరీకుడు సువాలకుడు, అన తనయులుగా జనించిరి. తక్కిన నలువురు నిష్కాములై యుండుటంజేసి బ్రాహ్మణకులంబునంబుట్టిరి. అట్టి బ్రహ్మదత్తునికి యుక్తవయస్సు రాగానే యతని తండ్రి యతనికి బట్టముగట్టి వనమునకరిగె. అంత బ్రహ్మదత్తుఁడుత్తమగుణాను వర్తనుఁడై భృత్యులంబాలించుచుఁదొల్లి తనయేడుగురన్న దమ్ములచే జంపబడిన యావు దేవలుఁడను వానికి గూతురై పుట్టి యుండ దానిఁజేబట్టి దానింగూడి బలుక్రీడలందేలుచు నొక నాఁడు విహారార్థముద్యానవనికేగి యందు, ఆడు మగచీమలు రెండు వాదులాడుచుండ సకలజంతు భాషాపరిజ్ఞానము గలవాఁడగుటచే నావాదమునామోదంబున నాలించె, ఎట్లన్న: ఆ రెండు చీమలలో నాఁడుది మగనిపైయలిగియుండ మగది తన మగువకోపము దీర్పబుజ్జగింపుచు ననేక విధంబులదాని చక్కఁదనంబును, ఎక్కుడు పతిభక్తియు నొక్కి యొక్కవక్కాణించి నాపైనీవలుగం గతంబేమి? తెలియ బలుకుమనియడిగిన నాయాఁడుచీమ తన మగనింగని నిన్ననీవొక కుడుముచూర్ణము నాకివ్వక వేఱుజవ్వని కిచ్చినాఁడవు గావున నేనలుగవలసెననియె. అందున కామగఁడు దిగులొంది నేఁదెలివిలేక నీవనియెంచియే వేఱుదానికా చూర్ణమిచ్చితిగాని వేఱుగాదు. కావున నానేరమిసైరించి నన్ను మన్నించమని దానికాళ్లపై వ్రాలిన నాయాఁలు

చాలుచాలు లెమ్ము మగల నమ్మవచ్చునా సమయమునకు దగినటుల మగువల వగ లందగిలించికొని వెనుకటి మాటలగలలో నైనను దలంపరు. ఐనను నీవు దీనతనున్నా డవు గాన సూనశర కేళింగూడుమని యాడిననామగడు సూత్రధారుని చేతిలోని బొమ్మక్రియ లేచి యమ్మగువను గూడె.

చక్రవాకచతుష్టయములకు బ్రాహ్మణత్వముగలుగుట- సం - అ - ౨౧.

అనిన విని మునులు సూతుంగాంచి యాబ్రహ్మదత్తునకు సకలజంతు జాల భాష నెఱుంగు శక్తియెట్లుగలిగె ? ఇతని మొదటి నలువురన్న లెచ్చట బ్రాహ్మణులై పుట్టియెట్టులం బ్రవర్తించిరి ? యెఱుంగింపుమనికోరిన నతండు వారలకిట్లనియె. బ్రహ్మదత్తుని తండ్రియగు విభ్రాజుడు తపంబు పెంపున విష్ణునిమెప్పించి సకల విద్యా ప్రవీణుడును, సకలజంతుజాల భాషాజ్ఞానియగు సుతుడు గలుగునట్లు వరము వడసి యుండుటంజేసి బ్రహ్మదత్తున కంతటి శక్తిగలిగె. ఇక నాతని తొలినలువు రన్నలు, బ్రహ్మదత్తుని పట్టణమందే యొకబీద బ్రాహ్మణు నింటబుట్టి కొంతకాలమునకు యోగసిద్ధికై పోవసమకట్టిన వారితండ్రియిట్టులనియె. అన్నలారా ! కన్నది మొద లుయిన్నాళ్లు మిమ్ములనే గాపాడినందునకిపుడు నాముసలితనంబున నన్నీబీదతన ములోదిగనాడి పోవందగునా యనియె. అందునకు వారలు నాయనా ! నీవిందు నకై యింతసంతాపమొందనేల; మేమొకశ్లోకమును జెప్పెదము. దానినీవు గొని చని యాపురవరుడగు బ్రహ్మదత్తునెదట జదివితివేని నీదారిద్ర్యము తొలిగిపోవునని చెప్పియొక శ్లోకమునువ్రాసియిచ్చి మానససరోవర తీరంబుంజేరి యోగసిద్ధినుండి రి. అదియట్టులుండనిమ్ము - బ్రహ్మదత్తుడు పైనంజెప్పంబడినట్టుల రెండుచీమలసం వాదమును వినినవ్వె. అదిచూచియతని సతియగు సన్నతి తనపతింగాంచి నీవిపుడుని ష్కారణముగ నేలనవ్వితివని యడిగిన నతండు తానాచీమల సంవాదమును వినిన తెఱంగెల్ల నెఱుంగించిన నాతరుణివానినమ్మక నీవునను జూచినవ్వియుందువు. ఇం తియకాని చీమలవలుకులు నీకుదెలియుట సాధ్యముకాదని కడుబెడిదములగు నుడువు లు నుడివిన నాతడు సేయునది లేకయూరకుండి వనవిహారంబు చాలించి యూరికిను బివచ్చితదేక చింతనుండి సప్తరాత్రవ్రతమును నొకవ్రతమున శతపత్ర నేత్రునా రాధించిన సప్తమరాత్ర ప్రభాతకాలంబున శ్రీశుడొక భూసురరూపంబున బ్రహ్మ దత్తునకు గలలోదోచి యుదయకాలంబున నీవునీపురంబెల్లం దిరిగితివేనినొక వృద్ధా వనీ సురుండు నీకగుపడి నీ సందియంబెల్ల మాన్పునని చెప్పి యదృశ్యుడయ్యె. అంత బ్రహ్మదత్తుడు మేల్కాంచి తత్కాలోచితకృత్యంబులం దీర్చితనమంత్రిమిత్రజనసహి తంబుగ రాజవీధిని బోవుచుండ నావృద్ధబ్రాహ్మణుడే తెంచి రాజునుడగ్గరి తననలు వురు పుత్రులుచెప్పిన శ్లోకమిట్లుజదివె. ("యేవిప్ర ముఖ్యాఃకురు జాఙ్గలేషు వ్యాధాః

స్తథాదాశపురేమృగాశ్చ। కాళఞ్జరే సప్తచచక్రవాకా యేమానసే తేవయమత్రసిద్ధాః"॥ అనగా - కురుజాంగల దేశమందు విప్రముఖ్యులుగను, దాశపురంబున నెఱుకలుగను, కాళంజరంబున మృగములుగను, మానససరసీ తీరంబున జక్రవాకంబులుగను, ఉండినమనలో మేమిపుడు యోగసిద్ధులుగ నున్నారము.) అనునా శ్లోకార్థము గ్రహించిన తత్క్షణంబ బ్రహ్మదత్తుండును, మంత్రులుగనున్న యతనియన్నలిరువురును బూర్వజన్మస్మరణంబుగలిగి మూర్ఛిల్లి కొంతతడవునకు దెలివినొందిరి. అంతవారలు మువ్వురును మనమిక వృథాభోగాదులం బడిచెడనేల యోగసిద్ధిం గందమని యాలోంచిచుటంజేసి బ్రహ్మదత్తుఁడా ముసలిబాపని కమితధనంబును, అనేకాగ్రహారంబులనిచ్చి తనతనయుడగు విష్వక్సేనుని రాజ్యాభిషిక్తుంగావించి మంత్రులుగనున్న తనయన్నలంగూడి మానససరస్సు కరిగియందుండు తక్కుయన్నలతోఁగూడి యోగసిద్ధినొందె. అపుడాతని సతి సన్నతి సగానాతని వెంటనరిగి నరవరా! నానిమత్తంబునంగదా నీకిట్టి యుత్తమమార్గము చే కూరెననియె. అట్లాయన్నదమ్ములు గోహత్యచేసినను, దానిశ్రాద్ధమున కుపయోగించుటంజేసి వైదవ జన్మంబున ముక్తిజెందిరి.

### శ్రాద్ధకాలనిర్ణయము - సం - అ - ౨౨.

అని మత్స్యుండు మనువునకుజెప్పెనని సూతుండుమునులు వినంబలికి మఱియు నిట్లనియె. అపరాహ్ణంబున నభిజిద్రౌహిణముహూర్తంబు లుదయించుకాలము శ్రాద్ధయోగ్యమైన యది. అకాలంబునంజేయు స్వల్పదానంబేని నక్షయంబగు. మఱియు గయ, కాశీ మొదలగుస్థలంబుల నగణ్యంబులగు తీర్థములుగలవు. దానియందు బితృదేవతలకు దీర్థశ్రాద్ధంబులిడిన నెక్కుడు ఫలమగు. ఇంతకును వర్ణాశ్రమధర్మంబులందప్పక శ్రాద్ధముపెట్టుట యన్నిటికన్న నెన్నందగునదిగా నున్నయది-ఒకపవలు ౧౫ ముహూర్తములు గలిగియుండు. రెండుఘడియలైన నొక ముహూర్తమగు. అట్టిముహూర్తములు, ఉదయమున మూడును, సంగవమున మూడును, మధ్యాహ్నమున మూడును, అపరాహ్ణమునమూడును, వెలయుచుబడునైదగు. అందెనిమిదవముహూర్తము కుతపకాలమనంబడు. ఆకుతపకాలము మొదలుకొని నాలుగు ముహూర్తములలోపల శ్రాద్ధమునిడందగు, మధ్యాహ్నకాలము, ఖడ్గపాత్రము, నేపాళకంబళి, రజతము, దర్భ, నువ్వులు, గోవు, దౌహిత్రుడు, అను నెనిమిదియు కుతపములు (పాపమునకు కుత్సితమని పేరు. కుత్సితమును దపింపజేయునవిగాన నివి కుతపములనంబడును) అందుదర్భ నల్లనువ్వులు, విష్ణుని దేహమునుండి పుట్టుటంబట్టి శ్రాద్ధంబునకు శ్రేష్ఠంబులని దేవతలు వచించిరి. మఱియు దీర్ఘవాసులగు వారలుజలమధ్యంబున నిలిచి తిలమిశ్రితోదకాంజలిని బితృతృప్తిగనివ్వ నియతి. శ్రాద్ధకర్తనంతయు దర్భహస్తుడై కావింపవలయు.

## చంద్రవంశవివరణము - చంద్రోత్పత్తియు. సం - అ - ౨౩.

ఇకజంద్రోత్పత్తియు దద్వంశవివరణమును జెప్పెదవినుడని సూతుండిట్లుల వక్కాణింపదొడంగె. పూర్వము అత్రిమునినిజూచి సృష్టిసేయ స్రష్టయాజ్ఞ నొసంగిన నతండకార్యంబునకై మిక్కుటంబగు తపముసేయుచుండు నెడ హరి హర హిరణ్యగర్భ దివాకరుల కంతరంగుండును, పరమానంద రూపియునగు బ్రహ్మానధిష్ఠించి ఉమాపతి యాయత్రినేత్రమునందుండ యతని యష్టమాంశము సోమాఖ్యచే బఱంగుచునీరైకాఱందొడంగె. అది చూచి దిశలు పుత్రాకాంక్షతో దరుణీరూపంబుల ధరించి యాతేజంబునువహించిననది వారల గర్భంబున త్రింశత్సాహస్రి వత్సరంబులు నిలిచిన వారలాగర్భభారంబును భరింపనేరక గర్భపతన మొనరించికొనిరి. దాని బరికించి సరసిజోద్భవుడు దానినంతయుంజేర్చి యొకలావణ్యాతిరేకుండగు యౌవనపురుషుంగావించి దేవనిర్మితంబును, సహస్రరథ్యంబులం గలదియునగురథంబున నతనినునిచితన లోకంబునకు గొనిచనియె. అట్టి యౌవనపురుషుంగాంచి బ్రహ్మలోకవాసులగు బ్రహ్మర్షులెల్ల నుల్లంబుల నుల్లాసంబునొంది తమవల్లభుడని భావించిరి. అంతసురముని గంధర్వాదులతని బలుగతుల వినుతిసేయసాగిన నతండుమఱియు విశేషతేజోరాశియయ్యె. ఇంతలో సంధ్యాకాలమాసన్నమగుట చేద్వణజ్యోతిస్సులును, నక్షత్రంబులును, వెలుగనారంభించె. అదికారణంబుగా నారేఱేడు ద్విజపతియనియు, ఓషధీశుడనియు, చుక్కల దొరయనియు బఱంగుచుండు. అట్టి చంద్రుడు దక్షకన్యల నిరువదేడుగురను బెండ్లాడి విష్ణుంగూర్చి దశసహస్రాధిక పద్మసహస్రి వత్సరంబులు నిష్ఠురంబగు తపంబునలిపిన నలిననేత్రుడు పొడసూపివలయు వరమిచ్చెదవేడుమనిన నావేడివెలుంగుజోడుకాడు నేజేయు రాజసూయ యాగంబున నీవును దేవతలును బ్రత్యక్షముగ హవిర్భాగంబులం గొనవలయుననియు మహేశుండురక్షఃపాలకుడు గానుండవలయుననియు గోరిన నాశౌరి యారీతియ వరంబొసంగియంతర్ధానమునొందె.

అంతజంద్రుండా రాజసూయమును జేయనారంభించిన విష్ణుడాది దేవతలెల్లవచ్చియుపద్రష్టాదులై యజ్ఞము సమాప్తమొందించిరి. పిదప నాతనినిరుపమాన విలాసంబుం దిలకింపందలంచి, లచ్చి, శినీవాలి, ద్యుతి, తుష్టి, ప్రభ, కుహు, కీర్తి, వసువు, ధృతి, అనుదొమ్మండ్రు జవరాండ్రేతెంచి యాతని గాంచి పంచబాణునివంచనం జిక్కిన నాచుక్కలఱేడు వారిందన నారీరత్నంబుల తీరున గారవించె. దీనివెఱింగి యాసారసేక్షణుల పతులగు నీరజేక్షణుడు మొదలగు వారలువచ్చి యాతనిందాకి బహువిధంబులం బోరియు నాతని నొంపనేరరైరి. ఈరీతి నాసోముడు భీమపరాక్రమత దుర్జయుడై సురలోకపదవి ననుభవింపుచు నొకనాడుద్యానవ

నంబున బృహస్పతి సతియగు తారం గాంచి దాని యెక్కుడు చక్కదనమునకు టక్కువిలుకాని చిక్కులం జిక్కి యాటక్కులాడిని మక్కువ నపహరించె. దానం జేసి యామహాత్ముని సూనశరకోటి సన్నిభుండగు జంద్రువిడువ డెందంబొప్పక యుండెను. అతండును దారయందుగల ప్రేమాతిరేకంబుచే దాని మావడయ్యె. ఇట్లుదనసతింగోల్పడి బృహస్పతి యతిక్రోధమానసుండై యాచంద్రు సమయింపందన మంత్ర సామర్థ్యంబును, అస్త్రవిద్యా నిపుణత్వంబును జూపియు నాతని జయింప నోపక దీనతందన యాలినిమ్మని వేడె. ఐనను దారాచంద్రుల కొండొరుల యందు గలయనురాగంబుచే జంద్రుండా మందయాన నివ్వకున్న గురుడు గిరిజాధిపునకు దన దీనభావము విన్నవించిన నాపన్నగభూషణుడు బ్రహ్మాదిదేవ గణయుక్తుడై వచ్చి యెన్నివిధంబులం జెప్పినను జంద్రుడొప్పకున్న పన్నగధరుడు మిగులరోషించి సంఖ్యాతీత ప్రమథగణంబులను భూతభేతాళాది భృత్యులును గుబేరుని నాతనిబలంబునుగూడి చంద్రునితో యుద్ధమొనర్ప సన్నద్ధుడయ్యె. అయ్యిరువురకును బెద్దపోరయ్యెంగాని నాపినాకి యాతని నేవిధంబునం బరిభవింప నేరక క్రూరతరంబగు బ్రహ్మశీర్షాస్త్రమును బ్రయోగించె. దానికెదంబెదరక చంద్రుడు సోమాస్త్రంబును బ్రయోగించె. ఇట్లా రెండస్త్రంబు లొండొంటిందాకి మంటలం గ్రక్కుచు భూనభోంతరాళంబులనిండి సమస్తంబుంగాల్ప దొడంగిన బ్రహ్మదిగులొంది వారిపోరు తనచమత్కారంబున వారించి చంద్రుండగ్గరి నీవు పరదారనపహరించిన యపచార మొనరించియు నీరీతి క్రూరత బోరందగదు. కావున నీవు ప్రజలకు బాపగ్రహమయ్యెదవని బిట్టుగ దిట్టి యావాచస్పతిసతి నతనికి మఱలనిమ్మనిన జంద్రుండు తనప్రాణపదంబగు దారను గురునకొప్పగించె.

బుధోత్పత్తి - సం - అ - ౨౮.

ఆ చంద్రవదనకు చంద్రవీర్యమునిలిచి ద్వాదశాదిత్యసన్నిభుండును సకలవిద్యావిశారదుండునగు బుధుడను కుమారుండుగలిగె. అపుడు దేవతలరుగుదెంచి యీకుమారుడెవ్వని తేజంబునంబుట్టెనని తారనడిగిన నాపడతి చంద్రనందనుడనియె. అందునంజేసి చంద్రుడాబుధుని దోడ్కొనిచని జాతకర్మాది కృత్యంబులొనర్చి భూలోకంబునకు రాజ్యాభిషిక్తుంగావించె. పిదప బ్రహ్మ యాతని నవగ్రహములలో నొకనిగా జేసె.

## పురూరవచరిత్రము.

ఆబుధునకు పై జెప్పబడిన మాడిక్క నిళయందు బురూరవుండను తనయుడు జనించి హిమవద్గిరిని విష్ణుంగూర్చి పెద్దకాలము తపంబుసలిపి యవ్విష్ణువరప్రభావంబున సప్తద్వీపాధిపుడై నిరుపమానబలసమన్వితుడై యెల్లెడల సంచరించుకీర్తిం గలిగి ధర్మార్థకామంబుల మూటిని సమతననుష్ఠింపుచు నుత్కృష్టచరిత్రుండై ధా

త్రీపాలన మొనరింపుచుండె. అపుడు ధర్మార్థకామంబులు మూడును, అతడు తమను మువ్వురను సమత్వంబునం జూచెడినో న్యూనాధికత్వంబుల భావించెడినో యెఱుంగుదమని తలంచి స్వస్వరూపంబుల నతనికడకేతెంచిన నతండు వారలమువ్వురను సమానంబుగ నాసనార్ఘ్యాదులచే సత్కరించెంగాని ధర్మమును మాత్రము కొంత మెక్కువగా బూజించె. అందునంజేసి యర్థము రోషించి నీవులోభము (అత్యాసక్తి) వలన నశించెదవనియు, కామము నీవు ఊర్వశీవియోగంబున నున్మాదివయ్యెదవనియు శపించిరి. అంతధర్మమాతనిగుణంబునకు సంతుష్టాంతరంగమై నీవధికైశ్వర్యయుక్తుడై యుండుటయగాక సూర్యచంద్రులుండు పర్యంతము నీవంశపరంపరలనంతంబుగ వృద్ధింజెంది ఖ్యాతింగాంచునని నుడివె. ఇది యటులుండనిమ్ము. ఇంద్రుని సగాజయించిన కేశియను దనుజుడొకతఱి నూర్వశియను నచ్చరకన్నెనెత్తికొని పోవుచుండ బురూరవుడు వాని మర్దించి యాముద్దియను విడిపించి యూర్వశిని నింద్రునకొప్పించె. అందునంజేసి యింద్రునకును బురూరవునకును గడుమైత్రిగలిగియనిమిషపతి యాభూపతికి నిజార్ధాసనమిచ్చుచుండె. పురూరవుడు ప్రతిదినమును స్వర్గమునకుబోవుమాడిక నొకనాడేగియుండ శక్రుడు ఊర్వశి మొదలగువారల లక్ష్మీస్వయంవర నాటకమాడనాజ్ఞాపించె. కావున నూర్వశి లక్ష్మీవేషమునవచ్చి నృత్యము సలుపుచు బురూరవుని బరికించి విరులవిల్తునిబారింజిక్కి నాట్యము సేయందప్పిన భరతశాస్త్రాధిపుండగు భరతుడందుండుటంజేసి యూర్వశింజూచి కోపించి నీవొకలతవై యేబదేనేండ్లు భూమింబడియుందువనియు బురూరవుని పిశాచంబై దానినాశ్రయించెదవనియు శపించె. అంత నూర్వశిపురూరవుని వరించి ధరకరుగుదెంచె. పిదపశాపాంతంబునందూర్వశికి పురూరవునివలన ఆయువు మొదలగు నెనమండ్రుసుతులు గలిగిరి. అందు ఆయువునకు నహుషుడు, వృద్ధశర్మ, రజి, రసుడు, విపాప్మ, అన నైదుగురు కొమరులుగలిగిరి. అందురజియనువాడు నూర్వురుపుత్రులంబడసి పెద్దకాలము హరింగూర్చి యుగ్రతపంబొనరించి తద్వరప్రభావంబున దేవ దానవాదులకజేయుడై యుండె. అట్టితఱి సురాసురులు మున్నూరేండ్లేకరీతి బోరుచుండనందుశక్ర ప్రహ్లాదులు భయంకరమగుయుద్ధముసలుప నందెవరికిని జయాపజయంబులు గలుగనందున వారలు నలువకడకరిగి యెవడుజయించునని యడుగ యాతడు రజిజయించునని జెప్ప సురాసురులు రజినిదమతమ సేనానిగాగోరినను రజిసురలకు సహాయుడై యసురులంబరిభవించె. దానంజేసి శతముఖుడతని సుతుడుగానటించుచుండ, రజి, రాగిల్లియతని తనరాజ్యమునకంతయు బ్రభువుంగావించి తపోవనికేగె. రజిపుత్రులు తమకురాజ్యమేమియులేక శక్రుడంతటికినిబలిమియైయుండ సైరింపక జంభారితోరణమొనర్చి యాతనిదోలి తమపైతృకరాజ్యంబును. స్వర్గపదవియు, యజ్ఞహవిర్భాగంబులును దూసికొనిరి. ఇట్లు నింద్రుండు ప్రభుత్వసంపదచెడి బృహస్పతినాశ్ర,

యించిన నాతడతనిగ్రహశాంతివిధాన పౌష్టిక కర్మలబలవంతుంగావించి యారజిసుతులం దనచమత్కృతిచే వేదబాహ్యులగునటులంజేసిన నింద్రుండు వారలనోడించి తనయాధిపత్యమును మఱలవహించె.

### యయాతిచరిత్రప్రారంభము.

ఆయాయువు జ్యేష్ఠపుత్రుండగు నహుషునకు,యతి, యయాతి, సంయాతి,ఉద్ధవుడు, పాంచి, సయాతి, మేఘసంయాతి, అన నేడుగురు సుతులుగలిగిరి. అందు జ్యేష్ఠుండు యతి బాల్యంబుననే వైఖానసుడను యోగియయ్యె. ద్వితీయపుత్రుడగుయయాతిరాజ్యమును బూని కడుధర్మమార్గప్రవర్తకుడై త్రిలోకంబులంగీర్తివడసె. అతనికి శుక్రపుత్రియగు దేవయానియు వృషపర్వుని సుతయగు శర్మిష్ఠయు, మానినులుగనుండిరి. వారియందాతడు, యదు, తుర్వసు, ద్రుహ్యు, అను, పూరులను నైదుగురు సుతులంగాంచి శుక్రశాపంబున ముదిమినొంది తనపుత్రులంజూచి తనకు స్వచ్ఛందనవనితాదులయం దాసక్తి వీడనందున దనముదిమి నెవ్వడేనిగొని తనకు వానియౌవనమిచ్చునటులం గోరినవారలెల్ల నూరకున్ననందు గనిష్ఠుండగు బూరువు తనజనకునిష్టంబీడేర్చె. దానంజేసి యయాతి సహస్రవత్సరంబు లన్నిభోగంబు లనుభవించి తనజరంగొన్న పూరువుపై ప్రేమచే నతనిం దన దేశాధిపుంజేసి యాతనివంశంబన్నిటి కన్న నెన్నందగునదియై భరతాన్వయులకాలయమై యొప్పునటుల నుడివి కాలగతినొందె.

### యయాతిచరిత్రము - సం - అ - ౨౪ - మొదలు - ౪౨ - వరకు.

అని చెప్పిన మునులు సూతుంజూచి యిదికడుచిత్రంబు జ్యేష్ఠుడగు యదువుండం గనిష్ఠుడగు బూరువువంశంబెట్లు శ్రేష్ఠంబయ్యె ? మఱియు నీయయాతిమహానుభావుడని యనిమిషులుసగా కీర్తించెదరు. కావున నాతని చరిత్రంబు సవిస్తరంబుగ జెప్పుమని ప్రార్థించిన సూతుడువారింగాంచి తొల్లిశౌనకుడను విప్రముఖ్యుడియ్యయాతి పుణ్యచరిత్రమును శతానీకునకు జెప్పియుండు. అక్కరణి మీకు నేవక్కాణించెదవినుడు. బ్రహ్మకు నెనిమిదవ పురుషుండును మద్వంశకారణుండునగు యయాతిచరిత్రంబును వివరింపుమని శతానీకుడడిగిన నతనికి శౌనకుడిట్లనియె.

### శుక్రతనయయగు దేవయానీ వృత్తాంతము.

తొల్లి దేవదానవులెల్ల బల్లిదులై స్వర్గపదవికై పలువిధంబులబోర సమకట్టి బృహస్పతిని దేవగురునిగను శుక్రుని దానవాచార్యునిగను గొనిరి. అందునంజేసి గురుశుక్రు లిద్దరును దమబుద్ధినంతయు బ్రసరింపంజేయుచు దమతమ శిష్యులకు దేజంబుగలుగంజేయ దొడంగిరి. ఐనను, శుక్రునందు సంజీవనియను నొకయత్యద్భు

డె. అట్టివిద్యాగురునంపు లేమింజేసి దేవాళిదైన్యంబునొంది వాచస్పతి నందనుడగు గచుని కడకేతెంచి యతని బలుగతులం బ్రార్థించి నీవు దానవనాయకుండగు వృషపర్వుని పురంబుననున్న శుక్రుపాలికేగి యతని శుశ్రూష సేయుచు నాతని కూతురగు దేవయాని నెయ్యేవిధంబుల దృప్తినొందింపవలయునో యయ్యైచందంబుల వర్తించి యాసంజీవనివిద్యను గ్రహించి యీదేవ పదవినుద్ధరింప వలయునని పెద్దయుగోరినం దద్దయునుద్దికచే నాగురునందనుడు దేవకార్య నిర్వాహకాపేక్షచే శుక్రు పాలికేగి సాష్టాంగదండమిడి మోడ్పుకేలు ఫాలభాగంబునం జేర్చియోయాచార్యవర్యా! నేనంగిరస్సుని పౌత్రుడును, సురగురుని పుత్రుడను, యుష్మచ్ఛిష్యుడనై సహస్రవర్షంబులు బ్రహ్మచర్య వ్రత మనుష్ఠింపవచ్చితిననిన మెచ్చి శుక్రుం డాతనింగాంచి నాకు బూజ్యుండగు గురునకు నీవుతనయుడవగుటచే నీవును బూజనీయుడవు. నీ కోరినప్రకారముండుమని నియమించి యతనికి బ్రహ్మచర్య వ్రతోపదేశమిచ్చిన నాకచుడు వికచవదనుండై బహుభంగుల శుక్రుసదేవయానిని సేవింపుచుండ నాతనివ్రతనిష్ఠ శీలాచారసౌందర్యాతిరేకంబులకు దేవయాని ధ్యానంబున భావజబాణపీడితయై యతనిపై నత్యనురాగ ముంచియుండె. ఇట్లు నేనూఱేండ్లతడు ప్రవర్తింపుచు ప్రతిదినముం బోవునటుల నొకనాడు నిజాచార్యుని గోవులంగొని యడవికేగియుండ దానవులాతనింగాంచి మనవైరుగురుని బిడ్డడు వీని జంపుట యుక్తమని చిత్తంబులం దలంచి యాతని దునియలుతునియలుగ ఖండించి యాఖండంబుల శునకంబుల పాలు గావించిన సాయాహ్నంబున గాపరిలేక గోవులు మాత్ర మింటి కరిగె. దేవయాని కచునిప యింగలప్రేమచే బ్రతిదినము నాతని నెమఱు చూచెడి పద్ధతి నద్దినంబును జూచి యాతడు మఱలమికి బరితాపమొంది తనతండ్రింజూచి ఖిన్నభావంబునడగ్గుత్తికతో నిట్లనియె. తండ్రీ! అంగిరస్సుని పౌత్రుడును గురునిపుత్రుండును బ్రహ్మచర్యవ్రతనిష్ఠా గరిష్ఠుండును శ్రీమచ్ఛిష్యశ్రేష్ఠుండునగు గచుడు సాయంకాలమైనను మందిరంబునకు మఱలడయ్యె. ఆవులు మాత్రమువచ్చి యున్నవి. ఇదిచూడంగుటిల దైత్యులాతని వధించి యుందురని తోచుచున్నయది. మత్ప్రాణంబులెల్ల నాతనిపైగలవు. కావున నాతడు మృతినొందియుండె నేని నేనాతనిగతి నొందెదననియె. అందునకాయసురగురుడు నిజతనూజంగాంచి యమ్మా! నీవిందునకై యింతచింత జెందనేల? నాయందు సన్నిహితమైయుండు "ఏహ్యేహి" అను సంజీవనీ విద్య నుచ్చరించిన తత్క్షణంబు నాకచుడు వచ్చునని తద్వాక్యము నుచ్చరించి "కచా" అనిపిలచిన తోడనే కచుడు మఱిల శరీరధారియై యాతనికడ కేతెంచి యాతని చరణముల కెఱగె. ఇదిగని దేవయాని యానంద భరితాత్మయై కచునందు దినదినంబునకు ననురాగంబు వృద్ధినొందింపుచుండె కొంతకాలమునకు బిదప గచుని దనకు వలయు విరులం దెచ్చుటకై

యుద్యానవని కనిచిన నతండేగియుండ నతని దైత్యులు మఱలగని మనమితని నెన్నిమాఱులు చంపినను శుక్రుడు మఱల బ్రతికించుంగాన ననూనమగు నుపాయము సేతమని తలంచి కచునిజంపి చూర్ణముసేసి యాచూర్ణమును మద్యమునం గలిపి శుక్రునొద్దికిదెచ్చి యతం డజ్ఞానంబున నామద్యమును ద్రావునటులంజేసిరి.

అంతదేవయాని కచుడు పువ్వులందేనరిగి మఱలి రానందున జింతాక్రాంతయై తనసందియమును దనజనకున కెఱింగించిన నతండిట్లులనియె. నాముద్దుల పట్టీ! యీవట్టిపిచ్చి నీకేల ? బ్రహ్మాదిసురలకూడ మన్మాహాత్మ్యంబున నినుబెద్దగబుద్ధిందలంపనేజేసియుండ నీవొకనికై యింతగవంత నొందనేల ? నేనెన్నిమారు లా చిన్నవాని బ్రతికించినను దానవులు వానింజంపక మానరనియె. అంతనకాయిందీవరాక్షి తనడెందంబున దిగులొంది యిట్లనియె. నాయనా! ఈయకృత్యముదగదు. తొల్లి నేనుడివినటులం గచుడంగిరసవంశజుడును బ్రహ్మచర్య వ్రతనిష్ఠాగరిష్ఠుడు నగుటచేబూజ్యుడు. మఱియునాప్రాణంబు లాతనిపైయుండుటంజేసి యాతడు వోయిన మార్గంబున నేనునుబోయెదననియె. అపుడుశుక్రుడుతిన్నగ గచా! యనిపిలచిన నతని జఠరాంతరంబునున్న కచుడుతిన్నగ బ్రత్యుత్తరమిచ్చిన శుక్రుడత్యాశ్చర్యమునొంది కుమారా ! నీవుమదుదరమెట్లుజొచ్చితివి ? అజ్జఠరాగ్ని మొదలగువాని నెట్లుసహింపుచున్నవాడవు ? అనియడిగిన నద్దేవగురుసుతుడిట్లనియె. మహాత్మా ! అసురులసూయచేననుసమయించి మచ్ఛరీరచూర్ణమును సురంగలిపి నీకుద్రాపిరి. ఐనను భవదుపదిష్ట బ్రహ్మచర్యవ్రతమాహాత్మ్యంబున నేనీజఠరనరక సంకటంబులనొందక జ్ఞానముచే నున్నాడను. అనినవిని దనుజగురుడు తనసుతంజూచి నేగచుంబ్రతికించితినేని నతండు నాయుదరముంజించుకవచ్చుంగావున నేజచ్చెద. అట్లు జేయకున్నం గచుడు మఱల బ్రతుకనేరడని పలికిననాకలికి యులికిపడి కడు డోలాయమానమానసయైయుండ శుక్రుండుకచునకు సంజీవనీవిద్య నుపదేశించి కడుపువెడలిరమ్మనిన నతండాతనియుదర దక్షిణపార్శ్వమును భేదించికొని బైలువెడలివచ్చి యుదరభేదనకారణంబున మరణంబు నొందియుండిన తనగురుని నాసంజీవినీ మహామంత్రమూలంబునంబ్రతికించె. అందునంజేసి దేవయాని యమందానందంబునొందె. అంతశుక్రుడు దానవులయెడ గరంబుకోపించి బ్రహ్మహత్యంగావించిన నీచులు నీచదశనొందకపోరు. మఱియు మద్యపానపుమత్తు నాకిత్తీరునంజిత్తభ్రమణగలుగంజేసెగాన నిదిమొదలు పృథ్విసురుండెవ్వడేని సురాపానము సేసెనేని వానికివేదములును గర్మలునునశించుటయగాక యట్టివాడు జాతినిందితుడగునని శపించి దీనిని దివినుండు సురాదులును భువినుండు నరాదులు నెఱుంగుడనిపలికి గురుసుతుండు తనజఠరమునుండి పుట్టుటంబట్టి యతినిం దనసుతుడుగ భావించి యొక్కవమక్కు

వచే ప్రోచుచు దానవులనెల్లరావించి వారిదుర్న్నయమును వర్ణించి యికగచుని జెనకకుండుడని యాజ్ఞనొసంగె.

ఇట్లాకచుడు సహస్రవత్సరంబులందు వ్రతమును ముగించి వలసినవిద్యను బడసి శుక్రునాజ్ఞంగొని స్వర్గంబునకు నేతేర గమకించిన దేవయాని యడ్డపడియో భావజాకారా! నీపైపెద్ద కాలమునుండి బుద్ధినిడికొనియున్న నన్నుదైన్యము నొందంజేసి దిగనాడి పోవందగదు. నీవు రెండు మారులు మరణము నొందియుండ నేబ్రతికించినదైనను మనంబున నెన్నుము. నామాటంద్రోయక నన్ను బెండ్లాడుమని యెన్నివిధంబులం జెప్పినను గచుడొప్పక హరిహరీ! ఓతరుణీమణీ! ఇట్టిక్రూర వాక్యములాడందగునా? నీవుమద్గురు పుత్రివి. అదియుంగాక నీవేయుదరము నుండి యుదయించితివో యాగర్భము నుండియ నేనిపుడుద్భవమొందితి. ఇట్టుల నీవు నాతోబుట్టువగుచు నీతగనివగలందగులం దగదనియె. అందునకు దేవయాని కోపించి నేనెన్ని విధంబులం బ్రార్థించినను గనికరములేదు, కావున నీవిపుడు బడసిన సంజీవనీవిద్య నీకు ఫలించకుండుగాకని శపించె. అందున కాతండు నవ్వి యోజవ్వనీ! నీవిప్పుధిందిట్టుటంబట్టి యవ్విద్య నాకు ఫలింపకున్న నాచేనుపదేశము గొనువారలైనం దత్ఫలముగందురుకదా? నీవుమద్గురుపుత్రివగుటచే బ్రతిశాపంబివ్వనేరనైన నీవెద్దానిం గోరియుండెదవో యదినీకు గలుగదని చెప్పి స్వర్గమునకరిగి తానేర్చిన విద్యనుదేవతలకుపదేశించిన వారలుబ్బి జంభారికడకేగి యతనికావార్తం దెలిపి యిక దడవుసేయందగదు పగతుల నొగులంజేతమని యాలోచించిరి.

అంతనొకనాడు దానవనాయకుండగు వృషపర్వుని కూతురగు శర్మిష్ఠయు, శుక్రసుతయగు దేవయానియు ననేకసఖులంగూడి జలక్రీడార్థము పురివెలికరిగియచటనొక సరసీతీరంబునం దమయందలి వస్త్రంబులవిప్పి వేఱు వేఱుగా నిడి జలక్రీడలాడుతఱి నింద్రుండందరికి మారుతమైయాయన్ని చీరెలు గలియునటులంజేసె. పిదప నాకన్నియలు నీళ్లాటంజాలించి తమతమ పుట్టంబులంగట్టికొనిన శర్మిష్ఠ దేవయానివస్త్రంబు ధరించిన నదిగని దేవయానికోపించిశర్మిష్ఠను దూరుటంజేసి వారొండొరులతో వాదులాడిరి. అపుడు శర్మిష్ఠనే రాజసుతను నీవట్టిపట్టభద్రుమనాశ్రయించిన విప్రకన్యవు. ఈభేదమెఱుంగక నీవు నన్నవమానించితివనిపలికి నాయడవిని నొకపాడుబావియుండ దానిలో దానింద్రోచి యదిమృతి నొందినదని మతినుబ్బి తనచెలికత్తియలతో నిజపురికరిగె.

అద్దేశముయయాతిపార్థివోత్తమ పాలితంబగునది కావున నయ్యయాతిమృగయావినోదార్థ మయ్యడవికేగి డప్పిగొని నీరునరయుచు దేవయానిపడియుండు శిథిలకూపంబుజేరంజని యందు నగ్నిశిఖంబోలి దగద్ధగాయమానంబై సర్వాభరణభూ

షితమైయుండు నొకమీనాక్షి నీక్షించియిట్లనియె. ఓనారీరత్నమా! నీవీరీతి నీనూతినిబడియుండ గారణమెద్ది? నీవెవ్వానిసుతవు? తెలియంబలుకుమనిన నక్కలుకుల తుప్ప యప్పురుషపుంగవుంగాంచి యోపంచబాణసన్నిభా! ఎవ్వాడు నిజసంజీవనీ మంత్రమాహాత్మ్యంబున దానవులకు నాశములేకుండ జోకతో బ్రోచెడినో యట్టిశుక్రునకేను బుత్రిని; నీవునన్నెరుంగకున్నను నీకీర్తిని నేవిన్నానుగాన నీవు నను నీదక్షిణహస్తంబిచ్చి నూతిగట్టు కెక్కించుము. నీవునను వరింపగలవనిచెప్పిన నప్పార్థివుం డప్పగిదిగావించి తనపురంబునకేగె.

అంతదేవయాని తనపురంబునకరుగ నిష్టములేక తనసఖియగు ఘూర్ణికతో దనతండ్రికి దనవార్తం దెలుపబంపిన నదియేగి యారీతియగావింప శుక్రుడు తన తనయకడకేతెంచి యెవ్వారెంతెంతం జేసికొనియెదరో యంత ననుభవించెదర నియె. అందున కాతనినందన చింతాక్రాంతయై శర్మిష్ఠ పలికినపగిది నేనాశ్రయించువానికిని దానముగొనువానికిని గూతురైనది నిజమేకదా యనియె? అపుడు శుక్రుడు తనతనయంజూచి నీవివ్విధమున నివ్వగలనొందనేల? ఆశ్రయింపబడువాడును దాతయునేనైనది యింద్రునకును, వృషపర్వునకును, యయాతికిని దెలియుగాని తక్కినవారికెఱుంగ శక్యముగాదు. నాకుసచ్చిదానందాత్మ స్వరూపుడగు పరబ్రహ్మంబేబలము. మఱియు బాల్యావస్థను మీదెఱుంగక క్రోధమునుబూని జనులుబాధ జెందుదురు. నరులున్యాయాన్యాయ పరిజ్ఞానములేక వృథాక్రోధమునొందిరేని వారిని పశుప్రాయులుగ నెన్నవలయు. ఎన్నిటంజూచిన దన్నుజంపుక్రోధమును శాంతముచేజంపి శాంతప్రధానుడై నిలిచెనేని నాశాంతమువలనం క్రోధము తనవినాశకారణమని తెలియబడుటయగాక యట్టిశాంతమతికి నివ్వసుమతి నెవ్వరు వైరులు లేక యతండు లోకంబులన్నిటిం జయించినవాడగు. అట్లు గోపమునడంచి శాంతమునువహించు మానవోత్తమునకు సముడిబ్భువిం గలుగనేరడు. మఱియు శతవత్సరంబు లేకతీరునం బ్రతిమాసంబునం దప్పక యశ్వమేధయాగము సేయువానికన్నను సతతము బ్రాహ్మణులకు భోజనమిడువానికన్నను శాంతపరుడు పుణ్యుడని ధన్యచరిత్రులందురు. అట్లుగాక క్రోధముచే సాధువులనొప్పించిన నరకబాధగలగకపోదు. దుస్సంగతిచేగలుగు నీకోప మిహపరలోకంబుల రెంటను గీడునాపాదించు. ఇంతియకాదు. ధరను నరునకు ధనమెచ్చెనేని మదమెచ్చును, మదమెచ్చెనేని దురభిమాన మెచ్చును, దురభిమానంబునం గ్రోధమెచ్చును, క్రోధంబున సకలపాపంబులెచ్చును. మఱియు దనమది కపటముగలిగెనేని నొరునియందు గపటమున్నట్లునూహాగలుగు. తనకు గపటము లేకున్నందనకెవ్వడును గపటిలేడు. కావున నీవు సత్కులమందు బుట్టియు నీచందమున నీచులక్రియ నలుగందగదని యెంతచెప్పినను «రోగికి బథ్యాహారంబుగంటకించుపగిదియు, నాస్తికునకు దేవతాస్మరణయన్న శిరో

భారముగలుగు విధంబున" దేవయానికది ప్రియంబుగాక నేనాశర్మిష్ఠపట్టణంబునకు రాననియె. అంతశుక్రుడు పుత్రివ్యామోహాత దానివిడనాడనేరక వృషపర్వురావిం చిరక్కసులుకుమిగిలి కచుని రెండుమారులు వధించినవిధంబును శర్మిష్ఠదేవయా నినవమానించిన తెఱంగును దెలిపి నేనిక నీపురంబున నుండననిన నతండు భీతిల్లి యాతనిపాదంబులపై వ్రాలి నాసామ్రాజ్యంబంతయు నీయది నీయాజ్ఞానుసరణి నేనటించెదననిన నట్లైన దేవయానియిష్టముంబట్టి చరింపుమనియె. అంతవృషప ర్వుడు దేవయాని ననునయించి నీయిష్టంబుం దెలుపుమన నావశత శర్మిష్ఠ వేవురు దాసీజనంబులతోడ దనదాసిగ నిపుడుండుటయగాక నేబెండ్లాడినపిదపసగా నా దాసిగా నుండవలయుననియె. అప్పుడా వృషపర్వుడు శర్మిష్ఠనురావించి అమ్మా! నీవిమ్మెయింజేయవైతివేని మాకులమెల్లనశించుననిన నాసుగుణాలవాలయామోదిం చిసహస్రదాసీజన సహితయై దేవయానికి దాసియయ్యె. అపుడుదేవయాని దా నింజూచి యాశ్రయింపంబడునట్టియు యాచింపంబడునట్టియునీవు నాకిపుడు దాసి వెట్లయ్యెదవని యపహసించిన నాగుణశ్రేష్ఠయగుశర్మిష్ఠ కోపమునొందక యెట్లైన నేమి; మతుకులరక్షణార్థమై యీవేవురస్త్రీలతో నీకునేదాసినై యిపుడును నీవు మగనింటికింబోయిన పిదపసగా నినుసేవించెదననియె.

దేవయానియయాతినివరించుట.

ఇట్లుశర్మిష్ఠ సహస్రసఖీజన సహితయై తనుసేవింపుచుండ దేవయాని కొంతకాలము సుఖించి యొకనాడు తనదాసీజనంబులుగొలువ తొల్లి తానేనూతి నుండియయాతిచే గట్టుకీడ్వంబడెనో యానుయ్యి యుండువనంబునకు విహారార్థ మేగి యందుసంచరింపుచుండ దైవయోగంబున యయాతియు నద్దినంబు వేటకై కానలకేగి పిపాసాపీడితుడై దేవయానియుండు నావనంబునకువచ్చి యచ్చట నె చ్చెలురూపాదివిభవంబులందేలుచు వేవురుదాసీ వనితలుసేవింపగ దేవయానయు వేఱు వేవురు దాసీజనులు తనుసేవింప దేవయాని దాసత్వమొనర్చు శర్మిష్ఠయు నుండంజూచి వారిచరిత్రనరయంగోరి వారిండగ్గరి దేవయానితో మీరలెవ్వరివ్వ నంబునకు రాగతంబేమి ? అనియడిగిన నాయుడురాజముఖియిట్లులనియె. ఓపురు షశ్రేష్ఠా ! నీయుత్కృష్టవాక్యవిజృంభణయు స్వరూపకాంతులునుజూడ నీవు బా డబుడని తెలియవచ్చుచున్నయది - నీవెవ్వండవు ? వాక్రువ్వుమన నవ్వసుదేశుడు నేబ్రహ్మచర్యకాలంబున వేదముల బోధించికొనియుండటంజేసి విప్రునిగదోచెద నిం తియకాని నేరాజవంశజుడను, నహుషునందనుడను, ననుయయాతియందురనియె. అందునకాదేవయాని సంతసిల్లి యత్యంత ప్రియవాక్యంబులనిట్లనియె. నేశుక్రనందను.

మదీయదాసియగు నియ్యిందుముఖి దానవేంద్రుండైన వృషపర్వుని పుత్రియగు
శర్మిష్ఠ. ధన్యాత్ముండగు నినుగంటి. నేధన్యనైతి. నినుతప్ప వేఱుపురుషునీశరీరం
బుతో వరింపనుగావున ననుజేబట్టుమనిన నాజనపతి యవ్వనజగంధింజూచి విప్రుడు
క్షత్రియకన్యం బరిగ్రహింపనగుంగాని క్షత్రియుడవనీసురాంగనను బెండ్లాడుట ధ
ర్మవిరోధమనియె. అందునకామందయాన మందహాస ముఖారవిందయై బ్రాహ్మ
ణులును క్షత్రియులును బ్రహ్మశరీరోద్భవులై సమాధికార వేదాభ్యాస వైదికకర్మా
దులంగలిగియుండ రాజులు ద్విజకాంతలం బరిగ్రహించుట యకృత్యంబుగాదు. మ
ఱియుదొల్లి నే నీకూపంబునం బడియుండ నీవునను జేబట్టిమీదికెత్తితివి. అట్టి శుద్ధ
మగు నాపాణినొరున కివ్వనని పలువిధంబులం జెప్పిన నప్పుడమ్మిఱేడుదాని నీక్షిం
చి చతుర్వర్ణములవారును వారిజగర్భు శరీరోద్భవులే. ఐనను వారువారు వేఱువే
ఱాచారంబుల విధానవిధేయులై ప్రవర్తింపకున్న దోషముంజెందుట సిద్ధంబు. ఐన
ను నీవిన్నివిధంబులంజెప్పెదవు కావున నీజనకుడు నిను నాకిచ్చెనేని నిను నేబరిగ్ర
హించెదను. అట్లుగాదేని వినుము తెలియంబలికెద. సర్పంబొక్కని గఱచి చంపనో
పు. శరంబొక్కపురుషుం బొరిగొనగలదు. బ్రాహ్మణకోపంబు కార్చిచ్చు కాననం
బుంగాల్చుచందంబున రాష్ట్రకోశ వంశాదులన్నిటి నున్నగ జేయనోపుంగావున
నేశుక్రుకోపంబునకు వెరచెదననియె. దానికామానిని నేనే నిను వరించెదగాన నీ
యందు దోషములేమింజేసి మజ్జనకుడు రోషింపడైనను నీకోరినరీతిం జేసెదనని చె
ప్పి తనజనకుని రావించిన శుక్రుండేతెంప యయాతినమస్కరించిన నతనిసత్కరించి
దేవయానివలన నంతయువిని యయాతింగాంచి మత్తనయ నిను వరించెంగాన దీనిం
బరిగ్రహింపుమనిన నతండాతనిజూచి నాకు ధర్మవిరోధంబును సంకరదోషంబును
గలుగకుండ ననుగ్రహింపుమనిన నద్దనుజగురు డవ్వరంబునిచ్చి యాశర్మిష్ఠ మత్సు
తదాసియైయుండు నిది సర్వవిషయంబులం బూజ్యురాలే. ఐననుదీనికి నీశయ్యామా
త్రమివ్వకుండుము. (పొందవద్దు) అనిచెప్పి తనస్థానంబునకరిగె. అంతయయాతి ద్వి
సహస్రదాసీయుతులగు దేవయాని శర్మిష్ఠలంగూడి తనపురికేగి దేవయానిం దన
పట్టపురాణింగావించి తదాజ్ఞను శర్మిష్ఠ నొకయశోకవనియం దొక భవనము
ననునిచె.

అంతగొంతకాలమునకు దేవయానికి యదువుఅను తనయుడుజనించె. పిదప
శర్మిష్ఠసంప్రాప్త యౌవనయై ఋతుకాలం బాసన్నమైన విన్నంబోయి నన్ని
పుడు వరించువారెవ్వరు ! నేదేవయానకు దాసిగాన దానివరుడే నావరుడు
గాని పెఱపురుషుడేల ? ఐననీసమయమున నాసుమశరాస ముడిటకేకతంబవచ్చిన
గాని మదీప్సితము తీరనేరదని భావించుచుండ దైవయోగంబున యయాతియొ
క్కడవ్వనంబున కేగిన నప్పువ్వుబోణియుప్పొంగుచు నప్పార్థివుంజేరి ప్రణమిల్లి

యంజలినిడి మ్రొక్కుడమి తండ్రీ! కడుదీనత ఋతుకాలంబున బుత్రాకాంక్షుతను న్ననాకు బుత్రదాన మొసంగుమని ప్రార్థించిన యతండు శుక్రుడు తనుశర్మిష్ఠదోడం గూడకుమని నియమించిన దానినంతయు జెప్పిన నొప్పక యప్పుడతి స్త్రీవివాహ ప్రాణధనాదుల విషయంబుననన్నృతంబాడినను దోషములేదని యార్యులు వచించెద రని నుడివి బహుప్రకారంబుల వేడిన యయాతి యాచకమనోరథ పరిపూరణవ్రత నిష్ఠుడగుటచే దాని మనోరథంబీడేర్చె. అందునంజేసి శర్మిష్ఠకు ద్రుహ్యుడనుసుతుడు గలిగె. శర్మిష్ఠకొక పట్టిపుట్టుటవిని దేవయాని భావమున ఖేదము నొందుచు శర్మిష్ఠక డకేతెంచి తత్పుత్రజన్మకారణభూతుని నెఱుంగ నెన్నియుక్తులం బన్నినను అన్ని టికన్ని సమర్పకంబులు సెప్పి శర్మిష్ఠ తనకొక ఋషి యనుగ్రహంబున నాసు తుడు వుట్టినట్టుల దేవయాని నమ్మంజేసి పంపె.

పిదప దేవయానికి యయాతి తేజంబున మొదటియదువుగాక తుర్వసుడను సుతుడువుట్టె. అతనివలననే శర్మిష్ఠకు మొదటికొడుకుగాక అనువు, పూరువు, అ నునిద్దరుసుతులు జనించిరి. పిదప నొకనాడు దేవయాని యయాతింగూడి శర్మిష్ఠా వాసంబునకువచ్చి యందు దివ్యవిలాసవంతులగు ముగ్గురుబాలురంగాంచి వారి యందు యయాతిరూపాది విశేషంబుల బరికించి వారిచరిత్రంబుంగూర్చి యయా తినడిగి యతనివలన నెఱుంగనేరక యాబాలుంబుజ్జగించి వారివలన యయాతివా రితండ్రియనియు శర్మిష్ఠవారితల్లియనియు నెఱింగి రోషారుణనేత్రయై శర్మిష్ఠపాలి కేగి మ్రోమడుకుపడతీ! నీకీచెడుగుబుద్ధి యేలకలిగె? నాదాసిగనుండి ననువంచిం చితివిగదా? అనినశర్మిష్ఠ నేనాడినది యన్నృతంబుగాదు. మఱియు నేనొనర్చినది య కృత్యంబుగాదు. ఎట్లన్న, రాజర్షియగు యయాతివలన నీపుత్రులంగన్నది నిజంబు. నీవరుడే నావరుడగుటం జేసియు నేనునీదాసిగనుండుటంజేసియు దోసము సేసి ప రుని వరింపక మనవల్లభుని వరించితినని యె. ఆమాటలువిని దేవయాని దీనాననయై య యాతింజూచి నీవునాకధర్మము సేసితివి. కావున నీయొద్ద నేనుండనని చెప్పి తనపుట్టి నింటిదారింబట్టె. యయాతియుదాని బోవలదని వేడికొనుచుదాని వెంటనేగె. ఇట్లా దేవయాని తనజనకునొద్దికేగి యయాతియధర్మమునకుం జొచ్చి రహస్యవృత్తి శ ర్మిష్ఠంగూడి దానికిముగ్గురు తనయులంజనింపజేసి నాకిరువుర కొమరులమాత్రమి చ్చినాడనిన శుక్రుడు కడుకోపించి తనకూతురితోడ వచ్చియుండు యయాతింగాంచి నీవు మదాజ్ఞనుల్లంఘించి యావల్లవాధరిని వరించితివి కావుననీకు కడుదుఃఖాస్పద మగు ముదిమిగలుగుగాకని శపించిన యయాతియాతనింగాంచి భార్గవా! నేజేసి నదితప్పెన్నటికిని గానేరదు. ఎవ్వరేద్దాని యాచించిననద్దానినివ్వనే వ్రతమువట్టి యుండుటంబట్టియు ఋతుకాలంబునం గామశరపీడితయై వేడు వాడుదానింగూడ కున్న భ్రూణహత్యాఘము సంభవించుటంజేసి యట్టి భ్రూణఘ్నుడిందునందునింది

తుడగుననియు, వృద్ధజనంబులువచించుటంజేసియు నేనట్లొనర్చితి. నాకుదేవయానియందుగల కామంబీడేరలేదు. కావుననీవు నన్ననుగ్రహించి యీముదిమిపోవం బ్రసాదింపుమనిన శుక్రుండుసాదరదృష్టి నతనిజూచి నీవొనర్చినది యకృత్యంబుగాదు కాని మదాజ్ఞనుల్లంఘించినాకుదెలుపక రహస్యంబున నాకలికిం గలియుటచే నేనట్టులం దిట్టితి. ఆతిట్టునుద్రిప్పగానేరదు. కాననీసూనులం దెవ్వనికేని నీముదిమినొకవేయిసంవత్సరములిచ్చి యాతనియౌవనమునుగొని భోగంబులనుభవింపుమని న నామనుజపతి దనుజగురుం దిలకించి నాసూనులందు జ్యేష్ఠక్రమాధికత్వముంజూడక యెవ్వాడు నాముదిమింగొనునో వానికినారాజ్యమంతయు నేనొసంగునటుల ననుగ్రహింపుమనిన నతం డట్లుజేయ వరంబిచ్చి యట్టిజనకవాక్య పరిపాలకుడు కులదీపకుడై ప్రఖ్యాతిగాంచునని నుడివి నీవునీముదిమిని నీసుతునకిచ్చుతఱి ననుస్మరించుమని యొకమంత్రంబుపదేశించి యతని దేవయాని సయితమనిచె.

అంత యయాతి కడువృద్ధుడై తనపురికేతెంచి తనతనయులలో యదువు, తుర్వసుడు, ద్రుహ్యుడు, అనువు, అనువారల గ్రమంబుగబిలిచి తనకు శుక్రశాపంబున ముదిమిగలుగుటయు, స్రక్చందన వనితాదులయందుగలయాసక్తి దీరకుండుటయుజెప్పి యొకసహస్రవర్షంబులు తనముదిమిగొని వారియౌవనమును దనికిమ్మని వారిని వేఱువేఱనడిగిన వారలుముదిమి పడతులకు గడురోతంగలుగజేసు, బలాహారనిద్రల దగ్గించి, తనువికారము గలుగజేయు, మఱియుముదిమిచే బలువిధాసహ్యములు సంభవించుంగాన నీముదిమి మేమొల్లమనిన యయాతికోపించి యదువుంజూచి నీవంశజులకు రాజ్యసంపద లేకుండెడుననియు - తుర్వసుంగాంచి నీసంతతివారలు వేఱువేఱైతురకలుచండాలురు మొదలగు నీచజాతికిం బ్రభువులయ్యెదరనియు- ద్రుహ్యునీక్షించి నీయన్వయులు పల్లెవారికి (ఓడలునడుపువారు) దొరలయ్యెదరనియు - అనువుంగని నీపరంపరవారు మ్లేచ్ఛాధిపతులయ్యెదరనియు శపించి శర్మిష్ఠకనిష్ఠపుత్రుండగు బూరుపుని వారియన్నలనడిగినపగిది నడిగిన నాతడుసంతసించి దానికొప్పిన నుప్పొంగి యయాతిశుక్రుందలంచి తదుపదిష్టమంత్రంబు నుచ్చరించి తనముదిమిని బూరువునకిచ్చి యాతనివయసుంగొని సహస్రవత్సరంబులు సకలసుఖంబులనుభవించి యనేకయాగంబులొనర్చి కడుధర్మమార్గ ప్రవర్తకుడైయుండి తుదకు బూరువునివలన దనముదిమింగొని యాతని యౌవనమతనికిచ్చియతనికిబట్టముగట్టసమకట్టిన నప్పట్టణవాసులెల్లనతని పాలికేతెంచి రాజా! నీవీజగత్తున మిగులధర్మజ్ఞుడవని పేరొందినయిపుడు నీజ్యేష్ఠపుత్రుడగు యదువును, వారివెనుకటి ముప్పురుసుతులును,ఉండ నీకనిష్ఠునకేట్లు బట్టముగట్టెదవనియడిగిన నాపుడమితేడు వారలంజూచి యోప్రకృతిజనులారా! వినుడు. జననీజనకుల వాక్యానుసరణి నటించెడికొడుకే కొడుకుకాని జడమతిచే జనకునుల్లంఘించిన కొడుకు కొడుకుగాడు. కావున

మీచెప్పిన నలువురును మదాజ్ఞనుల్లంఘించుటంజేసి వారురాజ్యార్హులుగారు.మఱి యుశుక్రుండు మద్వాక్యాను సరణి నెవ్వండు నాముదిమింగొనెడినో వాడే నారాజ్యాధిపుడగునటుల వరంబిచ్చి యుండుననియె. దానివిని పౌరజనులు సమ్మతించిపూరునకు బట్టముంగట్టి వేడుకంజూచి తమతమయిండ్లకరిగిరి. అంతయయాతి బ్రాహ్మణసహితంబుగ వనంబునకేగి యందు గొంతకాలము నిరాహారత,కొంతకాలము పానీయాహారత, కొంతకాలము వాయుభక్షణంబున, కొంతకాలము జలమధ్యంబున నిలిచి, కొంతకాలమేకపాదంబుననిలిచి,కొంతకాలము పంచాగ్ని మధ్యముననుండిమఱియు ననేక విధంబులం బెద్దకాలము నుగ్రతపము సేసి యంత్యంబున స్వర్గమునకేగి బ్రహ్మలోకాదుల నివసింపుచు నొకనాడు నాకమునకరిగిన నింద్రుం డాతని సత్కరించి నీవు వనంబునకేగుతఱి బూరువునకు బట్టముగట్టుచో నేమిచెప్పితివనియడిగిన యయాతితాను బూరువునకు గంగాయమునల మధ్యరాష్ట్రంబేలునటులను, అతని యన్నలుదాని చుట్టునున్న రాజ్యంబులం బాలించునటులను, మఱియు రాజ్యము నెయ్యే ధర్మమార్గంబునం బాలింపవలయునో యత్తెఱంగును జెప్పితినని చెప్పిన నింద్రుండట్టులైన నీవు దేవాదులలో గడుధన్యాత్ముడవనియె. అందునకు యయాతి మైమఱది యహంకారముబూని బ్రహ్మాదిసురమునిమానవాదులలో మత్సములెవ్వరును లేరనియె. అయ్యహంకారంబున నాతనిపుణ్యంబంతయు క్షీణించిన నింద్రుండాతనింగాంచి నీవు మహాత్ముడవైనను దేవతాదుల నల్పంబుగదలంచితివి కావున నీపుణ్యముక్షీణించె.నిక భూమి కేగుమనిన యయాతిస్వర్గమునుండి భూమికిపడుచు నోదేవనాయకా! నాపైదయనుంచి నేభూమింబడ్డను సత్పురుషుల మధ్యంబునంబడునటులననుగ్రహింపుమని వేడిన నాతడవ్వరం బొసంగుటంజేసి యయాతి,వసుమతుడు,అష్టకుడు, ప్రతర్దనుడు, శిబి యనురాజర్షులు నివసించుతలంబునకు నీటుగాబడుచుండ నాతని నష్టకుడు దృష్టించి ప్రచండమార్తాండసన్నిభ తేజా!నీవెవ్వండవైనదియునునీవిప్విధంబున స్వర్గమునుండి భూమికిబడుటకు గారణంబును నెఱుంగను. సత్పురుషులమధ్యనున్న నిన్నుజెనక నింద్రాదులైన వెఱచెదరు కావున నీవు వెఱువక భూమింబడక మద్వచన ప్రభావంబున నంతరిక్షంబుననుండి నీచరిత్రమును జెప్పుమనియె.

అష్టకయయాతి సంవాదము.

అతనివాక్యప్రభావంబున యయాతిభూమింబడక యంతరిక్షంబున నిలిచియిట్లనియె. నే మీయందఱకన్న వృద్ధుండనగుటచే మీకునమస్కృతి నొనర్పనైతి. నేను నహుషుని సుతుండనగు యయాతిని. పూరువునకు జనకుని. ఇట్టినేనుస్వర్గమునకేగి యందుకొంతకాలముండి నాపుణ్యముక్షీణించుటచే భూమికిబడనయ్యెననిన నష్టకుడతనింగాంచి నీవుమన్మాతామహుడవు, గుణవృద్ధుడవు, వయోవృద్ధుడవు, మహాపుణ్యపురుషుండవు. ఇట్టి నీవేయేలోకంబు లనుభవించితివి, నీపుణ్యంబెట్టుల క్షీణించెం

జెప్పుమనిన యయాతియిట్లనియె. నేసహస్రవత్సరంబులు దివ్యతపంబొనర్చి స్వర్గంబునకరిగి యందు వేయువర్షములుండి వేయువత్సరములు బ్రహ్మలోకమనుభవించి యంతియకాలమెన్ని పుణ్యలోకంబులు గలవో వానినెల్ల ననుభవించి తుదకు దశసహస్రసహాయనంబు లింద్రునినందనవనంబున నచ్చరముచ్చకంటులంగూడి సుఖించితి. నాపుణ్యంబంతయు క్షీణించుటంజేసియ కాబోలు నొకదేవదూతవచ్చి కంఠగ్రాహ్యముచేసి నన్నదలించినది నాకుజ్ఞాపకమున్నయది. తత్క్షణంబున స్వర్గంబునుండి క్రిందికింబడితి. అపుడు దేవవిభుంజూచి నను సజ్జనులమధ్యంబున వైవుమని వేడినటుల నాకుజ్ఞాపకమున్నది. ఆరీతియ మీసాహామసుగంధ మాయింద్రలోకంబుం జేరుచుండుటం జేసి వారు నన్నింందుబడంజేసిరి. మఱియు నరుడొనరించిన పుణ్యమెంత యుండెడినో యంతకాలమువాడు పుణ్యలోకము లనుభవించి పుణ్యముక్షీణించినతోడనే భూమియను నరకమునంబడి రాక్షసపక్షి మృగాదులచే బీడింపబడి భక్షింపబడు. కావున నేను సుఖదుఃఖముల సమతంజూచెద. మత్కర్మానుసరణి విధివిధించిన విధంబున రాగక్లేశంబునొందక దప్పదని తత్ప్రసంగంబుగా బహువిధంబుల బోధించిన విని యష్టకుడు పుణ్యక్షీణానంతరము నరుడుధరానరకంబున జనించుతెఱంగును, గర్భోత్పత్తిక్రమంబును అశ్రమముని మానాదివివరణమును వివరింపుమని ప్రార్థించిన యయాతియిట్లనియె.

స్త్రీకిఋతుకాలంబున రక్తముతోటి రేతముగలిసి పిండమైయది క్రమక్రమంబునవృద్ధినొంది సర్వాంగములంగలిగి ప్రాణమువచ్చినతోడనే జ్ఞానమునొంది దశమమాసంబునంజనించు. మఱల మరణమునొంది పుణ్యపాపానుసరణి మఱలంజనించుచుండు. పాపకారణంబునం గ్రిమికీటాదియోనులంబుట్టు. ఇక బుణ్యకర్మలనగా, తపస్సు, దానము, శమము, దమము, లజ్జ, మృదుత్వము, సర్వభూత దయాళుత్వము అను నేడును స్వర్గమునకేగ మార్గములై యుండు. దురభిమానంబును, అజ్ఞానము, నిజపాండిత్య గర్వంబునంబండితుల నవమానించుట, ఇవిమూడును నరునకు వినాశము గలుగజేయుంగావున మానవుడుతానెంతటి ధనికుడైనను, ఎంతటివిద్వాంసుడైనను, సాధువుల నవమానింపక నిజాశ్రమధర్మముందప్పక చరింపవలయు. అయ్యాశ్రమధర్మంబులెవ్వియన్న.

ఆశ్రమధర్మములు.

లోకంబున బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము, అననాలుగాశ్రమములు వెలయు. అందుబిలువంబడినతోడనే గురునొద్దనధ్యయనము సేయుట, గురుకార్యంబులం జెప్పించికొనకయేయొనర్చుట, గురునికన్నముందునిద్రనుండిమేల్కొంచుట, గురుడు నిద్రించినపిదప నిద్రించుట, మృదుత్వమును శాంతిని

ధైర్యమునుగలిగియుండుట, బహుజాగరూకతస్వాధ్యాయ పఠనంబొనర్చుట, అనునవిబ్రహ్మచర్యధర్మములు. ధనమునార్జించి యజ్ఞదానాదులొనర్చుట, అతిథిపూజంజేయుట, ఆశింపందగని వస్తువనాశింపకుండుట, అనునవి గృహస్థధర్మములు. నిజశక్తిచేజీవించుట, పాపకర్మదూరుడై యుండుట, దానమిచ్చుట, పరహింసనొనర్పకుండుట, అడవినిదగిన యాహారవేషములంగలిగి తపముసేయుట, అనునవివానప్రస్థధర్మములు. నిజకృషిఫలంబున జీవింపకుండుట, తత్త్వవేత్తయు, జితేంద్రియుడును, నిస్సంగుండును, లఘ్వాహారభక్షకుండును, అయి యొకచోసదానివసింపక సంచరింపుచుండుట, మొదలగునవి యతిధర్మములు. మఱియుజనులకు సర్వస్పందనాదిభోగంబుల కర్హుంబగునరాత్రికాలంబున యతి యరణ్యవాసియైయుండవలయు.

మునిమానాది వివరణము.

ఇకగ్రామము పృష్ఠభాగంబునంగలిగి యరణ్యంబుననుండు వాడును, అరణ్యంబును బృష్ఠభాగంబునంగలిగి గ్రామమందుండువాడును, మునినామంబునం బఱంగుదురు. ఎట్లన్న, గ్రామసంబంధ పదార్థముల నపేక్షింపక యడవినుండువానికి గ్రామము వెనుకైయుండు - ఊరనున్నను, అగ్నియు, గృహమును, గోత్రమును లేక కౌపీనమును నారచీరలంగట్టికొని పొట్టనిండగూడుగుడువక ప్రాణమునిలుచుటకు వలయునంతం దినుచునుండువానికి వనము వెనుకనగు. ఎవ్వాడు కామముంద్రుంచి యింద్రియంబులజయించి కర్మలనిర్మూలముచేసి మౌనముచేనుండునో యట్టివానికి సిద్ధి కరస్థమైయుండు. మఱియు సదాదంతశుద్ధింగలిగి నఖకృంతనమొనరించికొని స్నాతుడై యలంకృతుడై బ్రహ్మవిషయక జ్ఞానాయత్తచిత్తుండైయుండు నుత్తమునెవ్వారైనంబూజింపుదురు. నిరంతరము శరీరమును దపంబుచేకృశింపజేయుచు బశువుమాడ్కినాహారాదులం గొనుచు దనుబరమాత్మయందు లీనమొనరించుచుండు మౌనిసత్తముడు, సర్వలోకములం జయించినవాడని గ్రహింపవలయు.

ఇకపైనంజెప్పబడిన గ్రామారణ్యవాసు లిరువురలో గ్రామమందుండియు విషయాదుల నిగ్రహించుమునియే తొలుతయుక్తింగను. కానమానవుడు తనకాలము వ్యర్థముసేయక బాల్యంబుననే మనస్సును నిగ్రహించి దుర్మార్గాదులవర్జించి సన్మార్గంబునం బ్రవర్తించెనేని శ్రేయమునొందు.

అనిచెప్పినవిని యష్టకుడు యయాతింజూచి నీవిపుడిటకెవ్వని పంపునవచ్చితివి? ఎచ్చటికేగెదవు? చెప్పుమన నప్పార్థివుండిట్లనియె. నాపుణ్యకర్మంబుకొలదిపెద్దకాలము పుణ్యలోకములననుభవించి పుణ్యమంతయుక్షీణించుటచే దేవపతియాజ్ఞను ఘోరనరకంబునంబడియెద - నాయట్టులనే బ్రహ్మలోకాది పుణ్యలోకవాసులెల్లం

దమపుణ్యము క్షీణించినతోడనే భూమింబడియెదరు. అనినవిని యష్టకుడు తనమనంబున వగచి యయాతింజూచి మాతామహా! నీతోటిసమానులగు బుణ్యవంతులును, యశోధనులును ధరంగిననరుదు. అగుటచేనిను స్వర్గమునుండి ధరానరకంబునం బడనివ్వను నాపుణ్యంబుకొలది బహుకాల మనుభవింపందగిన యనేకపుణ్యలోకములుండు. కానవానిలో దేనినేని వానినెల్లనేని నీకిచ్చెదను, వానిగొని నీవంతరిక్షంబుననేని స్వర్గంబుననేనినుండుము, అనిబహుభంగుల బ్రార్థించెను. అతనియట్లులనే తక్కినరాజర్షులగు బ్రతర్దనుడును, వసుమంతుడును, శిబియునరేకరీతులం దమతమ పుణ్యానుసరణింగల శాశ్వత పుణ్యలోకంబు లనుభవింపుమనిరి. అందువసుమంతుడును శిబియుదుదకు నాతనికి (యయాతికి) గలకించిత్పుణ్యమునకైనం దమతమపుణ్య లోకముల విక్రయమునకైనం గొనుమని చెప్పిరి. వారలెన్నివిధంబులం జెప్పినను యయాతి యొప్పక మీతోసమానుండనగు నే మీవలనంబుణ్యలోకములు దానము గొనంజాలను, విక్రయమునకు మొదలేయొప్పను. నాకర్మానుసరణి నాపుణ్యమునశించుటంజేసి భూనరకమనుభవించెదంగాని తొల్లిమీయట్టులనే యనేకులకునే బుణ్య లోకదానములిచ్చి యిప్పుడు ప్రతిగ్రహీతనుగానేరని పలుచందంబులంజెప్పె. అప్పుడు వారునలువురును దిగ్గునలేచి రాజా! నీవుమేమిచ్చులోకము లొల్లనంటివేనిమా పుణ్యలోకములన్నియు గొఱలేక యిదెనీకుదత్తముసేసి మేమునరకమునకు బోయెదమని పలికి యట్లులంజేయ సమకట్టుతఱి స్వర్గమునుండి నైదుదివ్యవిమానంబుల చటికివచ్చినవానిని వారుయయాతికిజూపి యీవిమానంబులు మనలనేవురను స్వర్గమునకుగొనిచన నేతెంచెంగావున నీవు మాప్రార్థనంబంగీకరించి యందొకవిమానం బెక్కి రమ్ము. కాదేనిమేము మొదటనుడివినట్టుల మాపుణ్యము నీకర్పించి నరకమునకేగెదమనిరి. అంమనకుయయాతి సేయునదిలేక వారింగూడి స్వర్గమునకేగి శాశ్వతమగు పుణ్యలోకంబులననుభవించె. అట్టియగణ్య పుణ్యచరిత్రుని యన్వాజులేనీతాతలగు గౌరవులు, కాననిప్పుణ్య కథాశ్రవణపఠనాదులచే సకలాభీష్టంబులు సమకూడునని శౌనకుడుశతానీకునకుం జెప్పెనని సూతుడు మునులకుంజెప్పె.

యదువు మొదలగువారలవంశవివరణము. సం-అ-౪౩-మొదలు-౫౦-వరకు.

అంతమునులు యయాతిప్రభావంబున కద్భుతాంతఃకరణులై యాతనిసుతులగు యదువు మొదలగు వారి వంశపరంపరను వివరింపుమని యడిగిన సూతుండిట్లనియె.

యయాతి జ్యేష్ఠపుత్రుండగు యదువుకు సహస్రజిత్త్రాదిపుత్ర పంచకంబుగలిగె. ఇయ్యదువంశంబునం బదిరెండవ పురుషుండగు కృతవీర్యునకు గార్తవీర్యార్జునుడను తనయుడుజనించి పదివేలేండ్లుతపమొనరించి అత్రికి వనజనాభునంశను, ఉద్భ

విల్లిన దత్తాత్రేయయోగిశిరోమణి నాశ్రయించి తద్వరప్రభావంబున సహస్రకరంబులంగలిగి యతి పరాక్రమవంతుడును ధర్మపరిపాలకుండునై యనేక యజ్ఞంబులం జేసి నారదునిచే నిరుపమాన యజ్ఞదానాదికృతధురీణుండని పొగడంబడి మఱియు నెన్నజాలని యెన్నియో పరాక్రమకృత్యంబులొనర్చి మాహిష్మతియనుపురము నిజనివాసతలంబుగజేసికొని యెనుబదేనువేలేండ్లు సప్తద్వీపముల నేకఛత్రాధిపుడై పాలించె. అయ్యపూర్వబలుండొకతఱి నిజసహస్రకరంబులచే సముద్రమునంతయుందొల్లి మందరగిరిచేదఱచిన చందంబున గల్లోలంబుగావించె. ఒకతఱి నిజప్రియ సఖిజనసహితక్రీడార్థమై నర్మదానది నడ్డుకట్టి దాని యురువడినఱసేసె. మఱియొకతఱి దశగ్రీవుండగు రావణు నొకకోలసోలంజేసి తనపురంబున గారాగృహంబున నునిచిన పులస్త్యప్రజాపతివచ్చి తన్నువేడిన నప్పుడారావణు విడిచె. ఇట్టియుత్కృష్టపరాక్రము డొకసమయమున భార్గవుని బంగరుతాటివనముం గాల్చిన నతండు కోపించి యతనివేయుచేతులా చెట్లయట్లొక బ్రాహ్మణునిచే ఖండింపబడునని శపించెంగావున నెకకారణమున మృత్యుశాపనిమిత్తంబున భార్గవునకు సుతుడుగాబుట్టిన పరశురాముడు కార్తవీర్యార్జునుని వేయుహస్తముల ఖండించి వానిసమయించె. ఆకార్తవీర్యునిసంతతి యనంతంబైవర్ధిల్లె. దత్తాత్రేయదత్తవరప్రభావ చోరమారణుండగు నిక్కార్తవీర్యార్జున స్మరణచే నష్టద్రవ్యము మఱలం జిక్కు.

## కార్తవీర్యార్జునచరిత్రము.

అనినవినిమునులు సూతుంజూచి ప్రజలపాలించువాడయ్యునా గార్తవీర్యుడు కనకతాళవనమేలగాల్చె? చెప్పుమన సూతుండిట్లనియె. అక్కార్తవీర్యార్జునుడు ధరంబరిపాలింపుచుండ నొకతఱి సూర్యుడు బ్రాహ్మణవేషంబున నతనికడకేతెంచి యోవదాన్యోత్తమా! నాకు దృప్తిగలుంగజేయుమని వేడిన నతండాతని గాంచి నీకెద్దివలయునద్దాని నొసంగెద గోరుమన నినుడు తనకు స్థావరంబులాహారంబు గనివ్వుమనియె. అందున కవ్వసుధాధిపుడు నవ్వి స్థావరంబులనే నెట్లునివ్వనోపుదు? నీవువానిచే దృప్తియెట్లుగలుగు? తెలియంబలుకుమన నారవిసంతసించి నీకు నేనక్షయతూణీరంబులిచ్చెద వానిచే స్థావరంబులెల్లదగ్ధంబగు. మత్తేజంబుననవి దగ్ధంబయ్యెనేని నాకుదృప్తిగలుగునని చెప్పి యప్పుడయక్షయతూణీరంబు లొసంగె. తత్క్షణంబయయ్యాక్షితిపతి పట్టణగ్రామవనాది స్థావరంబులనెల్లంగాల్చె. ఆసమయమున భార్గవుని తాళవనముసగా ననలుపాలయ్యెంగావున భార్గవుడు పైనంజెప్పబడినట్టుల నాతని వేయుచేతులు నఱకబడునటులండిట్టె.

ఇట్లు యదువు రెండవకొడుకగు క్రోష్టుని సంతతని నలువది రెండవపురుషుండగు సాత్వతునకి భాగినుడు, భజమానుడు, వృష్ణి, యదువు, మొదలగు తనయులు జనించిరి. అందు భజమానునిసంతతిని నైదవపురుషునకు దేవకుడు, ఉగ్రసేనుడు, అననిరువురు సుతులు జనించిరి. అందు దేవకుని సుతలగు దేవకిమొదలగు నేడుగురుకన్యల శూరునిసుతుడగు వసుదేవుడువరించె. ఉగ్రసేనునకు గంసాదులుపుట్టిరి. పైభజమానుని యన్వయుడే కృతవర్మ. పైసాత్వతుని యేడవసుతుడగు వృష్టికి నైదుగురుకొడుకులు గలిగిరి. అందుగడపటివాడగు శినియనువానికి సత్యవంతుడు, నతనికి సాత్యకియుబుట్టిరి.

శమంతకోపాఖ్యానము.

వృష్టిమూడవకొడుకుకు బ్రసేనుడు, సత్రాజిత్తుఅన నిద్దరుపుత్రులు గలిగిరి. అందుబ్రసేను డొకదివ్యమణినిబడసి తనయురస్థలిధరించి రవిప్రకాశుడైయుండె. కృష్ణుడు దానింగొనజాలియుండియు బలవంతంబునం దీసికొనకయుండె. ఆప్రసేనుడొకతటి మృగయావినోదముగలవాడై యడవికరిగి యందొక పర్వతబిలంబున జయధ్వనివిని దానిజొచ్చి యచ్చటిభల్లూకనాథుండగు జాంబవంతునితోబోరిన నతండు వానిజంపి యామణిని గ్రహించె. ఇట్లు బ్రసేనుడుమృతినొంది పురమునకు రాకుండుటవిన్న హరి వానింబరిమార్చి యవ్వరమణి నపహరించినాడని యజ్ఞానులు నిందించిన గోపాలుడు లోకాపవాదముబోగొట్టికొన బ్రసేనునరయుచు నేగి జాంబవంతునిగుహంజొచ్చి యిరువదియెనిమిదిదినములు వానితోబోరిన నాపరమభాగవతోత్తము డతండు హరియని యెఱింగి తనుజక్రముచే ద్రుంపకనియు దాబ్రసేనుజంపికొన్న మణిని, జాంబవతియను నిజకన్యకామణిని గ్రహింపుమనియు బ్రార్థించిన నాపురుషోత్తముడు గరుణించి యమ్మణి కన్యామణుల గ్రహించి ఋక్షనాథు నపేక్షితంబుమాడ్కి జక్రముచే నతని తలద్రుంచి నిజపురమునకరిగి యమ్మణిని సత్రాజిత్తునకిచ్చె. అపుడు మణింగూర్చిహరిందూరిన పౌరజనులెల్ల నుల్లంబుల సంతాపమునొందిరి. సత్రాజిత్తుశౌరిని దూరిన యపరాధమునకై యమ్మణిని సత్యభామాది కన్యలను దెచ్చి కృష్ణునికిచ్చె.

పైశూరునకు వసుదేవాదిపుత్ర దశకంబును, శ్రుతకీర్తి పృథశ్రుతశ్రవతాది పుత్రికాపంచకంబును గలిగె. అందువసుదేవుని ప్రథమభార్యయగు రోహిణికి రాముడును దేవకికి కృష్ణ సుభద్రలునుగలిగిరి. కృష్ణునకు బూర్వము దేవకి గన్న యేడుగుర కొడుకులం గంసుడువధించె. వసుదేవుని సంతానమనంతము. అందువీరలు ముఖ్యులు. అవ్వసుదేవునితోబుట్టువులగు శ్రుతకీర్తికి గేకయులును, శ్రుతశ్రవతకు జైద్యుడును గలిగిరి. పృథనుదాని తండ్రి స్నేహముపెంపునంగుంతిభోజునకు పాలనకిచ్చియుండ నాపృథకుంతియనంబఱగి పాండురాజ మహిషియై ధర్మానిలేంద్రుల

తేజంబుల క్రమంబుగ ధర్మజభీమార్జునులంగనియె. పాండుని రెండవసతియగు మాద్రికి నశ్వినీదేవతల తేజంబున నకులసహదేవులు పుట్టిరి. ఆకౌరవవంశము ముందు వర్ణించెదంగావున నదియట్లుండనిండు. పైవృష్ణిసుతాన్వయంబుననే యద్భూరుడుపుట్టె. ముందు చెప్పబడిన దేవకీసుతుడగు కృష్ణుడు ఆది విష్ణుండు. అతనికి రుక్మిణీ, సత్యభామా, జాంబవత్యాది షోడశసహస్రాంగనలు వెలసిరి. అందు రుక్మిణికి ప్రద్యుమ్నాదులును, జాంబవతికి సాంబాదులు ఈరీతియ కృష్ణుభార్యలకెల్లం జేరి లక్షయెనుబదివేల తనయులు జనించిరి. ఈతనయులకెల్లను జేరి మూడుకోట్ల నరువదివేవురుసుతులు గలిగిరి. కావున నీయాదవకులమంతయు నూఱునొక్క భేదములంగలిగి కృష్ణుచే ప్రఖ్యాతిగాంచె. ఆకృష్ణుండు దొలుత జతుర్భుజుడై చక్రాదిహస్తుడై శ్రీవత్సవక్షుడై యవతరించిన వసుదేవుడు కంసుడాతని జంపునని వెఱచి తత్తేజంబుప సంహరింప ప్రార్థించి యాతనిరహస్యవృత్తిని గొనిచని రేపల్లెయనందు నింటనునిచిన యశోద నబ్బాలు బాలించె. ఆగోపాలుడు కంసాదుల విధ్వంసనంబొనర్చె. మఱియు నద్దేవుండుపుట్టి నెట్టి తపంబొనర్చినను సామాన్యమానవుల యుదరంబుననుదయించడు. బ్రహ్మాంశసంభూతుండగు కశ్యపుడును బృథ్వియంశనుబుట్టినయదితియు దేవహితార్థమై ధరను వసుదేవదేవకులన నరులుగాబుట్టిరి. కావున నాదినారాయణుండు భృగుశాపనిమిత్తంబున ధరను గులాచారధర్మములు చెడి నరులు పలుతెఱంగుల బోవు కాలంబులను, దేవాసురులయుద్ధంబున మృతులైన దానవులు భూమిని రక్కసులై పుట్టి యుక్కుమిగిలి యెక్కుడుబాధ సేయుసమయంబులను, నరాదిజన్మంబులెత్తుచుండుంగాన నాదానవారిని సూనునిగాగన వసుదేవదేవతలకు బుణ్యమబ్బె.

## దేవాసురయుద్ధవివరణము.

అనినమునులు సూతుంజూచి దేవాసురులనిమిత్తంబున విష్ణుండేల నవతరించె? దేవాసురులకెత్తెఱంగున దురముదొరకొనియె? వివరింపుమనిన నతండిట్లనియె. కశ్యపునిభార్యలగు నదితికి దేవతలును, దితికి దైత్యులును, సుతులుగానవారలు దాయాదిమచ్చరంబున దాయభాగనిమిత్తమై పోరాడిరి. అట్లువారు పండ్రెండుమారులు పోరిరి. ఆయుద్ధము లెవ్వియన్న. (౧) నారసింహము(౨)వామనము(౩) వారాహము (౪)అమృతమంథనము (౫) తారకామయము(౬)బకము (౭)త్రైపురము (౮) అంధకారము(౯)వృత్రఘాతకము (౧౦) ధ్వాత్రము (౧౧) హాలాహలము (౧౨)కోలాహలము—.అందు నారసింహంబున సురలం బరిపరివిధముల బరిభవించుచున్న హిరణ్యకశిపుని హరినరహరియై పరిమార్చె - వామనమున నసమాన్యుడై ముజ్జగములకొజ్జయైన బలిని నలిననేత్రుడు వామనుడై బద్ధునిగావించె. - వారాహంబున నాదిత్యు

లఁబాధించు హిరణ్యాక్షుని వారిజనాభుఁడు వారాహమై ధారుణి నొరుగంజేసె. అమృతమంథనంబున దానవులకెల్ల వల్లభుఁడైన ప్రహ్లాదుఁడు శతముఖునిచే విముఖుఁడయ్యె - తారకామయంబున విరోచనుఁడనేకమారులు దేవద్రవ్యమున్నపహరించి దేవపతిచే మృతినొందె. ఈరీతియ తక్కినయుద్ధంబుల నగా రక్కసు లణఁగద్రొక్కఁబడిరి.

భృగువువిష్ణునినరజన్మమెత్తశపించుట.

ఇట్లు దానవులు పదిదేవయుగములు ప్రభుత్వసంపదం గలిగియుండి తుదకుప్రభుత్వసంపదం గోల్పడిరి. వీరిలో హిరణ్యకశిపుఁడు, అర్బుదసంఖ్యాతీత వత్సరంబులు బలిషష్టిసహస్రవర్షంబులు నంతియకాలము ప్రహ్లాదుఁడును బాలనమొనర్చిరి. దానవులలో వీరుముప్పురే దానవేంద్రులని పఱంగినవారలు. అట్లుసురలచే బరాభవము నొంది యసురులెల్ల బ్రహ్లాదుం బురస్కరించికొని శుక్రునొద్దికేతెంచి తమకుజయముగలుగు నుపాయమువేఁడిన నతండు వారలంగాంచి మీరలు పదియుగంబు లేకతీరున బ్రభుత్వసంపదననుభవించితిరి. మీయందు గడుపరాక్రమవంతులగు విరోచనాదులు సమయింపంబడిరి. బలిబద్ధుఁడై రసాతలంబునకేగె. కావున దొల్లి బ్రహ్మనాతో జెప్పినచొప్పున మీకుగొంతకాలము దీనదశయు దేవతలకువిజయంబునుండు. కావున మనము మనజయకాలము పరీక్షింపవలయు. ఐనను మీరు వెరువవలదు. నేగౌరీపతినారాధించి మీకువిజయమూల మంత్రాదుల బడసెదనని చెప్పి తానురజతగిరికరిగి హరుం బలుగతులవినుతించి సురగురుఁడెఱుంగని కొన్నిమంత్రాదులదనకొసంగి వానిమూలంబున దానవులకు జేజంబుగలుగునట్లనుగ్రహింపుమని ప్రార్థించిన నామహేశుఁడు గరుణించి శుక్రుంజూచి నీవునీశిరంబున జ్వాలాధూమంబులువెడలు నొకకుండంబునిడికొని దానింజూడక సహస్రవత్సరంబులు వ్రతముసలిపితివేని నీతలచినకోరికలు చేకూరునని యానతిచ్చియనిపె. శుక్రుండు నిజాశ్రమంబునకేతెంచి యాతీరున నిష్ఠురవ్రతము సలుపుచుండె.

అంతదేవతలు దీనినంతయువిని దనుజగురుఁడావ్రతము సంపూర్తిసేయులోపల దనుజుల దునుమాడసమకట్టి వారివెదకివెదకికొట్టసాగిన వారలు ప్రాణభీతిని భృగువుసతి మఱగుచొచ్చిన నమ్మచ్చకంటి వారలకు నభయదానంబొసంగి నను జెందిన మిముజెనక నేరికినిదరముగా నేరదని నుడివి యారక్కసుల వెన్నంటివచ్చిన సురలం గుపితారుణలోచనంబుల నాలోకించి మీరలుధరను నరపతులుగ బుట్టెదరని శాపమివ్వగ వారలు పరువులిడిన దేవేంద్రుని నిజప్రభావంబున స్తంభించె. అపుడువిష్ణుండటకేతెంచి యింద్రుంజూచి యికదడవుసేయవలదు. నీవునాశరీరమున జొచ్చితివేని నేనీమానిని దునిమెదననిన సురపతి సరసిజపతి శరీరంబునం బ్రవేశించె. ఐనను

భృగుపత్నియేకరూపమునవున్న యింద్రోపేంద్రుల నిరువురను భస్మముసేయదలంచిన నుపేంద్రుండు స్త్రీవధగావింపనేరక కొంతతడవు సందేహించి తడసిననాపడతి తమ బూడిదెచేయునను భీతిచే నాతన్వితలను నిజచక్రంబునంద్రుంచె. దీనినాలకించి భృగుఫుకోపించి విష్ణుందిలకించి నీవుస్త్రీని వధించితివి కావున నేడుమారులు నర యోనిం బుట్టెదవనితిట్టె. ఇట్టికారణంబున హరి సప్తపర్యాయంబులు ధరనునరజ న్మమెత్తి ధర్మస్థాపనంబును దుష్టనాశంబునుగావించు. అంతభృగువు తనసతి శిరం బును మొండెమునకుజేర్చి నేసత్యవ్రతుడనైతినేని నీమానిని పునర్జీవితయగునని ను చ్చరించిన నచ్చపలాక్షి నిదురనుండి మేల్కాంచులీలం మఱలం బ్రతికె.

ఇట్టులసగోదన పట్టుగొనముట్టకున్న నాగట్టులపగతుడు తనముద్దులపట్టి యగుజయంతింజీరి తనదీనభావము దానికెఱుగంజెప్పి యదిశుక్రుకడకేగి యతనికె ట్టులిష్టంబోయట్టులం బ్రవర్తించితనకు మేలుగలుగజేయుమని ప్రార్థించిన నా ముద్దుగుమ్మ జనకవాక్యపరిపాలనచిత్తయై శుక్రుడుగ్రతపంబొనరించుతలంబునకేగి యతనికి బలుప్రీతుల శుశ్రూషసేయుచుండె. శుక్రుడట్లు వేయువత్సరంబులు సదాశి వోపదిష్టప్రకారంబున వ్రతమునలిపిన నానీలలోహితుడాతనికి బొడసూపిన నతం డుబహుప్రకారంబుల నాగౌరీపతిని వినుతించిన నప్పశుపతిప్రసన్నవదనుండై వలయు వరము వేడుమనియడిగి యతనియీప్సిత మెఱింగియుతండెవ్వరిచేతను వధ్యుండుగా కుండవరంబిచ్చి కొన్నిదివ్యమంత్రంబుల నుపదేశించి తిరోధానమునొందె. అంతశు క్రుండు జయంతింగాంచి నీవెవ్వనిసుతవు ? నీకేద్దియిష్టంబు ? నీభక్తిశుశ్రూషలకు నేమెచ్చితి నెద్దికోరిన నిచ్చెదననిన నావనిత నీవ మదాకాంక్షితంబు నెఱుంగుమన నాయసురగురుడు తనతపోదృష్టిచే దానికిబదేండ్లు, ఎవ్వరికిని గోచరంబుగాకుండం దనతో గ్రీడింపవేడుక గలిగియుండుటం దెలిసికొని దాని గొనితనమందిరంబునకరిగి పెండ్లాడి తనమంత్రశక్తిచే దానునదియు నెవ్వారికిని గోచరముగాకుండ గ్రీడిం చుచుండె. ఇట్లుండదానవులు శుక్రుమందిరంబునకుపచ్చి యందుశుక్రుగాననేరక మఱలిపోయిరి. ఇట్టిసమయాసన్నమున కేదమెచ్చి సురలకీవార్తదెలిపి సురగురుడు శుక్రుని వేషంబున నసురులకడకేగి నేనుహరువరంబున దివ్యమంత్రంబులంబడసితి. ఇకమనకుజయకాలము సమీపించుచున్నయది యనిపలుచందంబుల కపటంబునవా రిమోసపుచ్చి తనశిష్యులుగాజేసికొని తనయందలిభక్తిగలుగునట్లుజేసె. శుక్రుం డట్లుజయంతింగూడి దశవర్షంబులుండ జయంతికి దేవయానియను తనయజనించె. పిదపశుక్రుడు జయంతితో నాశిష్యులజూచి వచ్చెదనని జెప్పితన శిష్యులగునసురులం జూడవచ్చి తనరూపంబుననున్న బృహస్పతింజూచి దానవులంగాంచి యోయసురు లారా! ఈతడంగిరసునినందనుండును బృందారక గురుండునగు బృహస్పతి.

భృగుసుతుడను మీనిజగురుండనైన శుక్రుండను నేను. ఐననీగురుడు దేవకార్యార్థమై మిము మోసము సేయంగపట శుక్రుడై వచ్చినాడనియె. అంతనటు దానవులందఱు నిరువురు శుక్రులంజూచి యందునిజమగు శుక్రుండెట్టివాడని తెలియనేరక విభ్రాంతిం జెందియుండ బృహస్పతివారింజూచి మీ కేలనీభ్రమగలిగె. భృగునందనుడగు శుక్రుండను నేను. ఇతడు దేవగురుడు మిమువంచింపవచ్చినాడనిన దనుజులు పదివత్సరములుగ బృహస్పతినే తమగురుడనినమ్మియుండుటంజేసి యాతనిమాటలనమ్మి శుక్రుంజూచి యితడు దేవగురుడుగాని నిజముగుశుక్రుడుగాని పదివత్సరంబులనుండి యుండుటంబట్టి యితడేశుక్రుడనిమాకు నిశ్చయముగ దెలియవచ్చుచున్నయది. నీవుకపట శుక్రుడుగానున్నావు. కాననీవువచ్చిన దారింబట్టిపొమ్మనిరి. అంతనకుశుక్రుండుకోపించి మిమువంచించువాని నెఱుంగక నన్నవమానించితిరి. కావునమీబుద్ధులుసెడి మీకపజయముగలుగునని బిట్టుగదిట్టి తనగృహంబునకరిగె. ఇట్లులందఱనవచ్చిన కార్యముదీర్చికొని బృహస్పతి యున్నవాడున్నట్టులనే మాయమయ్యె.

అంతరక్కసులు తాము మోసపోయినందునకు బలుచందంబులవిలపించుచు బ్రహ్లాదుండోడ్కొని శుక్రునొద్దికేగి తద్దయుదీనత దమ యపచారంబుల విన్నవించి మన్నించి తమను మనుప బ్రార్థించిన నతండు కరుణించి యిట్లనియె. విధివిధానవిధంబున సుఖదుఃఖంబు లనుభవింపకతప్పదు. మీరలు పదియుగంబులు సాంబ్రాజ్యంబనుభవించితిరి. శివుడు నాకువరమునిచ్చునపుడుసగా మీకు జయకాలమురాను కొంతతడవుగలదనియె. విష్ణుండు బలిని రసాతలంబునకు బనుచునపుడు నాతడు సావర్ణిమన్వంతరంబున నింద్రుండగునని యానతిచ్చెంగాన నక్కాలపర్యంతము మీరలు రసాతలంబుననుండుడని చెప్పి తనశిష్యులగు శండామర్కులవారికి జూపి వీరలుబృహస్పతితోసమానులుగావున దేవతలు మిము బాధింపకుండ జేసెదరని యానతిచ్చె. ఐనను దానవులు బాతాళంబునకుబోక దేవతలపై సంగ్రామంబునకేగి వారింబరిభవించినవారు శండామర్కుల దమలోగలిపికొని యొకయజ్ఞముసేసి తత్ఫలంబున నసురులందోలిన వారలు రసాతలంబునకేగిరి. ఇదియ దేవాసురయుద్ధవివరణము. దీనిని యాదవవంశదీపకుడగు గోవిందుప్రభావవర్ణనగ వివరింపవలసె.

ఇంతకుపూర్వము చాక్షుషమన్వంతరమున విష్ణుండు ధర్ముడన నవతరించె. వైవస్వతమన్వంతరంబున సురలు బ్రహ్మనుబురోహితునిగాగొని యసురవిజయము కొఱకొక యజ్ఞ మొనరించిరి. ఈరీతిగనే నరసింహ వామనావతారంబుల యందుగూడ సురలు రుద్రుని ధర్ముని, బురోహితులుగాగొని జన్నంబులొనరించిరి. ఇవి మూడు దివ్యావతారములు. ఇక భృగుశాపనిమిత్తంబున దుష్టుల శిక్షింపనా పక్షివాహనుడెత్తంగల యేడు నరావతారము లెవ్వియన్న. ౧ ప్రథమత్రేతాయు

గంబున దత్తాత్రేయుడు, ఇతని కులగురువు మార్కండేయుడు; పదునేనవత్రేతాయుగంబున మాంధాతచక్రవర్తి, కులగురువు రైభ్యుడు; పదితొమ్మిదవ త్రేతాయుగంబున బరశురాముడు, కులగురువు విశ్వామిత్రుడు - ఇరువదినాలవ త్రేతాయుగంబున దశరథరాముడు, కులగురువువసిష్ఠుడు; ఇరువదెనిమిదవ ద్వాపరంబున వేదవ్యాసుడు; కులగురువు జాతూకర్ణి; అయ్యుగంబుననే కృష్ణుడు: కులగురువు ద్వైపాయనుడు; కలియుగాంత్యమునం గల్కి, కులగురువు; యాజ్ఞవల్క్యులు ఇక్కలియుగంబున నరులు కులుచశరీరులై స్వల్పాయువుంగలిగి బలహీనులై యొకరితో నొకరుపోరుచు వర్ణాశ్రమధర్మంబులందప్పి సంకరులై పట్టణ గ్రామాదులు లేక పర్వతవనాదుల నివసింపుచు పత్రంబులను మృగచర్మంబులను వస్త్రంబులుగధరించి యాకు అలములచేబొట్టలనించి కొనుచు జెడుగు తెరువుంజరించెదరు. అపుడువిష్ణుండు కల్కిగా నవతరించి దుష్టులనెల్లందండించి భూమినిధర్మమును స్థాపించు.

తుర్వసుడు మొదలగు వారిసంతతివివరణము.

ఇకయయాతి రెండవసుతుడగు దుర్వసుని సంతతిక్రమ మెట్లన్న. తుర్వసునిసంతతియేడుతరముల వరకువర్ధిల్లి తండ్రిశాపనిమిత్తంబున నక్కడినుండిభిన్నంబయ్యె. ఇతనివంశంబున నేడవస్త్రీనిజారుని వంశజుడు పెండ్లాడి దుష్యంతునిగాంచె- యయాతిమూడవకొడుకును శర్మిష్ఠప్రథమపుత్రుండునగు ద్రుహ్యునిసంతతి తొమ్మండ్రుపురుషుల పర్యంతమువృద్ధినొందె. వారెల్ల మ్లేచ్ఛప్రభువులైరి - నాలవసుతుడగు ననువుసంతతిని నాలవపురుషునకు, ఉశీనరుడు, తితీక్షుడు, అననిద్దరుపుత్రులుగలిగిరి. అందుఉశీనరునకు శిబిమొదలగువారలుదయించిరి. వారిసంతానంబనంతంబయ్యె. తితీక్షునిపరంపరను మూడవపురుషునకు దానవేంద్రుండగు బలిచక్రవర్తి తనవంశంబంతయు నశించుటచే మనుష్యయోనిని బలియనజన్మించి తొల్లిబల్లిదుడై విలసిల్లిన చందంబున నిపుడుసగా ప్రభుత్వమువహించి తనపూర్వపు భార్యయగు సుధేష్ణంగూడి కడుప్రసిద్ధింజెంది, అంగ,వంగ,సుంహాక, పుండ్ర, కళింగులన నేవుర బ్రాహ్మణపుత్రులంబడసె. బలి యిలాధిపుడైయుండ నతనికిబ్రాహ్మణసుతులుగలుగుట కడు చిత్రముగాన నచ్చరిత్రము జెప్పెదవినుడనిసూతుండిట్లనియె.

దీర్ఘతమునిజన్మాదికథ.

అంగిరసునకు ఉచథ్యుడు, బృహస్పతి, అననిరువురుతనయులుగలరు. అందు ఉచథ్యునకు మమతయనుభార్య వెలయు. ఆసుందరాంగింజూచి బృహస్పతిమోహించి దానిబొందం గమకించిననాచంచలేక్షణయాతనిం గాంచి మీయన్నవీర్యంబున నేనిపుడు సంపూర్ణగర్భముతోడనుండెదను. మద్గర్భస్థుండగు నర్భకుడు దివ్యప్రభావుం

డగుటచే నెల్లపుడు వేదములనుచ్చరించుచుండు. నీవీర్యంబమోఘంబైనయదియి ఇపుడు నేదాని ధరింపగా నేరదు. కావునయీశిశు వుదయించినపిదప నీయిష్టానుసర ణి నటింపుమనియె. ఐనను దేవగురుడు, తనకామముంబట్టజాలక బలాత్కారంబున నామమతనురమించె. దాని నెఱింగి తద్గర్భస్థుండగు నిసు వాతనినుద్దేశించి నీవనుమం తైన ఇకాంత గర్భిణిగానుండుట చింతింపక బలోద్గమనము సేయుట తగదనిన గు రుడురోషించి సర్వభూతములకును జేతోమోదకరంబగు గార్యము నేనొనర్చియుం డనీవునన్నునిందించుటంజేసి దీర్ఘతముడవు(పుట్టుఅంధుడవు)అయ్యెదవనిశపించె. దా నంజేసి యీశిశువుపుట్టి యంధుడై దీర్ఘతముడని పేరొంది తనయగ్రజు నాశ్ర మంబుననే పెఱుగుచుండె. మమతగర్భంబునట్లు వేఱుశిశువుండుటచే గురుడుమమ తనుబొందుటంజేసి వెడలిన యాతని రేతస్సు భూమిపైపడి తత్క్షణంబ యొకశిశువై భరద్వాజుడనిపరంగె. ఆశిశువును గురుడును మమతయు నిరాకరించి పుట్టినచోట నే డించిపోయిన సప్తఋషులు వానింగొనిచని పాలించిరి.

ఇట్లుండ నొకనాడాయాశ్రమమునందుండెడి సురభిపుత్రుండగునొక వృషభము యజ్ఞోపయుక్తదర్భలందినుచుండ దీర్ఘతముడెఱింగి దానికొమ్ములు గట్టిగబట్టి నీపిట్టిదు ష్కృత్యము సేయందగునా? నిను విడువననియె. అందునకాయెద్దు దీర్ఘతముని జూచి యిట్ల నియె. ఋషిశ్రేష్ఠా! నీవు కడు బలిష్ఠుడవగుటచే నీకు నేనెట్లు నీడొదు. ఇదియునుంగాక తినరానిపదార్థంబులందినరాదనియు, చేయరానికార్యంబుల జేయరాదనియు, పొంద రానిదానిబొందరాదనియు, గలనిబంధనలు జ్ఞానవంతులగు నరులకేకాని జ్ఞానశూ న్యులును జతుష్పాదజంతువులునగు మాకు కాదనియె. ఇట్లావృషభంబాడిన గోధర్మము లదనమనంబున నిడికొని యావృషభమును విడిచి యయూరకుండి కొంతకాలమునకు బిదప దనకుగోడలు కాగల స్త్రీనిబొందుచుండ యాయన యీమదోద్రిక్తుడైవాడు వె ర్రితనమునం జెడ్డపనులం జేయుచుండుగాన వీనినిందుంచరాదనియెంచి కొన్నికొయ్య లుగట్టి వానిపై వీనినునిచి గంగానదిని విడిచె. ఇట్టులనా దీర్ఘతముడు ప్రవాహము వెంటగొట్టికొనిపోవుచు నయ్యయో! నేడిచ్చెద ననుగావుడని నోరుగొట్టికొనుచు నొకగట్టుంజేరె. ఆగట్టుబలిరాజపాలిత పట్టణమగుటంబట్టి బలి దీర్ఘతముని దనమం దిరంబునకుగొనిచని బహుకాలము బహుప్రకారంబులందనిపిన నాయంధుండు సం తుష్టాంతరంగుడై బలింజూచి నీయాదరణకు నేమోదమందితి. గోరినదాని నిచ్చెద జెప్పరంజెప్పుమనన నప్పుడప్పుడమిఱేడు తనకు దనభార్యయందు బుత్రులనివ్వుమని యె. అందునకాయంధుం డానందించి వల్లెయనిన నాజనవల్లభుడు తనవల్లభయగు సుధేష్ణను దీర్ఘతమునిగూడబొమ్మని యాజ్ఞచేసిన నాసుకుమారి యంధుండును వృ ద్ధుండునగు దీర్ఘతమునిబొందుటకిచ్ఛలేక తనదాసినాతనియొద్దికనిచిన నదియతనివల్ల జంబునకక్షీ, కాండి, అననిద్దరుసుతులంగాంచె. అంత కొంతకాలమునకు బలివారిద్దరు

చిన్నవాండ్రుతనభార్యకుబుట్టినవారుగారనియు దాసియగు శూద్రస్త్రీకిబుట్టినవారనియు దీర్ఘతమునివలన నెఱింగి తనపత్నికడకేగి దానికపటకృత్యంబునకు గినిసి మఱల నొకనాడలంకరించిదాని నమ్మునిపాలికనిచె. ఇమ్మాడ్కి వచ్చినసుధేష్ణ దిక్కుముఖంబుచేసి యమ్మునియిట్లనియె. నీవుదొలుత నను దాకనసహ్యపడితివి కాన నిపుడునిను నే స్పృశించను. నీవుదధిమిశ్రితలవణమును నామేనంతయుబూసి దానిపై మధువుసగా బూసినాకితివేని నీకుపుత్రలాభంబుగలుగుననియె. దానికామాట సేయునదిలేక దీర్ఘతముడుచెప్పిన పెరుగుప్పుతేనెలనాతనివంటికంటించి యాతనిమేనెల్ల నాకెనుగాని యసహ్యమున నపానస్థలంబునాకదయ్యె. అంతనకాఋషి దానికిట్లనియె. నీవుగుదస్థానము నాకనందున నీకుగుదములేని పుత్రలాభముగలుగు. అనిన నావనితవచనంబు నదిగులొంది యమ్మునిపాదంబులపైవ్రాలి యట్టిపట్టిపుట్టియు నిష్ప్రయోజనము, నాయపరాధమును మన్నించి నను గావుమన నామునినీచేసినతప్పితమును నీవనుభవింపకతప్పదు. అనినుడివి దానిశరీరమంతయుం దడవిచూచి యపానస్థానములులేకున్ననేమి నాస్పర్శచేనీకు దివ్యప్రభావులగు సుతులుగలిగెదరనిచెప్పె. ఈచొప్పునబలిదనక్షేత్రమగు సుధేష్ణయందు నంధునివీర్యంబున నంగాది బ్రాహ్మణపుత్రులబడసె. అంతసురభి దీర్ఘతమునిపాలికేతెంచి నీవుమాగోధర్మంబు ప్రమాణంబుగ గైకొని యనుష్ఠించితివి. కావున బృహస్పతిశాపనిమిత్తంబునం బాపరూపంబగు నీయంధత్వమునుమాపెదనని చెప్పి యతనిశరీరము నాఘ్రాణించి శాపపాపంబుంబీల్చిన నతండు దివ్యయౌవనవంతుడై తనయంధత్వమునుబాసి గోతముడను నాఖ్యచే దేజరిల్లి గిరివ్రజపర్వతమునకు దపము సేయనరిగె. అతనికి దాసియందుబుట్టిన కక్షీవంతుడు నతనివెంట నగ్గిరికరిగి యందుఘోరతపము సేసి తనశూద్రత్వమునుబాసి బ్రాహ్మణుడయ్యె. కావున గోతముడాతని దనసుతుడుగాగొనిన నతనికి గూశ్మాండులు, గౌతములు, అనవేవురుసుతులుగలిగిరి. ఇకపైనం జెప్పబడిన బలిపుత్రులలో నంగునివంశంబున భారతయుద్ధములో బ్రసిద్ధుండగు కర్ణుడు ముప్పదాఱవపురుషుడయ్యె. ఆవంశంబున ముప్పదేనవవాడగు సూతుడనువాడాతనింబాలించుటంజేసి యాతడు సూతసంజాతుడని పేర్కొనియె. ఆకర్ణునకు వృషసేనుడను కొడుకుగలిగె. ఆవృషసేనునకు వృషసేనియను సుతుడుగలిగె. ఇకబూరువంశమునువినుడు.

## పూరువంశవివరణము.

యయాతి నాలవసుతుండును, యయాతికి యౌవనమిచ్చినవాడునగు బూరువుని సంతతినిబమనాలవపురుషుండగుదుష్యంతుడు శకుంతలయనుగాంత నేకాంతంబునబొంది దానికిబుట్టినసుతుని దనసుతుడు గాడనివాదింప నశరీరవాణి యెల్లరువినసోరాజా! పుత్రునకు జనని తోలుసంచి చందంబుననుండు. పతిపీర్యమే సతిగర్భము

చొచ్చి సుతుడగుంగాన బలిమేసుతుడయ్యెనని భావింపనగు. అట్టిసుతుని భరించుట జనకునకు దప్పదని జెప్పుటంబట్టి యాపట్టిభరతుడని పేరొందెనని దుష్యంతుడు వనమున కేగినపిదప ప్రభువయ్యె. ఆభరతుడు పుత్రాకాంక్షచే నొకయజ్ఞము సేసి దానఫలములంగానేరక మరుత్స్తోమము చేసి మరుత్తుల మెప్పించినవారు తొల్లితనయన్నభార్యయగు బృహస్పతిమమతను బలాత్కారంబున బొందినపుడు వెడలిన వీర్యము వలనబుట్టి దమచేబోషింపబడుచున్న భరద్వాజుని భరతునికిచ్చిన భరతుడు వానికి బట్టముగట్టివనమునకరిగె. ఆభరద్వాజుడు అవితథమహారాజని పలుంగిద్వ్యాముష్యాయణులను బ్రాహ్మణులకును, కౌలీనులను క్షత్రియులకును దండ్రియయ్యె. కావుననితని వంశంబులెల్లనితని ప్రభావంబున బ్రాహ్మణాధికారంబును క్షత్రాధికారంబునుగలిగి వెలసిరి. ఈభరద్వాజునకు నేడవపురుషుండగు శిబికిశైబ్యులను రాజులును గర్గ్యులను బ్రాహ్మణులునుగలిగిరి. పండ్రెండవవాడగు హస్తియనువాడు ప్రసిద్ధినొంది హస్తినాపురమునునిర్మించె. ఆహస్తికి అజామీళాది పుత్రులుపుట్టిరి. ఆయ్యజామీళుని భార్యలలోగేశిని యనుదానికి గణ్వమహర్షి జనించె. అమ్మహాత్మునకు మేధాతిథిగలిగె. అతనియన్వయజులెల్ల గాణ్వాయనులనిపలుంగుచు బ్రహ్మక్షత్రియాధికారంబులరెంటింగలిగియుందురు - అయ్యజామీళుని రెండవ భార్యయగు ధూమిని కొడుకు సంతతిలోనిరువదెనిమిదవవాడగు జనమేజయుడనువాడు సంతానము లేక స్థాణుత్వంబున వేయువత్సరములుతపము సేయుచున్న ఉగ్రాయుధుడను సూర్యవంశజుని పుత్రునిగాగొని దాయాదులును దుర్మార్గులునగు నీచులదోలి ధర్మనిష్ఠచే జ్ఞానమునుబడసె - అజామీళునిమూడవ భార్యసంతానసంతతిని ముప్పది తొమ్మిదవపురుషుండగు కృతుడనువాడు కోసలదేశవాసియగు హిరణ్యనాభుని యనుగ్రహంబున నిరువదినాలుగుఖండములం గలసామవేదమునుబఠించె - అజామీళునినాల్గవసతియగు నీలినియనుదానికి నీలుడుగలిగె. అతనిసంతతినినాలవవానికినైదుగురు కొడుకులుపుట్టి యైదుదేశంబులనేలిరి. కావునవారికి బాంచాలదేశాధిపులనియు నాదేశంబులకు బాంచాల దేశంబులనియు నామములుగలిగె. ఆపాంచాలురలోనెక్కండగు ముద్గలునకు మౌద్గల్యులుపుట్టిరి. ఈయన్వయజులగు మౌద్గల్యులందఱును గాణ్వాయనులచందంబున బ్రహ్మక్షత్రియాధికారంబుల రెంటింగలిగియుందురు. ఆముద్గలునకు బ్రహ్మిష్ఠియు, నతనికివంధ్యాశ్వుడు, నతనికిదివోదాసుడను సుతుడును, అహల్యయను గన్నియయుగలిగిరి. అందుదివోదాసునకు మిత్రాయతి, మైత్రాయనుడు అనుతనయులుజనించిరి. అందుమైత్రాయనునకు మైత్రేయుడుగలిగె. ఆయహల్య గౌతముని భార్యయైశతానందునిగనియె. శతానందునకు సత్యధృతియను కొడుకుగలిగె. ఈసత్యధృతియొకనాడు జలమధ్యంబున నొకయచ్చరకన్నెంగని మోహించినతని యమోఘవీర్యము వెడలిభూమిపయింబడి యొకపుత్రుడునునొకపుత్రియు

నయ్యె. అట్టిదివ్యాంగనా కొలనుగట్టుననుండ శంతనుడుగని తనపురికిఁగొనిచని వా రింబెంచె - అజామీళునిప్రథమ భార్యయగు ధూమిని సంతానప్రాప్తిలేకతపంబునన జామీళు మెప్పించిన నతండు దానికిపుత్రుడను బుత్రుడుగలుగంజేసె. ఆపుత్రునకు సంవరణమునియు, నతనికికురువును గలిగిరి. ఆకురువుప్రయాగాది దేశంబులనేలుచు బెద్దతపంబుజేసెంగాన నత్తలంబు కురుక్షేత్రమనిపలుంగె. అతనివంశజులేకౌరవులు.

కౌరవులవంశవివరణము.

ఆకురువుకు నాల్గవపురుషుడగు చైద్యుడను వానికిబృహద్రథుడు, యజువు మొదలగు నేడుగురుసుతులుగలిగిరి. అందుబృహద్రథునిసంతతిని దొమ్మిదవవాడగు బృహద్రథునకు నొకకోడకు రెండుచీలికెలుగవుట్టినజరయను రక్కసిచే నారెండుఖండంబులొండొంటితో జేర్చబడుటంజేసియతడుజరాసంధుడని పలుంగె. అతనికిసహదేవుడను సుతుడుగలిగె - వీరలుమగధదేశాధీశులు. ఆచైద్యుని దొమ్మిదవసుతుడగు యజువువంశములోబదునాలవవాడగు బ్రదీపునకుదేవాపి శంతనుడు, బాహ్లీకుడు, అనమువ్వురుసుతులు జనించిరి. వారిలోదేవాపి కుష్ఠురోగముచే మునియై తపంబునకేగె. బాహ్లీకునకు బాహ్లీశ్వరులననేడుగురు పుత్రులుగలిగిరి. శంతనుడు రాజ్యముబూనియధికధార్మికుడైపరిపాలనముసేసె. ఎట్టిరోగియైనను, ఎట్టివృద్ధుడైనను, శంతనుడుతాకుటచే రోగమునేని ముదిమినేని బాయుచుండుటంబట్టి యతండుశంతనుడు (శం-సుఖమును, తనోతి—యిచ్చువాడు-అనగాశరీరమునకు సుఖమిచ్చువాడు)అని పేరొందె. ఆశంతనుడు గంగనువరించిదానియందుభీష్ముని గాంచె. మఱియు నాశంతను సుతుడగు విచిత్రవీర్యుని భార్యయందు వ్యాసులుధృతరాష్ట్రుని, పాండురాజును,దాసియందువిదురునింగాంచె. అందుధృతరాష్ట్రునకు నూటుగురుసుతులుగలిగిరి. వారిలోజ్యేష్ఠుడగు దుర్యోధనుడు రాజాధిరాజై వెలసె. పాండురాజుకుగల భార్యలలోబృథయను దానికి ధర్మునివలన యుధిష్ఠిరుండును, వాయువువలన భీముండును,ఇంద్రునివలననర్జునుండును, మాద్రియనుదానికి నశ్వినీదేవతలవలన నకులసహదేవులును గలిగిరి.వీరైదుగురును ద్రౌపదినివరించిన నాద్రౌపదికియుధిష్ఠిరువీర్యంబున బ్రతివింధ్యుడు,భీముని వలన శ్రుతసేనుడు,అర్జుననివలనశ్రుతకీర్తి, నకులునివలనశ్రుతవర్మ,సహదేవునివలన నీకుడు, అన నైదుగురు ఉపపాండవులువుట్టిరి. వీరుకాక పాండవులకు వేఱొగ్గురు కొమరులుగలిగిరి. వారలెవ్వరన్న, యుధిష్ఠిరునకు దేవకియనుభార్యయందు యౌధేయుడనువాడును, భీమునకు హిడింబయందు ఘటోత్కచుడు, జలధరయందు సర్వగుడు, అర్జుననకు సుభద్రయందు అభిమన్యుడు, నకులునకు గరేణుమతియందు నిరమిత్రుడు, సహదేవునకు మాద్రియందు సుహోత్రుడు, ఈప్రకారముపుట్టిరి. వీరిలో నభిమన్యునకు బరీక్షిత్తును, పరీక్షిత్తునకు జనమేజయుడునుగలిగిరి. ఆజనమేజయుడు యాగముసేసియందు యాజ్ఞవల్క్యుల బ్రహ్మగానియమించె. అదిచూచి

వైశంపాయనుడు సైరింపక జనమేజయునిమాట చెల్లకుండునట్లును, అతనికియజ్ఞాధికార ముండకుండునట్లులను శపించె. అయిన నతండు ధీరతమెయి పౌర్ణమాసేష్టినిగావించి రెండశ్వమేధములనుజేసి వాజసనేయులలో శ్రేష్ఠుడై వెలసె. ఆజనమేజయునిసుతుడు శతానీకుడు. ఆశతానీకుని పుత్రుడగుఅధిసీమకృష్ణుడు, ఇపుడు(అనగా సూతుండు మునులకీపురాణమును చెప్పుసమయమున) ప్రభువుగానుండు. అనిసూతుండుచెప్పి మఱియునిట్లనియె. చంద్రవంశమున నేనిప్పురాణమును జెప్పునికాలమువరకు ప్రభువులవివరించితి. ఇకరాగలరాజు లెవ్వరన్న: ఈయధిసీమకృష్ణునకు వివక్షుడుడుగలుగు. అతడుహస్తినాపురముగంగనుమునింగిన తోడనే కౌసుంబియనుపురమును నిజరాజధాని గావించికొనును. అతనికి భూరిశ్రేష్ఠుడు, వానికి చిత్రరథుడు, వానికి శుచిద్రథుడు, వానికి వృష్టిమంతుడు, వానికి సుషేణుడు, వానికి సునీథుడు, వానికి నృచక్షుడు, వానికి సుఖీలవుడు, ఈరీతి క్షేమకుడనువాని పర్యంతంబీచంద్రవంశము వర్ధిల్లు. ఈవంశము బ్రహ్మక్షత్రియుల కిరువురకును గారణభూతంబై యుండు.

అగ్నిసంతానవివరణము. సం - అ - ౫౧.

అంతమునులుసూతుంజూచి అగ్నిదేవుసంతానము వివరింపుమనియడిగిన నతండు వారికి నగ్నిసంతానసంతతియు నలువదితొమ్మిదివిధములై యెయ్యేనామంబుల నేయ్యేస్థలంబుల నెయ్యేకార్యంబుల కుపయోగింపబడుట మొదలగువాని విశదముగవివరించి యికవిననలయువాని నడుగుమన వారలు కర్మయోగమును వివరింపుమన నతండిట్లనియె.

కర్మయోగవివరణము. సం - అ - ౫౨.

లోకంబుననరుడు కర్మయోగముననుసరించినగాని జ్ఞానయోగము సాధింపనేరడు. కర్మయోగమువలన జ్ఞానయోగము, దానివలనబ్రహ్మప్రాప్తియుగలుగు - ఎట్లన్న:నున శరీరము కూపసమానము. అందు బరమాత్మజలంబు పగిదినుండు. ఇట్టులుండుటంబట్టిగట్టున నూరకుండి యంత్రాది సాధనంబుల నీరునీడ్చకున్న నీరునుబడనేరనిరీతి గర్మమర్మంబులనెఱింగి కష్టించకయే కర్మరహితుడై శుద్ధజ్ఞానయోగినని పేరుపెట్టుకొన్న మాత్రంబుననేయెన్నిజన్మములకైనను బొందదగినవస్తువును బొందజాలడు. కావున గర్మననుష్ఠించుట యత్యావశ్యకము. అట్లుగర్మమార్గప్రవర్తకుడు సర్వభూతదయాళుత్వము, శాంతి, క్రోధములేకుండుట, అంతర్బహిశ్శౌచము (ఆత్మశుద్ధియు, దేహవస్త్రాదిశుచిత్వము,) శరీరమును విశేషముగ గష్టపెట్టకుండుట, సదాచారము, ధనమార్జించినను విశేషాశలేకుండుట, పరదారపరధనములనపేక్షించకుండుట, అనునెనిమిది గుణముల ముఖ్యముగగలిగి యుండవలయు. ఈగుణములుగలిగెనేని సర్వకర్మములు సమకూడు. గృహస్థుండగువాడు ఋషుల

ను స్వాధ్యాయముచేతను, దేవతల యజ్ఞముచేతను, పితరుల శ్రాద్ధము చేతను, భూతములబలులచేతను, అతిథులబూజలచేతను, అనుదినమును దనుపవలయు. ఇది పంచయజ్ఞంబులనంబడునది. మానవుడు నిరతము చేయుకార్యంబుల ఖండని, పేషిణి, చుల్లి, జలకుంభి, ప్రమార్జని, యను బంచసూనములు గలుగు. ఎట్లన్న, ఖండని. (దేనినైననరుకుటచే నందులో క్రిమికీటకాదులు చచ్చు.) పేషిణి. (దేనినైన రాతినినూరితే కొంతజంతుబాధకలుగు.) చుల్లి. (పొయ్యియందగ్నియుంచునపుడందు జేరియుండుజంతు హింసయగు.) జలకుంభి. (కడవలో జలముతీసుకవచ్చి యదిభూమి యందుంచునపుడు భూమియందలికొంతజంతు హింసయగు.) ప్రమార్జని. (కసువుచిమ్మునపుడు కొన్నిపిపీలికాదులునశించు.) ఈరీతిని నరునకు నిత్యము దురితముపొసగుచుండుగాన మానవు డీపంచసూనములు తనుబొరయకుండ నిరతమును బంచయజ్ఞంబులొనర్పవలయు. ఇట్లుగర్మాచరణుండై యొరులకు జెరుపుగలుగజేయక నిష్కాముండై సదాపరబ్రహ్మంబును స్మరించు నరోత్తమునకీధరాతలంబున బొందరానిదెద్దియునుండదు. అట్టివాడుజ్ఞానయోగమును సగాబొంది కొద్దికాలంబున ముక్తింగను. అట్లుగాక కర్మరహితుడగువాడు పంచుడు నందును నిందితుడగు.

పురాణములసంఖ్యావివరణము. సం - అ - ౫౩.

అనిచెప్పినవిని మునులు మనంబుల నను మోదంబునొంది సూతుంజూచి యనఘాత్మా! పురాణములసంఖ్యను వివరింపుమనియడిగిన మనువునకుమత్స్యుడు చెప్పినమాడ్కి నతండిట్లు నుడువదొడంగె. మొట్టమొదట బ్రహ్మముఖమునుండి సకలశాస్త్రసారపూరితములగు బురాణసంహిత శతకోటిగ్రంథ సంఖ్యగలదై పుట్టె. పిదప ముఖములవలన గ్రమక్రమంబున నాలుగువేదంబులు వెడలె. అట్టుల మొట్టమొదటధర్మార్థకామ సాధకమైపుట్టిన పురాణసంహిత యొక్కటిగనుండె. ప్రళయకాలంబున లోకంబులెల్ల దగ్ధంబులైనతటి నేను (విష్ణుడు) హయగ్రీవావతారమెత్తి వేదంబులను దదంగంబులను, పురాణసంహితను, న్యాయశాస్త్రమును, మీమాంసమును, ధర్మశాస్త్రమును, నాయందుబూనితి. విస్మృతకల్పాదిని నేనుదకమధ్యంబున మత్స్యముగానుండి వానినెల్లం బ్రహ్మకుజెప్పిననతండు వానిగ్రహించి మునులకుపదేశించె. అప్పటినుండి పురాణప్రవర్తనమలంగలిగె. నేనుప్రతిద్వాపరంబున వ్యాసుడుగానవతరించి యప్పురాణసంహిత నాలుగులక్షల గ్రంథసంఖ్యగలదిగా సంగ్రహమొనర్చితి గాని యదియిప్పటికిని దేవలోకమున శతకోటిప్రవిస్తరముగానే యున్నది. అట్టులశతకోటిప్రవిస్తరంబగుదాని యర్థమంతయు నీనాలుగులక్షల సంహితను సంగ్రహముగానుండును. పురాణసంహితయంతయు బదునెనిమిదిభాగములుగ విభజింపబడినయది. ఎట్లన్న.

| సంఖ్య. | పురాణముల నామములు. | గ్రంథసంఖ్య | ఆయాపురాణమును దానమిచ్చు విధానము తత్ఫలము. | షరా. |
|---|---|---|---|---|
| ౧ | బ్రాహ్మము ... | ౧౦౦౦౦ | దీనిని జలధేనువుతోటి వైశాఖపూర్ణిమయందు దానమిచ్చిన బ్రహ్మలోకప్రాప్తియగు. | ఈపురాణమునందు అష్టాదశపురాణముల సంఖ్య ౪౦౧౭౦౦ గ్రంథసంఖ్యవివరించియున్నది - ఐన భవిష్యత్పురాణ సంఖ్యలో ౫౦౦ గ్రంథము స్కాందపురాణ సంఖ్యలో ౧౦౦౦ గ్రంథము బ్రహ్మాండపురాణసంఖ్యలో ౨౦౦ గ్రంథము ఉభయము ౧౭౦౦ గ్రంథ మధికమనే యూహించెద పురాణములన్నిటిని సమగ్రముగ జూచునటుల గలిగెడి శుభోదయంబున పైయధిక సంఖ్యయొక్క వివరము తేటపడు. పు. వెం. |
| ౨ | పాద్మము. ... | ౫౫౦౦౦ | దీనిని స్వర్ణలేఖినితోటి జ్యేష్ఠమాసపూర్ణిమయందు దానమిచ్చిన అశ్వమేధఫలప్రాప్తి. | |
| ౩ | వైష్ణవము ... | ౨౩౦౦౦ | దీనిని ఘృతధేనువుతోటి ఆషాఢపూర్ణిమయందు దానమిచ్చినవిష్ణులోకముకలుగు. | |
| ౪ | శైవము, ఇదే వాయవీయం | ౧౨౦౦౦ | దీనినిగుడధేనువుతోటిశ్రావణ పూర్ణిమయందు దానమిచ్చిన శివలోకవాసియగు. ... | |
| ౫ | భాగవతము ... | ౧౮౦౦౦ | దీనిని బంగరుసింగముతోటి భాద్రపదపూర్ణిమయందు దానమిచ్చినపరమపదంబుగలుగు | |
| ౬ | నారదీయము. | ౨౫౦౦౦ | దీనిని ప్రత్యక్షధేనువుతోటిఆశ్వయుజపూర్ణిమయందు దానమిచ్చినఇష్టలోకప్రాప్తి. ... | |
| ౭ | మార్కండేయము. | ౯౦౦౦ | దీనిని స్వర్ణ గజంబుతోటి కార్తికపూర్ణిమయందు దానమిచ్చిన పౌండరీక ఫలము. | |
| ౮ | ఆగ్నేయము. | ౧౬౦౦౦ | దీనిని హేమపద్మ సహితములగు రెండుతిలధేనువులనుమార్గశిర్ష పూర్ణిమయందు దానమిచ్చిన సర్వక్రతు ఫలంబుజెందు... ... | |
| ౯ | భవిష్యము... | ౧౪౫౦౦ | దీనిని గుడధేనువుతోటి పౌషమాసపూర్ణిమయందు దానమిచ్చిన అగ్నిష్టోమఫలంబువాటిల్లు | |
| ౧౦ | బ్రహ్మకైవర్తము | ౧౮౦౦౦ | దీనిని గృహముతోటి మాఘపూర్ణిమయందు దానమిచ్చిన బ్రహ్మలోకంబు సంఘటిల్లు. | |
| ౧౧ | లైంగము. ... | ౧౧౦౦౦ | దీనిని తిలధేనువుతోటిఫాల్గుణపూర్ణిమయందు దానమిచ్చిన శివలోకంబుగలుగు. ... | |
| ౧౨ | వారాహము. | ౨౪౦౦౦ | దీనిని హేమగరుడ సహితమగు తిలధేనువుతోటి చైత్రపూర్ణిమయందు దానమిచ్చిన విష్ణులోకంబునవసించు... ... ... | |
| ౧౩ | స్కాందము. | ౧౦౧౦౦౦ | దీనిని బంగరుశూలముతోటి దానమిచ్చిన శివలోకమును పొందు... ... ... | |
| ౧౪ | వామనము ... | ౧౪౦౦౦ | దీనిని విషువత్పుణ్యకాలమున దానమిచ్చిన విష్ణులోకమున వసించు... ... ... | |
| ౧౫ | కౌర్మము ... | ౬౦౦౦ | దీనిని యుత్తరాయణపుణ్యకాలమున బంగరు తాబేటితోటి దానమిచ్చినగోసహస్రదాన ఫలంబబ్బు... ... ... | |
| ౧౬ | మాత్స్యము. | ౧౪౦౦౦ | దీనినియుగాదిని గోసహితము దానమిచ్చిన సకల పృథ్వీదాన ఫలంబనుభవించు. ... | |
| ౧౭ | గారుడము... | ౧౯౦౦౦ | దీనిని బంగరుహంసతోటి దానమిచ్చిన శివలోకమునజేరు... ... ... | |
| ౧౮ | బ్రహ్మాండము. | ౧౨౨౦౦ | దీనిని స్వర్ణసహితకంబళముతోటి వ్యతీపాతమున దానమిచ్చినసహస్రరాజసూయయాగఫలంబునిద్ధించు... ... ... | |
| | వెరశి... | ౪౦౧౭౦౦ | | |

ఇటుల మత్స్యుడు మనువుకు జెప్పెనని సూతుడు మునులకు జెప్పి మఱి యునిట్లనియె. ఈపురాణంబులనెల్ల దొల్లి వ్యాసుడు నాతండ్రికుపదేశించె. అతండు నాకెఱింగించె. ఈపదునెనిమిది మహాపురాణంబులుగాక అన్యపురాణకర్తచే నొనరింపంబడిన యుపపురాణములు పదునెనిమిదిన్నగాగలవు - సర్గము(సృష్టి) ప్రతిసర్గము (ప్రళయము) వంశములు, మన్వంతరములు, వంశానుచరితము, అను నైదంగంబులంగలదియే పురాణమనబడు. పంచలక్షణ లక్షితంబులగు నిప్పురాణంబుల హరిహర హిరణ్యగర్భ దివాకరభువనమాహాత్మ్యంబులు చెప్పంబడు. అందుసాత్వికకల్పంబులవిష్ణుమాహాత్మ్యంబును, రాజసకల్పంబుల బ్రహ్మమాహాత్మ్యంబును, తామసకల్పంబుల రుద్రాగ్నుల మాహాత్మ్యంబును, సంకీర్ణకల్పంబుల సరస్వతీపితరుల మాహాత్మ్యంబును వెలయుచుండు. వ్యాసుడీపురాణములనెల్లంగావించి లక్షగ్రంథమునుగల భారతమునుజేసె. నారదమునిచే నుపదేశింపబడి వాల్మీకి యిరువదినాలుగువేల గ్రంథసంఖ్యగల రామాయణమునుజేసె. ఈ రెండును పురాణంబులును జేరి అయిదు లక్షల యిరువదినాలుగువేల గ్రంథసంఖ్యగలవిగా జెప్పనగు. పురాణమనగా పూర్వముజరిగిన చరిత్రము - కానవానివిన్న శ్రేయముగలుగు.

వ్రతాదుల వివరణము.

ఇకమనువుకు మత్స్యుడుచెప్పనచొప్పున వ్రతదానాదుల వివరించెదవినుడు.

నక్షత్రపురుషవ్రతము నారదునకు గౌరీపతిచెప్పుట- సం - అ - ౫౪.

(౧) చైత్రమాస సోమవారయుక్తంబగు మూలానక్షత్రంబున నొకకలశమందు కనకమయంబగు లక్ష్మీనారాయణప్రతిమలను స్థాపించి కల్పోక్తప్రకారము పూజా దానాదులంజేసినవారలకు సకలాభీష్టంబులు సమకూడి విష్ణులోకము ప్రాప్తించు.

ఆదిత్యశయనవ్రతము నారదునకు శివుడుచెప్పుట- సం - అ - ౫౫.

(౨) హస్తానక్షత్రయుక్తసప్తమిదినముననగాని, ఆదివారము హస్తానక్షత్రములంగూడిన సంక్రమణముననైనను, ఉమామహేశ్వరప్రతిమను సూర్యనామములతో కల్పోక్తప్రకారముపూజించి తత్ప్రకారము దానాదులొసంగిన సకలదురితంబులంబాసి తమపితరులసయితము శివలోకమునకేగుదురు. ఇదిశివభక్తులకు ముఖ్యవ్రతము.

కృష్ణాష్టమీవ్రతము నారదునకుమాపతిచెప్పుట - సం - అ - ౫౬.

(౩) మార్గశీర్షమాసము మొదలు పండ్రెండు మాసములయందలిపండ్రెండు కృష్ణాష్టములయందు శంకరాదులను కల్పోక్తప్రకారముపూజించి దానాదులిచ్చిన ముక్తిగలుగు. కృష్ణాష్టమిఅనగా కృష్ణపక్షఅష్టమి.

రోహిణీచంద్రశయనవ్రతము నారదునకీశ్వరుడు చెప్పుట- సం - అ - ౫౭.

(౮) సోమవారమైనను మృగశీర్షా నక్షత్రమైనను వచ్చిన పూర్ణిమయందు విష్ణుని జంద్రనామములతో బూజించి కల్పోక్తవిధిప్రకారము దానాదులిచ్చిన కోరికలు నెరవేరి మఱలజన్మము లేని ముక్తిగలుగు.

తటాకప్రతిష్ఠ - మత్స్యుడు మనువుకు జెప్పుట - సం - అ - ౫౮.

(౯) తటాకములు నూతులు మొదలగువాని ప్రతిష్ఠ సేయు విధానము మాత్రము దెలియబడుచున్నది.

వనప్రతిష్ఠ సూతుడు శౌనకాదులకు జెప్పుట-సం - అ - ౫౯.

(౬) తటాకప్రతిష్ఠకువలె విధానము మాత్రమున్నది.

సౌభాగ్యశయనవ్రతము మత్స్యుడు మనువుకు జెప్పుట- సం - అ - ౬౦.

(౭) చైత్రశుద్ధతృతీయ పూర్వాహ్ణమునందు ఉమామహేశ్వర ప్రతిమలకు వివాహము సేసి కల్పోక్తప్రకారము పూజాదానాదులం జేసిన శివలోకము సంఘటిల్లు.

అగస్త్యోత్పత్తి పూజావ్రతము నారదునకీశ్వరుడు చెప్పుట - సం - అ - ౬౧.

(౮) తొల్లి భూమిని తారకుడు మొదలగు రక్కసులుమిక్కిలి జనులకు బెక్కుబాధలం గలుగజేయుచుండ వారిం బరిమార్ప నింద్రుడగ్నిని వాయుసహితముగ మహీతలమునకనిచిన నాదనుజులు బెదరి సముద్రమధ్యంబున దాగి శత్రువుల బాధింప నుపాయంబులు చింతింపుచుండ నగ్ని వారిదురాలోచనల నెఱుంగక వారు ప్రాణభీతిని బఱచి శరధిం దాగిన వారి కోగు సేయరాదనియు నూరకుండె. అంత నా దుష్టరాక్షసు లప్పుడప్పుడు భూమికేతెంచి దేవనరోరగాదుల బాధింపుచు మునులహింసింపుచు యజ్ఞంబుల విఘ్నము సేయుచు మఱియు నెన్నియో దుష్టకార్యంబుల నాచరింపుచుండ బురందరుడు మరుత్సహితుండగు నగ్నిం జూచి నీవూరకుండుటం జేసి యీదానవులిట్టి దుష్కృత్యంబులొనర్చెదరు. కావున వారికి దాగికొన నాలయమగు సముద్రంబులోని నీరెల్ల నింకంజేసిన నారక్కసులు మనచేజిక్కి స్రుక్కిపోమెదరనిన నగ్నిసురపతింగాంచి దేవేంద్రా! కొందఱసు మనవగతులకై సముద్రములోని నీరునింకంజేసిన నందుండు సంఖ్యాతీత జలచరంబులన్నియు నశించుగాన దీని నాచరింపదగదనిన ననిమిషపతి మనంబునగినుకం బూని నీవు నా చెప్పినచొప్పున జేయవైతివి కావున నీవు వాయువుసహితము భూమిని సంభవించుమట్టి యీసముద్రము నీరెల్లనింద్రావెదవు. అట్టులంద్రావిన పిదప నీకు మఱల దేవశరీరము గలుగునని వచించిన తత్క్షణంబ యగ్నిమరుత్సహితుడై భూమింబడి యగస్త్యుడుగా జనించె. ఎట్లన్న.

పూర్వము విష్ణువు ధర్ముడను వానికి కొడుకై గంధమాదన పర్వతమున నుగ్రతపము సేయుచుండ దద్విఘ్నంబొనర్ప మన్మథాదుల నప్సరసలతోడ నింద్రుండు పంపిన వారేతెంచి యెట్టిప్రయత్నంబులం జేసినను, ఆతపోధన్యుని మనసు చలించదయ్యెం గాని యతడు మాహాత్మ్యమెల్లరకు దెల్లంబగునట్లు దనయూరుప్రదేశమునుండి యసమాన రూపలావణ్యాతిరేకంబుల నోలలాడు బాలామణినిబుట్టించి దానికి నూర్వశియను నామంబిడియె. అయ్యూర్వశిని మిత్రుడనువాడు వరించిన వానితోడనది యరుగుచుండ వరుణుడనువాడు సగౌరవంబుగ వరించె. అంతనకామందయాన మందహాస ముఖారవిందయై నన్నొకడు వరించెంగాన నేనతనికి సతినైతి. వెఱపురుషు వరింపగా నేరదనిన నతండట్లనిచుదకు నిన్నా మిత్రుడు మదనసంగరంబునం గూడినపుడు నీచిత్తంబుమాత్రము నాయందుంచుమనిన నామత్తేభయాన యందునకొప్పికొని యారీతియగావించిన మిత్రుడుతన దివ్యదృష్టిచే దీనినెఱింగి యూర్వశిం జూచి నీవు వెలయాలివలెనటించితివి కావున భూమిని నరయోనినిబుట్టి పురూరవుని సతివయ్యెదవని శపించె. అట్లా యూర్వశిపయింగల మోహముచే మిత్రావరుణుల కిరువురకును వెడలిన రేతస్సు ఒకజలకుంభమందుంచబడిన నాకుంభమునుండి తొలుత నిమియనుమహాత్ము డుదయించి పెక్కుయువతులంగూడి క్రీడించుతఱి నచ్చటికి బ్రహ్మపుత్రుండగు వసిష్ఠుడు విచ్చేసిన నతని నిమిసత్కరింపడయ్యె. అందునంజేసి వసిష్ఠుడు నిమి దేహము లేనివాడగునట్లులందిట్టిన నిమిసహింపక తన్నుదిట్టినట్లుంవలెవసిష్ఠునిందిట్టె- ఇట్టుల వారలొండొరులచే దిట్టంబడి స్రష్టపాలికేతెంచి యదియంతయు నాతనికి విన్నవించిన నాబ్రహ్మ నిమిని దననేత్రాంతరవాసిం జేసె. అది కారణముగా నిమేషము (రెప్పపాటుకాలము) వెలయుచుండు. అంతవసిష్ఠుడు నిమిటట్టుంబట్టి మిత్రావరుణుల వీర్యముగల కుంభమునుండి పూర్వమువలెజనించె - పిదపనందుండి యగస్త్యుడు చతుర్భుజకమండలు యుక్తుడై యుదయించి మలయాచలమున బెద్దకాలముతపము సేసె. నరులంబాధించు దారకాద్యసురులు నశింప సముద్రోదకము నెల్లం బానము సేసె. అత్యున్నతంబై దినదినమునకు వృద్ధినొందుచుండు వింధ్యపర్వతమును బరుండంజేసె. రెండవ మృత్యువును నిర్మించె. కాలకూటమును (సముద్రమథనమువలన బుట్టినవిషము.) వ్యర్థముగావించె, శ్వేతకేతువుంబరిమార్చె. మఱియు నెన్నియోయెన్నజాలని ప్రభావకృత్యంబు లొనర్చిన మెచ్చి త్రిమూర్తులును దేవగణములతోడ నాతనికిబొడసూపి కోరుమనిన నతండుతనకు ౨౫౦౦౦౦౦౦౦౦౦౦ సంఖ్యాకసృష్టికర్తలుమాఱుపర్యంతము దక్షిణాపథంబున నాకాశపీఠిని శాశ్వతస్థానంబుండునట్లును, తనయుత్పత్తి (అగస్త్యనక్షత్రోత్పత్తి.) కాలంబుల దనకర్ఘ్యమిచ్చుచు దనయుత్పత్తివ్రతము సేయువారలకు నేడుపుణ్యలోకములు గలుగునట్లును, వరంబివ్వుడని వేడిన వారలవ్వరంబొసంగి తిరోధానమునొందిరి. కావున

నెవ్వాడేని నీయగస్త్యోత్పత్తి వ్రతమును గల్పోక్తప్రకార మేడువత్సరములు చేసె నేని నట్టివాడు సకలదురితములనుబాసి సకలాభీష్టసిద్ధినొంది సప్తపుణ్యలోకముల ననుభవించు.

ఆనందతృతీయావ్రతము పార్వతికిశివుడుచెప్పుట. సం - అ - ౬౨.

(౯) ఇది స్త్రీలకుముఖ్యవ్రతము. విధవలుగాని సువాసినులుగాని దీనిబూనవచ్చు. శ్రావణ శుద్ధతదియమొదలు పండ్రెండుతదియలు ఈవ్రతమునుబట్టి యిందు గౌరిని గల్పోక్తప్రకారముగ పూజించి దానాదులుచే వ్రతముసంపూర్తిచేయువారికి శివలోకము గలుగు.

రసకల్యాణతృతీయావ్రతము - పార్వతికీశ్వరుడుచెప్పుట. సం - - అ - ౬౩.

(౧౦) ఇది మాఘశుద్ధతృతీయ మొదలారంభించి గౌరీపూజాదానాదులం గల్పోక్తప్రకారముచేసిన బార్వతీలోక మును జెందెదరు.

ఆర్ద్రానంద తృతీయావ్రతము - పార్వతికీశ్వరుడు చెప్పుట. సం - అ - ౬౪.

(౧౧) ఈవ్రతము ఉత్తరాషాఢ, పూర్వాషాఢ, మృగశీర్ష, హస్తమూలాల, వీటి లోనేదిగాని వచ్చెడుశుక్లపక్షతృతీయను ఈవ్రతము నారంభించి ఉమామహేశ్వరుల కల్పోక్తప్రకారముపూజించిన దేవీలోకముగలుగు.

అక్షయతృతీయావ్రతము - పార్వతికీశ్వరుడుచెప్పుట. సం - అ - ౬౫.

(౧౨) దీనిని వైశాఖశుద్ధతదియనుండి ప్రారంభింపవలయు. ఇదియుపవాస వ్రతము దీనినాచరించెడివారు రాజసూయ ఫలమునొంది కోరినపుణ్యలోకంబుల నొందెదరు.

సారస్వతవ్రతము-మనువుకుమత్స్యుడుచెప్పుట - సం - అ - ౬౬.

(౧౩) ఈవ్రతమును తారాబల చంద్రబలయుక్తమైన ఆదివారమునగాని తానేదైనవ్రతమును జేయబూనిన శుభదినమందుగాని ప్రారంభింప వలయు. దీనిని పదమూడుమాసములు చేయవలయు. ఇందుసరస్వతి బూజింపబడుంగాన దీనినాచరించువారికి విద్యాభివృద్ధియు బ్రహ్మలోకప్రాప్తియు గలుగు.

గ్రహణస్నానవ్రతము - మత్స్యుడు మనువుకుజెప్పుట. సం - అ - ౬౬.

(౧౪) ఎవనిజన్మరాశియందు గ్రహణముపట్టునో అట్టివాడాగ్రహణకాలంబున నీవ్రతమును విధానప్రకారము సేయవలయు. అట్టులంజేసిన నాగ్రహణపీడవానినంటదు.

# శ్రీమత్స్యపురాణసారసంగ్రహము.

సప్తమీస్నపనవ్రతము - స - అ - ౬౮.

(౧౫) ఇది స్తన్యపానము సేయుశిశువునకువచ్చెడి ప్రాణాపాయరోగముల పరిహారము కొరకై చేయదగినయది. (దీనినాచరింపగడు రోకట ముట్టకను.) ఇందుసూర్యనిరుద్రుని గల్పోక్తప్రకారము పూజింపవలయు.

కల్యాణభీమద్వాదశీవ్రతము—బ్రహ్మకేశ్వరుడు చెప్పుట - సం - అ - ౬౯.

(౧౬) దీనిని కృష్ణుని యుపదేశమువలన భీముడు సేసెం గాననిది భీమద్వాదశీవ్రతమనంబడె. దీని మాఘశుద్ధ ౧౦ ప్రారంభించి యేకాదశిని ఉపవాసజాగరణలు సేసి కల్పోక్తప్రకారము విష్ణునిబూజించి ద్వాదశిని శక్తికొలది విష్ణుపూజయు బ్రాహ్మణులకు దానభోజనాదు లిచ్చువారలకు విష్ణులోకము ప్రాప్తించు.

అనంగశయనవ్రతము—బ్రహ్మకేశ్వరుడు చెప్పుట - సం - అ - ౭౦.

(౧౭) ఇది వేశ్యాంగనలే చేయదగినది. దీనిని హస్తాపునర్వసు పుష్యమీనక్షత్రములలో నేదైనవచ్చిన ఆదివారమున ప్రారంభించి కల్పోక్తప్రకారము పదమూడుమాసములు సేయవలయు. పూర్వము శ్రీకృష్ణుడు పదియారువేల స్త్రీలంగలసి జలక్రీడార్థమేగియుండ నటకేతెంచిన మదనసుందరాకారుండును కృష్ణునిపుత్రుండునగు సాంబునిజూచి, వారెల్ల వ్యామోహము నొందిరి. దీనిం దెలిసికొని కృష్ణుడు కోపించి వారింగాంచి మీరు నాసన్నిధిని వేఱుపురుషుని గోరితిరి కావున మీరలు చోరుల పాలయ్యెదరని శపించి వారిప్రార్థనంబున మఱలగరుణించి యట్లు చోరుల పాలైనను దాల్భ్యుడను ముని యనుగ్రహంబున దరించు నుపాయము గంటురని చెప్పె. పిదప కృష్ణాది యాదవవంశక్షయానంతరము అర్జునుడీపదియారువేల స్త్రీలను గొనిపోవుచుండ కొండఱు చోరులువచ్చి యర్జునుని జయించి యా స్త్రీలు వేశ్యావృత్తిచే దమభామలుగనుండునట్లు జేసికొనిరి. అంతనొకనాడు దాల్భ్యుడు వారికడ కేగిన వారలతని బ్రార్థించి కృష్ణుడు తమకు జెప్పిన వాక్యమును సగా జెప్పి తమనుద్ధరింప వేడిన నతండిట్లనియె. మీరలు పూర్వజన్మమున నప్సరసలు. మీరొకదినంబున క్రీడించుస్థలమునకు నారదుడు వచ్చిన నాతనికి నమస్కారములొనర్పక మాకు నారాయణుడు భర్తయెట్లగునని యడిగిన నారదుడు మీరిట్టుల దలంచుటకే కృష్ణుని సతులయ్యెదరని జెప్పె నన్ను మీరు సత్కరింపకుండుటం జేసి తుదకు చోరుల పాలయ్యెదరనియు శపించె. ఆతిట్టుంబట్టియే సాంబుని జూచి మీకట్టిమత్తబుద్ధిపుట్టిన కృష్ణుడు మీకిట్టి కష్టదశగలుగునట్టులందిట్టె. అని చెప్పి వేశ్యలకు శ్రేయస్కరమగు ననంగశయనవ్రతము సేయువిధానము వారికుపదేశించి వారిచే నావ్రతము సేయించి నిజేచ్ఛంజనియె.

అశూన్యశయనవ్రతము—బ్రహ్మకేశ్వరుడు చెప్పుట - సం - అ - ౭౧.

(౧౮) శ్రావణశుద్ధవిదియను విష్ణుమూర్తిని బూజింపవలయు. దీనిగల్పప్రకారము చేసిన విష్ణులోకప్రాప్తిగలుగు.

అంగారకవ్రతము—బ్రహ్మకేశ్వరుడు చెప్పుట - సం - అ - ౨౨.

(౧౯) పూర్వము కౌరవులచే కపటద్యూతంబున సంపదగోల్పడి యుధిష్ఠిరుడు వనమున నివసించుతఱి పిప్పలుడను ముని యతనికి సకలాభీష్టంబులు సమకూడుట కై యీవ్రతమును జెప్పె. ఎట్లన్న. తొల్లి బ్రహ్మోదుని కుమారుండును, అతిరూపవంతుడును, పదియాఱేండ్ల వయసు గలవాడును నగు విరోచనుని జూచి శుక్రుడొకసమయమున బాగుబాగని నవ్వె. అందునకా విరోచనుడు నివ్వెఱపడి శుక్రుం జూచి నీవునను గని నిష్కారణముగ బాగుబాగని యేలనవ్వితివని యడిగిన శుక్రుడతనిం గాంచి అంగారకవ్రతమాహాత్మ్యంబున నవ్వితి. దాని దెలియంబలికెద వినుము. పూర్వకాలమున దక్షుని శిక్షించుటకై యతిక్రోధము నొందిన ఫాలాక్షు ఫాలమునుండి యొకచమట బిందువు భూమింజొచ్చి యధోలోకంబు లన్నిటిం గాల్చి ప్రళయకాలరుద్రుని బోలు వీరభద్రుడయ్యె, అవ్వీరభద్రుడు రుద్రునాజ్ఞ చే దక్షునింబున దక్షునియజ్ఞము నాశము సేసి దానిచే తృప్తినొందక ముజ్జగంబుల గాల్పదొడంగిన గౌరీపతి వారించి నీవు పుట్టినపని తీరె. ఇక నీ తీరున లోకముల నశింపజేయవలదు. నీవు సౌమ్యమగు వేలురూపము గలిగి అంగారకుడని పిలువంబడి గ్రహమధ్యవర్తివై యుండుము. నినుబూజించు వారలకు నాలోకము సిద్ధించునని చెప్పిన వీరభద్రుడు సౌమ్యరూపము చేనంగారకుడై వెలసె. ఆ యంగారకవ్రతము నొకశూద్రుడు సేయుచుండగ నీవు నీపూర్వజన్మమున జూచుటచే నీ కట్టివిశేషకాంతిగల యాకారము గలిగి తత్కారణమున విరోచనుడని పల్కంగితివి. మఱియు దాన వేంద్రుని సుతుడవైతివి, కావున నావ్రతమాచరించినవారి కెంతటి ఫలము గలుగునో నీవ తెలిసుకొమ్మనిన విరోచనుడు తనకావ్రతము సేయువిధానము చెప్పుమనియడిగిన శుక్రుండు దానినంతయు వివరించి విరోచనుడా యంగారకవ్రతము సేయునట్లు జేసె. కావున నో యుధిష్ఠిరుడా! నీవు నీవ్రతంబును గావించి సకలభోగంబుల ననుభవింపుమని యంగారకవ్రత విధానంబు దెలియంజేసె.

గురుశుక్రపూజావ్రతము—బ్రహ్మకేశ్వరుడు చెప్పుట సం - అ - ౨౩.

(౨౦) ఇందు శుక్రునిపూజ ప్రయాణాది కాలంబుల నెమ్ముఖుశుక్రుని పీడగలుగకుండ జేయదగినయది. గురుపూజ కల్పోక్తప్రకారముగ జేసిన సమస్తగ్రహపీడ నివృత్తియగు.

కల్యాణసప్తమివ్రతము—బ్రహ్మకేశ్వరుడు చెప్పుట. సం - అ - ౨౪.

(౨౧) శుక్లపక్షసప్తమిని ఆదివారము వచ్చెనేని నది కల్యాణసప్తమి యనంబడు. ఇది పదమూడు మాసములు సేయదగినయది. ఇందు సూర్యుడు పూజింపబడు.

సప్తమీస్నపనవ్రతము - స - అ - ౬౪.

(౧౫) ఇది స్తన్యపానము సేయుశిశువుకువచ్చెడి ప్రాణాపాయరోగముల పరిహారము కొరకై చేయదగినయది. (దీనినాచరింపగడు రొక్కముబట్టును.) ఇందుసూర్యునిరుద్రుని గల్పోక్తప్రకారము పూజింపవలయు.

కల్యాణభీమద్వాదశీవ్రతము—బ్రహ్మకునీశ్వరుడు చెప్పుట - సం - అ - ౬౯.

(౧౬) దీనినికృష్ణుని యుపదేశమువలన భీముడు సేసెంగాననిది భీమద్వాదశీవ్రతమనంబడె. దీనిమాఘశుద్ధ ౧౦ ప్రారంభించి యేకాదశిని ఉపవాసజాగరణలు సేసి కల్పోక్తప్రకారము విష్ణునిబూజించి ద్వాదశినిశక్తికొలదివిష్ణుపూజయుబ్రాహ్మణులకు దానభోజనాదు లిచ్చువారలకువిష్ణులోకము ప్రాప్తించు.

అనంగశయనవ్రతము—బ్రహ్మకీశ్వరుడు చెప్పుట - సం - అ - ౭౦.

(౧౭) ఇదివేశ్యాంగనలేచేయదగినది. దీనినిహస్తాపునర్వసు పుష్యమీనక్షత్రములలో నేదైనవచ్చిన ఆదివారమున ప్రారంభించి కల్పోక్తప్రకారము పదమూడుమాసములు సేయవలయు. పూర్వము శ్రీకృష్ణుడు పదియారువేల స్త్రీలంగలసి జలక్రీడార్థమేగియుండ నటకేతెంచిన మదనసుందరాకారుండును గృష్ణునిపుత్రుండునగు సాంబునిజూచి, వారెల్ల వ్యామోహము నొందిరి. దీనింజెలిసికొని కృష్ణుడు కోపించివారింగాంచి మీరునాసన్నిధిని వేఱుపురుషుని గోరితిరి కావున మీరలుచోరుల పాలయ్యెదరని శపించి వారిప్రార్థనంబున మఱలగరుణించి యట్లుచోరుల పాలైనను దాల్భ్యుడనుముని యనుగ్రహంబున దరించునుపాయముగందురని చెప్పె. పిదప కృష్ణాది యాదవవంశక్షీణానంతరము అర్జునుడీపదియారువేల స్త్రీలనుగొనిపోవుచుండ గొందఱుచోరులువచ్చి యర్జును జయించియాస్త్రీలు వేశ్యావృత్తిచే దమభామలుగనుండునట్లు జేసికొనిరి. అంతనొకనాడు దాల్భ్యుడువారికడకేగిన వారలతని బ్రార్థించికృష్ణుడు తమకు జెప్పినవాక్యమును సగాజెప్పితమనుద్ధరింప వేడిన నతండిట్లనియె. మీరలుపూర్వజన్మముననప్సరసలు. మీరొకదినంబున క్రీడించుస్థలమునకు నారదుడువచ్చిన నాతనికి నమస్కారములొనర్పక మాకునారాయణుడు భర్తయెట్లగునని యడిగిన నారదుడు మీరిట్లుల ధరంబుట్టి కృష్ణునిసతులయ్యెదరని జెప్పినన్ను మీరుసత్కరింప కుండుటంజేసితుదకుచోరులపాలయ్యెదరనియు శపించె. ఆతిట్టుంబట్టియేసాంబునిజూచి మీకట్టిమత్తబుద్ధిపుట్టిన గృష్ణుడుమీకిట్టికష్టదశగలుగునట్లులందిట్టె. అనిచెప్పి వేశ్యలకుశ్రేయస్కరమగు ననంగశయనవ్రతము సేయువిధానము వారికుపదేశించి వారిచేనావ్రతము సేయించినిజేచ్ఛంజనియె.

అశూన్యశయనవ్రతము—బ్రహ్మకీశ్వరుడు చెప్పుట - సం - అ - ౭౧.

(౧౮) శ్రావణశుద్ధవిదియను విష్ణుమూర్తిని బూజింపవలయు- దీనిగల్పప్రకారము చేసిన విష్ణులోకప్రాప్తిగలుగు.

అంగారకవ్రతము—బ్రహ్మాకీశ్వరుడు చెప్పుట - సం - అ - ౭౨.

(౧౯) పూర్వము కౌరవులచే కపటద్యూతంబున సంపద గోల్పడి యుధిష్ఠిరుడు వనమున నివసించుతఱి పిప్పలుడను ముని యతనికి సకలాభీష్టంబులు సమకూడుటకై యీ వ్రతమును జెప్పె. ఎట్లన్న. తొల్లి బ్రహ్మోదుని కుమారుండును, అతిరూపవంతుడును, పదియాఱేండ్ల వయసు గలవాడును నగు విరోచనుని జూచి శుక్రుడొకసమయమున బాగుబాగని నవ్వె. అందునకా విరోచనుడు నివ్వెఱపడి శుక్రుంజూచి నీవు నను గని నిష్కారణముగ బాగుబాగని యేల నవ్వితివని యడిగిన శుక్రుడతనిం గాంచి అంగారకవ్రతమాహాత్మ్యంబునకు నవ్వితి. దాని దెలియం బలికెద వినుము. పూర్వకాలమున దక్షుని శిక్షించుటకై యతిక్రోధము నొందిన ఫాలాక్షు ఫాలమునుండి యొకచెమటబిందువు భూమింజొచ్చి యధోలోకంబు లన్నిటిం గాల్చి ప్రళయకాలరుద్రుని బోలు వీరభద్రుడయ్యె, అవ్వీరభద్రుడు రుద్రుని యాజ్ఞ చేదక్షణంబున దక్షుని యజ్ఞము నాశము సేసి దానిచే తృప్తినొందక ముజ్జగంబుల గాల్పదొడంగిన గౌరీపతి వారించి నీవు పుట్టినపని తీరె. ఇక నీ తీరున లోకముల నశింప జేయవలదు. నీవు సౌమ్యమగు వేఱు రూపముం గలిగి అంగారకుడని పిలువంబడి గ్రహమధ్యవర్తివై యుండుము. నిను బూజించువారలకు నా లోకము సిద్ధించునని చెప్పిన వీరభద్రుడు సౌమ్యరూపము చేనంగారకుడై వెలసె. ఆ యంగారకవ్రతము నొక శూద్రుడు సేయుచుండగ నీవు నీ పూర్వజన్మమున జూచుటచే నీకిట్టి విశేష కాంతిగల యాకారము గలిగి తత్కారణమున విరోచనుడని పరంగితివి. మఱియు దానవేంద్రుని సుతుడవైతివి, కావున నా వ్రతమాచరించినవారి కెంతటి ఫలము గలుగునో నీవ తెలుసుకొమ్మనిన విరోచనుడు తనకా వ్రతము సేయువిధానము చెప్పుమనియడిగిన శుక్రుండు దానినంతయు వివరించి విరోచనుడా యంగారకవ్రతము సేయునట్లు జేసె. కావున నో యుధిష్ఠిరుడా! నీవు నీ వ్రతంబును గావించి సకలభోగంబుల ననుభవింపుమని యంగారకవ్రత విధానంబు దెలియంజేసె.

గురుశుక్రపూజావ్రతము—బ్రహ్మాకీశ్వరుడు చెప్పుట సం - అ - ౭౩.

(౨౦) ఇందు శుక్రుని పూజ ప్రయాణాది కాలంబుల నెదురు శుక్రుని పీడ గలుగకుండ జేయదగినయది. గురుపూజ కల్పోక్తప్రకారముగ జేసిన సమస్తగ్రహపీడ నివృత్తియగు.

కల్యాణసప్తమీవ్రతము—బ్రహ్మాకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౭౪.

(౨౧) శుక్లపక్షసప్తమిని ఆదివారము వచ్చెనేని నది కల్యాణసప్తమియనంబడు. ఇది పదమూడుమాసములు సేయదగినయది. ఇందు సూర్యుడు పూజింపబడు.

విశోకసప్తమీవ్రతము—బ్రహ్మకీశ్వరుడుచెప్పుట. సం - అ - ౭౫.

(౨౨) మాఘశుద్ధ పంచమి మొదలు ఆశుద్ధసప్తమివరకీవ్రతముసేయవలయు. అది మొదలు పదమూడుమాసములకు వ్రతముసంపూర్తియగు - ఇందు సూర్యుడు పూజింపబడు.

ఫలసప్తమీవ్రతము—బ్రహ్మకీశ్వరుడుచెప్పుట. సం - అ - ౭౬.

(౨౩) మార్గశీర్షశుద్ధపంచమి మొదలు ఆశుద్ధసప్తమివరకీవ్రతనియమము. దీనినిబదమూడుమాసములు సేయవలయు. ఇందు సగాసూర్యుడుపూజింపబడు.

శర్కరాసప్తమీవ్రతము—బ్రహ్మకీశ్వరుడుచెప్పుట. సం - అ - ౭౭.

(౨౪) ఇదిమాఘశుద్ధసప్తమిం జేయబడునది. అది మొదలు పదమూడుమాసములకుదీరును. అధిదేవత సూర్యుండు.

కమలసప్తమీవ్రతము—బ్రహ్మకీశ్వరుడుచెప్పుట. సం - అ - ౭౮.

(౨౫) చైత్రశుద్ధసప్తమి మొదలు పదమూడుమాసములు దీనిం జేయవలయు. సూర్యుని నియమబూజింపవలయు.

మందారసప్తమీవ్రతము—బ్రహ్మకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౭౯.

(౨౬) మాఘశుద్ధపంచమి మొదలు ఆశుద్ధసప్తమివరకు నియమము. పదమూడు నెలలుదీనిచే సూర్యునిబూజింపవలయు.

శుభసప్తమీవ్రతము—బ్రహ్మకీశ్వరుడుచెప్పుట. సం - అ - ౮౦.

(౨౭) ఆశ్వయుజ శుద్ధసప్తమి మొదలు పదమూడుమాసము లీవ్రతమున సూర్యునిబూజింపవలయు.

విశోకద్వాదశీవ్రతము—బ్రహ్మకీశ్వరుడుచెప్పుట. సం - అ - ౮౧.

(౨౮) ఆశ్వయుజశుద్ధ దశమి మొదలు ఆశుద్ధద్వాదశివరకీవ్రతనియమము. ఇదిపదమూడుమాసముల కుద్యాపనయగు. ఇందులక్ష్మీనారాయణులు బూజింపబడుదురు, కావున నిది లక్ష్మీకరమైనది.

ఇందొక విశేషంబుగలదు. మానవులు, గుడధేనువు, ఘృతధేనువు, తిలధేనువు, జలధేనువు, రసధేనువు, ధాన్యధేనువు, శర్కరాధేనువు, లవణధేనువు, రత్నధేనువు, ప్రత్యక్షధేనువు, వీటిని అయనాదిపుణ్యకాలములయందు కల్పోక్తప్రకారముదానముసేసిరేని నిహంబున సకలసౌఖ్యంబులనుభవించిపరంబునవిష్ణులోకంబునొందెదరు.

మేరుపర్వతదానము—నారదునకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౮౨.

౩౦౦ ద్రోణములు మొదలు ౧౦౦౦ ద్రోణములవరకు శక్త్యనుసారము ధాన్యముచే మేరుపర్వతమును, దీనికి తూర్పున నాలవభాగము ధాన్యముచే మందరమును, దక్షిణంబున గోధూమములచే గంధమాదనమును, పశ్చిమంబున తిలలచే తిలపర్వతమును, ఉత్తరంబున మాషములచే సుపార్శ్వపర్వతమును, నిర్మించి కల్పోక్తప్రకారము దానముసేసిన సురపూజితంబగు లోకంబులను పొందెదరు.

లవణపర్వతదానము—నారమనకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౮౩.

లవణము నాలుగుద్రోణములు మొదలు పదియారు ద్రోణములవరకు కల్పోక్తప్రకారము దానముచేసిన పార్వతీసాన్నిధ్యమున వసించెదరు.

గుడపర్వతదానము—నారమనకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౮౪.

గుడము మూడుబారువలు మొదలు పదిబారువులవరకు కల్పోక్తప్రకారము దానముచేసిన పశుపతిసతీ సాన్నిధ్యమున వసించెదరు.

స్వర్ణ పర్వతదానము—నారదునకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౮౫.

ఇన్నూటయేబది పలములు మొదలు వేయుపలముల సువర్ణమును దానముచేసిన బ్రహ్మపదప్రాప్తిగలుగు.

తిలపర్వతదానము—నారమన కీశ్వరుడు చెప్పుట సం - అ - ౮౬.

తిలలుమూడుద్రోణములు మొదలు పదిద్రోణములవరకు దానముచేసిన స్వర్గప్రాప్తియగు.

కార్పాసపర్వతదానము—నారమన కీశ్వరుడు చెప్పుట. సం - అ - ౮౭.

కార్పాసమనగా (ప్రత్తి.) ఐదుబారువలు మొదలిరువది బారువులవరకు దానముచేసిన రుద్రలోకప్రాప్తియగు.

ఘృతపర్వతదానము—నారదునకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౮౮.

ఐదుకుంభములు మొదలిరువదికుంభములవరకు ఘృతపర్వతదానముచేసిన శివలోకప్రాప్తియగు.

రత్నపర్వతదానము—నారదున కీశ్వరుడు చెప్పుట. సం - అ - ౮౯.

మున్నూరుపలములు మొదలు వేయుపలములవరకు రత్నపర్వతదానము సేసిన బ్రహ్మహత్యాది పాతకంబులు నశించి విష్ణులోకముగలుగు.

రౌప్యపర్వతదానము—నారదునకీశ్వరుడు చెప్పుట. సం-అ-౯౦.

౨౫౦౦ పలములు మొదలు ౧౦౦౦౦ పలములవరకు రౌప్యపర్వతదానము చేసిన శివలోకము గలుగు.

శర్కరాపర్వతదానము—నారదునకీశ్వరుడు చెప్పుట. సం-అ-౯౧.

రెండు బారువలు మొదలెనిమిది బారువలవరకు శర్కరాపర్వతదానము చేసిన గౌరీపతిలోకము ప్రాప్తియగు.

ఇటుల జేయు పర్వతదానములయందు ప్రతిపర్వతమునకు నాలవ భాగమునొక్కొక విష్కంభ పర్వతమును నాలుగు దిక్కుల నిర్మించి దానము చేయవలయు. ఇందొక యితిహాసంబు గలదు వివరించెద వినుడు. గతబృహత్కల్పమున ధర్మమూర్తియను నొకరాజు గలడు. ఆరాజేంద్రుడనేక రక్కసులను కుమ్మాపుటం జేసి యాతనికి నింద్రుండు మిత్రుడయ్యె. అతనికి భానుమతియను భార్యకలదు. ఆతడొకదివసంబున సింహాసనాసీనుండై తనపురోహితుడగు వసిష్ఠుంగాంచి మహాత్మా! నేనే పుణ్యవ్రతంబు జేసితి? నాకిట్టి సంపదయు, సౌందర్యంబెటుల గలిగె? వివరింపుమన వసిష్ఠుండిట్లనియె. ఓరాజా! పూర్వంబున శివభక్తిగల లీలావతియనునొక వేశ్యకలదు. అది చతుర్దశీ దివసంబున హేమవృక్షసురయుక్తంబగు లవణపర్వతంబును విధిపూర్వకముగ తనగురువుకు దానంబొసంగె. నీవు పూర్వజన్మమున బంగరుపనుల జేయు సొండుడని పేర్కొనంబడి యాలీలావతి దానము చేయుటకు స్వర్ణవృక్షములను దేవవిగ్రహములను భక్తిపూర్వముగ జేసియిచ్చి దానికి భృతకముగైకొనకుండుటం జేసి మిగుల సంపదయు సౌందర్యముగలవాడవై సప్తద్వీపాధిపత్యమును వహించితివి. అకాలంబున నీభార్య నీకు సహకారిగ నుండుటంబట్టి ఇపుడాయమ నీకు కళత్రంబై రూపలావణ్యాది సుగుణములచే నొప్పుచు స్త్రీలకధిపతిగానున్నయది - కావున నీవిపుడు ధాన్యాదిపర్వత దశకంబును దానంబొసంగుమనిన రాజు తనగురువునకు నమస్కరించి అద్దానంబులొసంగి శివలోకంబుం జేరె. గాన నీపర్వత దాన దర్శనంబున సకలైశ్వర్యంబులు గలుగు. దానిజేసిన వాని ఫలంబు వచింప నేరికి శక్యముగాదు.

గ్రహయజ్ఞవిధి, అయుతహోమము, లక్షహోమము, వీనిని శౌనకునకు వైశంపాయనుడు చెప్పుట. సం-అ-౯౨.

వీనిని జేయుటవలన శత్రునాశము గలుగుటయగాక ఆయురారోగ్యయుక్తుడై పుణ్యలోకములనొందు. సంస్కృతమును చూడుడు.

నవగ్రహస్వరూపము—నారదునకీశ్వరుడు చెప్పుట. సం - అ - ౯౩.

వీటిస్వరూపములను సంస్కృతముచూచిన తేటపడును.

శివచతుర్దశీవ్రతము- నారదునకునందీశ్వరుడు చెప్పుట - సం - అ - ౯౪.

మార్గశీర్ష శుక్లత్రయోదశిని నేకభక్తము జేసి చతుర్దశిని నిరాహారుడై శివుని పూజించి స్వర్ణవృషభమును దానముసేసి పూర్ణిమయందు భుజింపవలయు - ఇటు లపండ్రెండు మార్గశీర్షమాసములలో ప్రతిచతుర్దశిని గోమూత్రము - గోమయము- గోక్షీరము-గోదధి- గోఘృతము - కుశోదకము - పంచగవ్యము - బిల్వము- కర్పూ రము- అగరు- యవలు - నల్లనువ్వులు - వీనినిమాసక్రమముగ భక్షించికల్పోక్త ప్ర కారము వ్రతసంపూర్ణముసేసిన తనపితరులుసోదరులు చేసినపాపమునశించుటయ గాక వేయు యశ్వమేధఫలము శివలోక ప్రాప్తియుం గలుగు - ఈవ్రతమును స్త్రీ లుసగా యాచరింపందగు.

ఫలత్యాగవ్రతము- నారదునకునందీశ్వరుడు చెప్పుట - సం - అ - ౯౫.

మార్గశీర్ష శుక్లతదియ-అష్టమి-ద్వాదశి-చతుర్దశి-యీతిథులలోనేతిథియందైన నసీవ్రతముచేయుటయుక్తము - అదిగాక పుణ్యకరములగు మాసములయందును ప్రా రంభింపవచ్చును. కల్పోక్తప్రకారమీవ్రతము చేసినశివలోక వాసుడగు.

ఆదివారనక్తవ్రతము- నారదునకునందీశ్వరుడు చెప్పుట - సం - అ - ౯౬.

శనివారమునసేక భక్తుడైహస్తానక్షత్రయుక్త ఆదివారమున కల్పోక్తప్రకా రము సూర్యునారాధించి రాత్రిభోజనముచేయవలయు- ఇటులొకవత్సరంబు సలి పినమనుజుడు దురితదూరుడై సూర్యలోకవాసియగు.

సంక్రాంత్యుద్యాపనవ్రతము - నారదునకునందీశ్వరుడు చెప్పుట - సం - అ - ౯౭.

దీని విషువత్పుణ్యకాలమందైన ఉత్తరాయణపుణ్యకాలమందైన యాచరిం పవలయు- ఒకసంవత్సరము సూర్యునారాధించిన సప్తద్వీపయుక్త భూదానఫలము గలుగు.

విభూతిద్వాదశీవ్రతము - నారదునకునందీశ్వరుడు చెప్పుట - సం - అ - ౯౮.

చైత్రవైశాఖకార్తిక మార్గశీర్షఫాల్గునాషాఢమాసముల శుక్లదశిమిని యేకభ క్తముచేసిమరుదినమునిరాహారుడై ద్వాదశిని బ్రాహ్మణులతోడ భోజనముచేసెదన ని ప్రతిజ్ఞచేసి యొకవత్సరంబటులసలిపి కల్పోక్తప్రకారము విష్ణునిపూజించికడపట

లవణపర్వతయుక్తమైన శయ్యాదానముసేసిన సహస్రయుగపర్యంతము స్వర్గలోకమునవసించు. ఇందొక యితిహాసముకలదు. తొల్లి రాథంతరకల్పమున పుష్పవాహనుడను పార్థివుడు బ్రహ్మంగూర్చి తపంబుసలిపె. యాతని తపంబునకు కమలజుడుమెచ్చి స్వేచ్ఛాసంచార శక్తిగల నొక కనక కమలము నొసంగె. పిదపనారాజు తనపురవాసులు పరిజనులసయితము సప్తద్వీపములను దేవలోకములను తన యిచ్ఛకొలది సంచరింపుచు కల్పాదియందు నేడవద్వీపమును జేరిన నాద్వీపవాసులాపుష్పమును పూజించుటచే దానికి పుష్కరద్వీపమని పేరువాటిల్లె. అతని కాపుష్పము లభించుటచే పుష్పవాహనుడనంబఱగె. ఆపుష్పవాహనుని కనేకవనితలుసేవింపబడు సౌందర్యాతిశయములుగల లావణ్యవతియను భార్యగలదు. అవ్వనితకు పుష్పవాహనునివలన మిగుల బలపరాక్రమముగల పదివేవురుసుతులు జనించిరి. ఇట్టిభార్యాపుత్రుల నాలోకించి మిగుల యాశ్చర్యముగలవాడై అభ్యాగతుడుగ వచ్చిన ప్రచేతస్సుండను మునివర్యునిగాంచి యోమహాత్మా! నాకిట్టిసంపదకలుగుటకు కారణంబెద్ది? ఇది యెవరిపుణ్యఫలంబో వివరింపుమనిన ప్రచేతస్సుండిట్లనియె. ఓరాజా! పూర్వమునీవు బోయకులంబునజన్మించి విముఖియనుభార్యంగూడి అతిభయంకరుడవై పాపంబు లొనరింపుచుండుతఱి అనావృష్టి సంభవించె. అట్టి క్షామకాలంబున క్షుత్పిపాసచే యాహారంబఱయుచు దారినొక తామరకొలనుంగాంచియందరిగి యాపువ్వులంగోసి వానివిక్రయించి వాని మూల్యముచే జీవించుకొఱకు వైదిశపురంబుజేరితివిగాని యచట నాపువ్వులుగొనువారులేమింజేసి వేసరి సూర్యుడస్తమించిన పిదప నొకస్థలంబున విశ్రమించియుండ సమీపంబునజరిగెడిమంగళధ్వనులవిని భార్యతోడ నచటికేగి యందు అనంగవతియను వేశ్యవిభూతిద్వాదశీవ్రతముసలిపి యందు విష్ణుపూజం గావింపుచుండ నీవాపూజంగాంచి యిట్టి సత్కార్యముల కుపయోగించని యీపువ్వులు మనచేనుండి ననేమి ప్రయోజనంబని దలంచి పువ్వులన్నియు యావేశ్యచేబూజింపబడు విష్ణువుకొసంగి నిద్రాహారంబులు వర్జించియుండితిరి. మరుదినముదయమున యావేశ్య లవణపర్వతశయ్యా దానాదుల గురునకొసంగి బంధుమిత్ర సహితముగ భుజించి మిమ్మునుసగా భోజనాదులచే దృప్తింగావించె. కావున కమలములచే విష్ణుపూజాదులను నీవుచేసినందున యాఫలంబున నీవిట్టి రాజకులంబునజనించి పుష్పవాహనుడను ఖ్యాతినొందితివి. అప్పటిభార్యే యిపుడుసగా నీకుకళత్రంబుగానున్నయది. ఆవ్రతపూజా మహిమచేకామగమంబగు బంగరు తామరపువ్వును బ్రహ్మ నీకొసంగె. ఆయనంగవతి మన్మథునికి భార్యయై రతీదేవికి సవతిగానున్నయది. కావున నోరాజోత్తమా! నీవుగంగాతీరంబుజేరి విభూతి ద్వాదశీవ్రతము జేయుమని యానతిచ్చి మునిపుంగవుం డంతర్ధానమునొందె. తోడనేపుష్పవాహనుడు నీవ్రతమునుసలిపి యఖండఫలంబునొందె.

# శ్రీ మత్స్యపురాణసారసంగ్రహము.

## దేవవ్రతము మొదలఱువదియొకవ్రతములను నారదునకు నందీశ్వరుడు చెప్పుట. సం - అ - ౯౯.

దేవవ్రతము - ౧ - రుద్రవ్రతము - ౨ - వీరవ్రతము - ౩ - ప్రీతివ్రతము - ౪ - గౌరీవ్రతము - ౫ - కామవ్రతము - ౬ - శివవ్రతము - ౭ - సౌమ్యవ్రతము - ౮ - సౌభాగ్యవ్రతము - ౯ - సారస్వతవ్రతము - ౧౦ - సంపద్వ్రతము - ౧౧ - శుద్ధివ్రతము - ౧౨ - కీర్తివ్రతము - ౧౩ - కామధుగ్వ్రతము - ౧౪ - వీరవ్రతము - ౧౫ - పితృవ్రతము - ౧౬ - ఆనందవ్రతము - ౧౭ - రాజ్యవ్రతము - ౧౮ - అహింసావ్రతము - ౧౯ - సూర్యవ్రతము - ౨౦ - విష్ణువ్రతము - ౨౧ - శీలవ్రతము - ౨౨ - దీపవ్రతము - ౨౩ - గౌరీవ్రతము - ౨౪ - దీప్యవ్రతము - ౨౫ - కాంతివ్రతము - ౨౬ - బ్రహ్మవ్రతము - ౨౭ - సువ్రతము - ౨౮ - కల్పవ్రతము - ౨౯ - భీమవ్రతము - ౩౦ - ధరావ్రతము - ౩౧ - మహావ్రతము - ౩౨ - ప్రభావ్రతము - ౩౩ - ప్రాప్తివ్రతము - ౩౪ - సుగతివ్రతము - ౩౫ - వైశ్వానరవ్రతము - ౩౬ - కృష్ణవ్రతము - ౩౭ - దేవీవ్రతము - ౩౮ - భానువ్రతము - ౩౯ - వినాయకవ్రతము - ౪౦ - కాలవ్రతము - ౪౧ - సౌరవ్రతము - ౪౨ - నారాయణవ్రతము - ౪౩ - వృషవ్రతము - ౪౪ - ప్రాజాపత్యవ్రతము - ౪౫ - త్రియంబకవ్రతము - ౪౬ ఘృతవ్రతము - ౪౭ - ఇంద్రవ్రతము - ౪౮ - సదాశివవ్రతము - ౪౯ - అశ్వవ్రతము - ౫౦ - గజవ్రతము - ౫౧ - నిర్దుఃఖవ్రతము - ౫౨ - వరుణవ్రతము - ౫౩ - చంద్రవ్రతము - ౫౪ - రుద్రవ్రతము - ౫౫ - భవానీవ్రతము - ౫౬ - స్థాపకవ్రతము - ౫౭ - ధామవ్రతము - ౫౮ - సోమవ్రతము - ౫౯ - శిఖవ్రతము - ౬౦ - విప్రవ్రతము - ౬౧ - ఈవ్రతములన్నియు మిగులను త్తమములు. వీటిలో దేవవ్రతము మొదలు పదునేనిమిదివ్రతములు శివలోకప్రదములు. వీరవ్రతము మొదలు ౧౦ వ్రతములు విష్ణులోకప్రదంబులు - గౌరీవ్రతము మొదలైదువ్రతములు గౌరీలోకప్రదంబులు - సౌమ్య, విప్రవ్రతములు, రెండు శివవిష్ణులోకప్రదంబులు - ఆనందవ్రతము మొదలు తొమ్మిదివ్రతములు బ్రహ్మలోక ప్రదంబులు - సూర్య, భాను, సౌర, ధామవ్రతములు నాలుగు సూర్యలోకప్రదంబులు - ఇంద్రవ్రతము మొదలైదువ్రతంబులింద్రలోకప్రదంబులు- దీప్య, వరుణవ్రతములు రెండు వరుణలోకప్రదంబులు - శిఖవ్రతమగ్నిలోకప్రాప్తికరమగు-చంద్రవ్రతము చంద్రలోకప్రాప్తికరమగు, నిర్దుఃఖవ్రతము చేయమౌధిపత్యంబొనగూడు - సారస్వతవ్రతము సరస్వతీలోకంబునిచ్చు. దేవీవ్రతము లక్ష్మీలోకంబునొసంగు - కీర్తివ్రతము, భూతికీర్తులనిచ్చు. కావునసీవ్రతముల నే మానవుడైనకల్పోక్తప్రకారంబుగ జేసినవానికిహంబున సకలైశ్వర్య సంపదలుగలుగుటయగాక పరంబున నాయాదేవతలోకంబు సమకూడు.

స్నానవిధి - నారదునకునందీశ్వరుడుచెప్పుట - సం - అ - ౧౦౦.

మానవుడు నదీతటాకాదులయందును అందుండిగొనివచ్చినజలమునందును స్నానముచేయునపుడు“నమోనారాయణాయ”అనుమూలమంత్రమునుస్మరించిదర్భపాణియై మూడుమారులాచమనముచేసి “విష్ణుపాదప్రసూతాసి” అనుపురాణమంత్రముల నేడుపర్యాయములు జపించిదోసిలియం దుదకమునునిడికొని మైదుపర్యాయములుశిరమునప్రోక్షించుకొని “అశ్వక్రాంతే, మృత్తికేహర,ఉద్ధృతాసి” అనుమంత్రములజెప్పుచు మృత్తికను శరీరమునకలదుకొని స్నానముచేయవలయు - పిదపధౌతవస్త్రమునుధరించి దేవాదులతృప్తికి సవ్యముగాను సనకాదులతృప్తికి ఉపవీతముగాను అగ్నిష్వాత్తాదులు,పితరులు, వీరితృప్తికి గోత్రనామంబులతోడ యపసవ్యముగాను తర్పణముసేయవలయు - పిదపసూర్యుని పూజించి బ్రాహ్మణునిగోవును బంగరును స్పృశించివిష్ణుపూజచేయవలయు.

ప్రయాగమాహాత్మ్యము.

ధర్మరాజునకుమార్కండేయుడుసెప్పుట - సం - ౧౦౧ - మొ - ౧౧౦ - వ.

భారతయుద్ధంబు కడచినపిదప ధర్మరాజు రాజ్యమునుపొంది భ్రాతృవియోగసంతప్తుడై. అయ్యయో, పదునొకొండక్షోహిణీలకు పతియగుదుర్యోధనుడుమడిసె. వాసుదేవుని కృపచేబాండవులమగు మేమయిదుగురము జీవించితిమి- గురువులగు భీష్మద్రోణాదులను జంపితిమి - కావుననిట్టిరాజభోగంబు నాకేలనని వచించి దుఃఖించుచు నాపాపము బోవుట కుపాయంబెద్దియని చింతించుచుండుతఱి మార్కండేయు డేతెంచిననర్ఘ్యపాద్యాది పూజలొనర్చి యోమునివర్యా! నాపాపంబు బోవునుపాయంబు దెలుపుమని వేడిన నమ్మునియిట్లనియె. క్షత్రియుండవగునీవు సంగరమొనర్చుటచే బాపముసోకదు - ఐనప్రయాగగమనంబు సేయుము నీమనంబు పరిశుద్ధమగునని జెప్పినధర్మజుం డదినాకెరుగింపుమనిన యాతడిట్లనియె. ప్రయాగమొదలు ప్రతిష్ఠానపురమువరకును వాసుకిహ్రదము మొదలు కంబళాశ్వతర బహుమూలసర్పములవరకును, మధ్యనుండునది ప్రజాపతిక్షేత్రమనబడు. అచటస్నానము జేసినవారికిస్వర్గముగలుగుటయగాక మరణమునొందిన వారికిపునర్జన్మము లేదు- బ్రహ్మాదిదేవతలాక్షేత్రమును నెల్లప్పుడు రక్షణచేయుచుండెదరు. ఆస్థలంబునగలతీర్థముల లెక్కింపశక్యముగాదు - (౬౦౦౦౦) ధనుస్సుల పరిమాణముగల జాహ్నవియమునానదులను సూర్యుడురక్షించుచుండు - ప్రయాగను దానిమండలమును వటవృక్షమును శివుడును- స్నానఫలంబును దేవతలును రక్షించెదరు-ప్రయాగను స్మరించినమాత్రంబున సకలదురితంబులుబాయు - పాపులకు ప్రయాగగమనంబు వాటిల్లదు-ప్రయాగదర్శనస్పర్శన మృత్తికలేపనంబులచే బాపహరంబగు - అందైదుపర్వతం

బులుగలవు. మధ్యగంగానదియున్నయది. సహస్రయోజనంబుల దూరమునుండి గంగను స్మరించెడి వానిపాపంబులునశించు. అందు గ్రుంకిన సప్తపూరుష పర్యంతము ముక్తిగను. గంగా యమునాసంగమంబున నొకమాసంబువసించి పితృతర్పణం బొసంగెనేని యిష్టకామంబులు సమకూరు. అచట శివుడు వాసము సేయుచుండు. దేవదానవులందరుదాని స్పృశించి స్వర్గలోకవాసులైరి-అట్టితీర్థంబునగ్రుంకిన వారలుయనేకపుణ్యలోకఫలంబు లనుభవించిపిదప జంబూద్వీపాధిపతులగుదురు-అచటకపిలధేనుదానంబుజేసెడివాడు తద్గోరోమ సంఖ్యాకసహస్రవత్సరంబులు స్వర్గఫలంబనుభవించి పిదప నుత్తరకురుదేశంబుల జనించు. కావున లక్షగోదానంబులు చేయుటకంటే ప్రయాగంబున నొకదానంబు చేయుటచే నెక్కుడుఫలంబుగలుగు - ఈయాత్రనపేక్షించెడివాడు వాహనాదుల వర్జింపవలయు - వాహనారోహణముజేసిన తాజేయుక్రియలు పితరులకు తృప్తికరంబులుగావు - అచటకన్యాదానముచేయువారు పాపంబులనుబాసి యుత్తరకురుదేశంబుల జనించెదరు - దానిఫలంబుచే తీర్థఫలంబతిశయిల్లు - వటమూలంబున మరణంబునొందిన శివలోకప్రాప్తియగు - ద్వాదశాదిత్యులు ప్రపంచమునుదహించునెడ వటమూలమునశించదు - మహాప్రళయంబున విష్ణువు యావృతుంబున నిద్రించు - గంగా యమునలమధ్య మకర మాసంబున స్నానముసేయువానికి రాజసూయాశ్వమేధఫలంబులు సమకూరు - ఈప్రయాగంబున (౧౬౦) కోట్లసహస్రతీర్థంబులుగలవు. బ్రహ్మవేత్తకెట్టిఫలముగలదో అట్టిఫలము ప్రయాగయందు మరణమునొందెడివానికికలదు - యమునాదక్షిణతటంబుననుండు కంబళాశ్వతరక్షేత్రంబున స్నానముచేసిన పాపవిముక్తుడగు - అందు సమీపవర్తియగుమహాదేవస్థానంబున మృతిజెందిన ముందు వెనుకటి యిరువదితరముల పితరులు తరించెదరు-గంగా పూర్వభాగంబున సముద్రోదకయుక్తంబగు కూపంబుగలదు-అందు మూడురాత్రులువసించినను అందుత్తరభాగంబునహంసప్రపతనంబను తీర్థంబుగలదందు స్నానముచేసినను - అశ్వమేధఫలంబుగలుగుటయగాక సూర్యచంద్రములుండువరకు స్వర్గభోగంబులనుభవింతురు - ఇటులపుణ్యఫలంబులనిచ్చెడియనేకమహాస్థలంబు లున్నయవి. వాటిని జెప్పుటకు శక్యంబుగాదు. సూర్యపుత్రియగు యమునయందు స్నానముచేసినవాని పితరు లేడు పురుషులవరకు తరింతురు - మఱియు యమునానదికి దక్షిణోత్తరములయందు అగ్నితీర్థము ధర్మరాజతీర్థమను రెండుతీర్థములున్నయవి - ఉత్తరముననిరంజనాది తీర్థములనేకములుకలవు - అవియును మిగులపుణ్యతమంబులు. కావుననచటికేగి యాతీర్థములగ్రుంకుము. గంగపెద్దదియగుటచే ముందుదాని పూజింపుము - అని చెప్పినధర్మజుడు మహాత్మా! నైమిశారణ్యంబునననేకతీర్థములుండగ ప్రయాగతీర్థంబు నెక్కుడుస్తోత్రముచేసెదవు-దానిమాహాత్మ్యమునుమటిల చెలుపుమనిన ధర్మజునకుమార్కండేయుండిట్లనియె. ఓయుధిష్ఠిరుడా!

వేయిజన్మముల కొకజన్మనుమాత్రము మనుజుడు యోగమునుపొందు- ఇటులవేయు మారులు యోగాభ్యాసముచేసెనేనియూ యోగముసిద్ధించు - అట్టిధర్మము ప్రయాగయందు స్నానముచేయుటచే సులభముగగలుగు - నీవచటికేగి స్నానముచేయుము పుణ్యలోకంబులు నీకులభించు. ఈప్రయాగకుత్తరంబుననుండు ప్రతిష్ఠానమే బ్రహ్మస్వరూపము. వటవృక్షము శివస్వరూపము - దేవతలందరచటనే వసింపుచుందెదరు - అని చెప్పినధర్మనందనుండు ద్రౌపదీసహితుడై తమ్ములతోడప్రయాగకుజనిస్నానముసేసి జపతపహోమాదికములనుదీర్చి బ్రాహ్మణులకును గురు దేవాదులకును తృప్తినొనర్చియుండు నవసరంబున కృష్ణుండచటికేగి భీమాదులతోడనభిషేకంబుగావించి నంతమార్కండేయుం డాశీర్వదించి తనయాశ్రమంబునకేగె- పిదపధర్మరాజు షోడశమహాదానంబు లొసంగిసుఖంబుననుండె - అంతనందీశ్వరుడు నారదుంగాంచి నీవుప్రయాగదర్శనంబు జేయుమని చెప్పియంతర్ధానంబునొందె. నారదుండును ప్రయాగగమనంబుసేసె - ఈప్రయాగమాహాత్మ్యంబును ప్రాతఃకాలంబుననేమానవుడైన పఠించినను వినినను స్వర్గవాసియగు.

భూగోళవర్ణనము-సం-అ- ౧౧౧-మొదలు-౧౨౨-వరకు.

అని చెప్పినమునులు సూతుంగాంచి మనువుకు మత్స్యుడు చెప్పిన భూవిస్తారతెఱం గెరింగింపుమని యడిగిన సూతుండిట్లనియె. ఈభూమండలం బేబదికోట్లవిస్తీర్ణంబుగలిగి - లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, జలసముద్రముల చేతను జంబు, ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శాక, పుష్కరద్వీపముల చేతను వెలయుచున్నదనిన మునులుసూతుంగాంచి మహాత్మా! ద్వీపంబులు, సముద్రంబులు, పర్వతంబులు, వర్షంబులు, నదులు, మహాభూతప్రమాణంబు, లోకాలోకపర్వతము సూర్యచంద్రగమనంబులు వీనిం దెలుపుమనివేడిన సూతుండిట్టుల పకాశించె. పంచాశత్కోటివిస్తీర్ణంబగు నీభూమండలంబున ననేకద్వీపంబులునునేకఖండంబులునుగలవు అయినసూర్యచంద్రగ్రహ యుక్తములగు నేడుద్వీపములవివరించెద-అట్టిద్వీపములలో సప్తవర్షంబునందు నీజంబూద్వీపమునుమున్ను వకాణించెదవినుడు-ఈజంబూద్వీపమునూరు వేలయోజనముల విస్తీర్ణముగలది-ఇది దేవతలు, సిద్ధులు, చారణులు, పర్వతములు, నదులు మొదలగువానిచే ప్రకాశింపుచుండు - మఱియునీద్వీపములకును వర్షములకును హద్దులుగ హిమవంతము హేమకూటము సుముఖము నిషధము చాతుర్వర్ణము మేరువు అనుపర్వతములు పూర్వపశ్చిమ సముద్రములయందు మునిగియున్నవి- అందు మేరువుయిరువదినాలుగు వేల యోజనముల విస్తీర్ణము గలిగియుండు- ఇది యిలావృతవర్షంబునకు మధ్యను దక్షిణదిక్కుకు హద్దుగానుండు - ఇటులనే తక్కినపర్వతంబులతోడను ద్వీపంబులునుకలిసి మెరయుచుండుననిచెప్పిన సూతుంగాంచి భారతవర్షవివరణమును వివరింపుమని మునులువేడిన సూతుండిట్లనియె.

## భారతవర్షవర్ణనము.

భారతవర్షము భూమధ్యప్రదేశంబున నున్నయది - ఈవర్షము ప్రజలభరించుటచే నిది భారతవర్షమని పేర్కొనంబడియె-ఇందు ధర్మార్థ కామమోక్షములు జేకూరు - ఇదియకర్మభూమి - మఱియుదీనియందు ఇంద్రము, కశేరువు, తామ్రపర్ణము, గభస్తిమత్తు, నాగము, సౌమ్యము, గంధర్వము, వారుణము, భారతము, అను తొమ్మిదిద్వీపములుగలవు - ఈద్వీపములకు కన్యాకుమారి గంగానది యుత్పత్తిస్థానము హద్దులుగానున్నయవి. ఇది తొమ్మిదివేలయోజనముల పరిమాణముకలిగి వాని యాద్యంతములయందు యవనకిరాతకమ్లేచ్ఛులచేతను మధ్యప్రదేశంబున బ్రహ్మక్షత్త్ర వైశ్య శూద్రాదులచేతను మహేంద్రాది సప్తపర్వతంబులచేతను మెరయుచుండు. ఆర్యమ్లేచ్ఛాదిదేశవాసులు గంగాది పుణ్యనదులజలంబును పానంబుజేసి మిగుల సుఖంబుగనుండెదరు. కింపురుషవర్షంబున జనులుజంబూఫలంబులను భక్షించి స్వర్ణచ్ఛాయంగలిగి (౧౦౦౦౦) వేలవత్సరంబులు జీవించెదరు. భారతవర్షంబునకుపరి హరివర్షముగలదు. స్వర్గంబున క్షీణపుణ్యులై భూమిని జనించెడివారందరు హరివర్షంబునబుట్టి రౌప్యచ్ఛాయగలవారై ఇక్షురసంబుగ్రోలుచు ముదిమిలేక పదునొకవేల వత్సరంబులు జీవించెదరు. వీనికిమధ్య నిలావృత వర్షంబుగలదు. అది సూర్యచంద్ర పవనానలంబులు లేకయుండును- అచటజనించెడివారు తామరపువ్వులవన్నెగలవారై పదిమూడువేలవత్సరంబులు రోగవర్జితులై జీవించెదరు - అచటజంబూఫలరసముచే నుత్పన్నంబైన జంబూనది మేరువుకు ప్రదక్షిణంబుగ ప్రవహించుచుండుగావున నారసమును గ్రోలి స్వర్ణచ్ఛాయచే నొప్పుచు క్షుత్పిపాసావర్జితులై సుఖంబుగనుండెదరు - అచటిజంబూనదంబున స్వర్ణముఫలించు. మేరుపర్వతంబున నింద్రాది సకలదేవతలువసించెదరు.

## పురూరవునిపూర్వచరిత్రము.

అనినమనువు మత్స్యంగాంచి పురూరవుని చరిత్రమును వివరింపుమని వేడినయిట్లువకాణించెనని సూతుండు మునులకువివరింపదొడంగె. పూర్వము చాక్షుషమన్వంతరమున మద్రపతియగు పురూరవుండు సమస్తరాజ లక్షణలక్షితుండును శత్రుపురజేతయయినను రూపవర్జితుండుగానుండెనన్నిన మునులతనికేపుణ్యకతంబున రూపంబుగలిగె? మొదటవిరూపియగుటకు కారణంబెద్ది? వివరింపుమనిన వారింజూచి సూతుండిట్లనియె - అతనుపూర్వంబున బ్రహ్మకులజనితుడై యాజన్మమును గడిపి మఱల క్షత్రియకులంబునజనించి మద్రదేశాధిపత్యమును వహించె, అయిననతడు తనపూర్వజన్మంబున ప్రతియేకాదశులయం దుపవాసముసలిపి ద్వాదశిని విష్ణుపూజలం జేయుచుండె. ఇట్లువర్తింపుచు ద్వాదశులయం దభ్యంగనస్నానము సలుపుచువచ్చినం

దున వైరూప్యము, విష్ణుపూజచే మద్రదేశాధిపత్యము, లభించెంగావున జనులువ్రతోపవాసముసేసి పారణదివసంబున యభ్యంగనముజేయంజనదు. కురూపియగు తనయందు ప్రజలకనురాగంబులేమింజేసి తపంబుచే రూపంబువడయుటకు సమకట్టి తనరాజ్యంబును మంత్రికొప్పించి పాదచారియై హిమవంతంబునకేగి యతిపవిత్రంబగు అత్రిమహాముని యాశ్రమంబుజేరి యందొకచో స్వర్ణరజితరత్నాదులచేతను, అనేకవృక్షలతాదులచేతను, నిబిడీకృతంబై మెరయుచున్న యొకసరోవరంబుంగాంచి దానిసమీపంబునందుగల బిలంబుంజొచ్చి దానికావలనొండొక సరసీ మధ్యప్రదేశంబున నవరత్ననిర్మితంబై ప్రకాశింపుచుండెడి యుప్పరిగెంజూచి యచటికేగి శేషతల్పంబున పవ్వళించియున్న విష్ణుంగని నమస్కరించి సహస్రనామంబులంబొగడి దానిసమీపవర్తియగు నొకవిజనస్థలంబునవిష్ణుంగూర్చి తపంబుసలుపుచుండె- అచటవసించెడి గంధర్వాదులతనింగాంచి రాజోత్తమా! స్వర్గసదృశంబగు నీప్రదేశంబున కెటులవచ్చితివి? నీకిష్టంబగు వరంబువేడుము? మేమిచ్చెదమని నుడివిరి. అందుకుపురూరవుండు విష్ణుదేవునియనుగ్రహంబు నాకుగలుగునటుల జేయుడని వేడిన యటులనొసంగిరి. పిదపనారాజు ముప్పదిదినములు విష్ణువు నారాధింపుచుండిన నొకరేయి విష్ణువుస్వప్నంబున ప్రసన్నుడై అత్రిముని రేపకడనీకడ కరుగుదెంచి నీకోరిక సఫలంబుజేయుననిచెప్పి తిరోధానంబునొందె - మరుదినముదయమున స్నానసంధ్యాది కృత్యంబులందీర్చికొని విష్ణుని పూజింపుచుండుతరి యత్రిమహాముని యేతెంచి దివ్యరూపంబొసంగె. కావున విష్ణుపూజచే బురూరవచక్రవర్తి సమస్తకోరికలనువడసి సుఖంబుననుండె.

## కైలాసాదిపర్వతములవివరణము.

ఈయాశ్రమంబున కుత్తరంబున త్రిపురారినివసింపుచుండు. హిమవత్పర్వతపృష్ఠభాగంబున కైలాసపర్వతముగలదు - అందనేక గుహ్యకులతోడ కుబేరుడువసించు - అందుగలసరోవరంబునుండి మందాకినియనునదంబు ప్రవహింపుచున్నయది - దానిదరిని చందనవనము సువేలపర్వతంబున కెదురుగా చంద్రప్రభలనుపర్వతములుగలవు - దానిసమీపంబున నచ్ఛోదంబనుసరస్సు దానియందుద్భవిల్లిన యచ్ఛోదయనునది దానితీరంబున చైత్రరథవనము వెలయు. చంద్రప్రభయనుపర్వతంబున యక్షసేనాధిపతియగు మాణిభద్రుండు వసింపుచుండు - శబలపర్వతమునకెదుట సూర్యప్రభయను వనంబుగలదు. దానియందు లోహితంబనకమలాకరంబున్నయది - అందుండి లౌహిత్యంబను నదంబువొడమె - ఆతీరంబన దేవారణ్యంబుగలదు - అందుమాణిధరుండను యక్షుడుగుహ్యక పరివేష్టితుడై వసింపుచుండెడిని - కైలాసంబునకు పశ్చిమంబున కకుద్మంతమనుపర్వతము.

లము. అదియ శివునిస్థానము. అందలి సరోవరంబునుండి బొడమిన నదియే సరయూనదియని పేర్కొనంబడియె - దానితీరంబున వైభ్రాజంబను వనంబుగలదు - అది కుబేరానుచరుండగు ప్రహేతి సుతుడగు బ్రహ్మధానునకి నివాసంబై యున్నది - దానికి వెనుక అరుణము, ముంజవంతము, అను రెండు పర్వతంబులుగలవు - ముంజ పర్వతము శివునినివాసస్థానము - అందలి శైలోదంబను సరోవరమునుండి వెడలిన నది శైలోదకమను నామముచే దక్షుసీతనదుల మధ్య ప్రవహించి సముద్రగామిని యయ్యె - కైలాసమున కుత్తరమున గౌరమనుపర్వతముగలదు - అందు కాంచన వాలుకమను పుష్కరిణియుండు - అదియు బిందు సరోవరంబనంబడు - ఇచటనే భగీరథు డనేకవత్సరంబులు తపంబు సలిపె - అచటగంగ సోమపాదంబునంబుట్టి సప్తవాహినులుగ ప్రవహించె - అదియ యంతరిక్షమును పవిత్రము చేసి భూమింబడసె. యోగమాయచేయాగంగ కట్టబడినందున గంగకోపించి శివునినిగ్రహించి పాతాళంబునకేగ సమకట్టిన ఈశ్వరుడు దానియాశయము దెలిసికొని బ్రహ్మవాక్యమును స్మరించి వదిలినందున నాగంగ యేడు ప్రవాహములుగ వెడలినళినీ, హ్లాదిని, పావనియను మూడు ప్రవాహములు తూర్పుదిక్కునకును - సీత, చక్షు, సింధు, అను మూడు ప్రవాహములు పశ్చిమదిక్కునకును ఏడవది భగీరథుని వెంబడించి దక్షిణదిక్కునకును ప్రవహించె - వీనియందనేక యుపనదులు పుట్టినవి - వస్వోకసారంబను నదీతీరంబున సురభియను వనంబుగలదు - అందు కుబేరానుచరుడగు హిరణ్యశృంగుడు బ్రహ్మరాక్షసవిద్యాధ్యబృందములతో డవసింపుచుండు - హేమకూటపర్వత జనితయగు సర్పసరస్సునుండి సరస్వతీనదియు, నిషధపర్వతంబున విష్ణుపదంబను సరసియుపుట్టె - దానియందుండి జనించిననదులకు గాంధారి, కులయను నామంబులుగలిగె - మేరుపార్శ్వంబున చంద్రప్రభయను హ్రదంబుగలదు - అందుండియుద్భవిల్లిననది జాంబూనదియనంబజగె - మఱియునచట పుండరీకపయోదంబను హ్రదంబుగలదు - దానియందు మేఘంబులుజనించు - హిమవత్పర్వతంబున కుత్తరంబున మానససరోవరంబుగలదు - ఆసరోవరంబున జ్యోత్స్నా, అమృత కాంత అనునదులుపుట్టె - మఱియు కురుదేశములయందు వైజయంబులను పేరుగల పద్రెండు హ్రదంబులుగలవు. వానియందు శాంతిసంధ్యలను రెండునదులు ప్రవహింపుచుండు - కింపురుషాద్యష్ట వర్షంబుల మేఘములు వర్షించుటలేదు - భూమియందుగల యుదకముచేతనే యిచటవసించెడివారికి తృప్తికలుగుచున్నయది - ఋషభ మైనాక బాలక వజ్రచంద్రకాంత ద్రోణసుమహత్తు చక్రరుధికర నారద జీమూత ద్రావణ మొదలగు పర్వతంబులు తూర్పు దక్షిణ పశ్చిమోత్తరసముద్రములయందు మునిగియున్నవి - వజ్రమైనాకపర్వతంబులకు మధ్యసంవర్తకంబను నగ్నిపర్వతము గలదు అదియుదకపానము చేయుచుండునని చెప్పిసూతుండు శాకద్వీప విస్తరంబును వివరింపందొడంగె.

శాకద్వీపంబు జంబూద్వీపద్విగుణవిస్తరంబును క్షీరోదధిపరివేష్టితంబును మేరువు మొదలగు సప్తపర్వతయుతంబును ఉదయాదిసప్తవర్ష సహితంబును సుకుమారాదిసప్తనదీయుక్తంబై నానావృక్షంబులచేతను శోభిల్లుచుండు- అందు త్రేతాయుగధర్మంబులు వెలయు - కుశద్వీపము శాకద్వీపద్విగుణవిస్తరంబై సురాంబోధిపరివేష్టితంబై కుముదాదిసప్తపర్వతయుక్తంబై కామాదిసప్తవర్ష పరివృతంబై ధూతపాపాదిసప్తనదీయుతంబై యొప్పు - క్రౌంచద్వీపము కుశద్వీపద్విగుణవిస్తరంబై ఘృతసముద్రపరివేష్టితంబై క్రౌంచాదిసప్తపర్వతయుతంబై కుశాదిసప్తపర్వతయుక్తంబై కుశలాదిసప్తవర్షపరివృతంబై గౌర్యాదిసప్తనదీయుక్తంబై దధిసముద్రపరివేష్టితంబై సుమనాదిపర్వతయుక్తంబై యుండు - ముందు జెప్పినద్వీపములయందు వసించెడివారు రోగములులేక ముప్పదివేలవత్సరంబులు జీవించియుండెదరు. గోమేధద్వీపము సురాసముద్రవేష్టితంబై శాల్మలద్వీప ద్విగుణవిశాలంబై సుమన కుముదయను పర్వతములతోడను సౌమక కుముదంబులను వర్షంబులతోడ నొప్పుచుండు - పుష్కరద్వీపము శుద్ధోదకసముద్రయుతంబై గోమేధద్వీప ద్విగుణవిశాలంబై యుండు - దానిపూర్వభాగంబున చిత్రసాను వనుపర్వతము కలదు - దానిపరిమాణ మిరువదియైదు వేల యోజనములు కలిగియుండు - దానికుత్తరంబుననుండెడి మానసంబను పర్వతము ఇరువదినాలుగు వేల యోజనముల పరిమాణము కలిగియున్నది - అచటవసించెడిజనులు పదివేలవత్సరంబులు జీవించెదరు - శాకద్వీపంబున శాకపర్వతంబును కుశద్వీపమున కుశస్తంబమును క్రౌంచద్వీపంబున క్రౌంచపర్వతంబును శాల్మలద్వీపంబున శాల్మలవృక్షంబును గోమేధద్వీపంబున గోమేధపర్వతంబును పుష్కరద్వీపంబున పుష్కరవృక్షంబును ఇట్టినామంబులచే బ్రకాశింపుచుండు - శుద్ధోదకసముద్రంబున కావల లోకాలోకపర్వతంబు గలదు.

ఉదకము భూమికంటే పదిభాగములధికముగలదై యాభూమిలో నర్ధభాగము నాపరించుకొని దానికాధారముగనున్నయది. తేజస్సు ఉదకముకంటే పదిభాగములధికముగలదై యది యాయుదకమున కాధారంబుగనున్న యది. వాయువు తేజస్సుకు పదిభాగములధికముగదలదై యాతేజస్సు కాధారముగనున్నయది. ఆకాశము వాయువుకు పదిభాగము లధికముగలదై యావాయువు కాధారముగనున్నయది. అని సూతుండిట్టుల వక్కాణించి సూర్యచంద్రగమన విశేషంబుల జెప్పందొడంగె.

ఖగోళవివరణము - స - అ - ౧౨౩ - మొదలు - ౧౨౬ - వరకు.

సూర్యమండల విష్కంభము ౯౦౦౦ యోజనములు - దానివలయము ౨౭౦౦౦ యోజనములు - చంద్రమండలము సూర్యమండలమునకు ద్విగుణముగనున్నయది. భూమి ౫౦ కోట్లయోజనముల విస్తీర్ణముగలదని లెక్కింపబడియె.

భూమధ్యంబునయందు జంబూద్వీపంబునంగల యిళావృతవర్షంబున మేరునగంబు గలదు. ఇమ్మేరునగంబునకు తూర్పు మానసపర్వంబున యింద్రపట్టణము దక్షిణమానసంబున యమపట్టణము పశ్చిమమానసంబున వరుణపట్టణము ఉత్తరమానసంబున సోమపట్టణము ఇటుల నాలుగుపట్టణంబులుగలవు. ఇప్పట్టణములయందు లోకసంరక్షణంబునకై యింద్రాదులు వసించెదరు. ఇప్పట్టణంబుల యూర్ధ్వభాగంబున సంచరించెడిసూర్యగమన వివరణమును జెప్పెదవినుడు.

## సూర్యగమనవివరణము.

సూర్యునికి దక్షిణాయనంబున శీఘ్రగతిగలదు - సూర్యుడు మధ్యాహ్నంబున యింద్రపట్టణములో నుండునపుడు యమపట్టణములో నుదయము వరుణపట్టణములోనర్ధరాత్రి సోమపట్టణములో నస్తమానంబగు. మధ్యాహ్నంబున యమపట్టణములోనుండునపుడు వరుణపట్టణములోనుదయము సోమపట్టణములో నర్ధరాత్రి ఇంద్రపట్టణములోనస్తమానంబగు. మధ్యాహ్నంబున వరుణపట్టణములోనుండునపుడు సోమపట్టణములో నుదయము ఇంద్రపట్టణములో నర్ధరాత్రి యమపట్టణములో నస్తమానంబగును. మధ్యాహ్నము సోమపట్టణములోనుండునపుడు ఇంద్రపట్టణములో నుదయము యమపట్టణములో నర్ధరాత్రివరుణపట్టణములో నస్తమానంబగును-దక్షిణాయనంబున సూర్యుడు కుమ్మరుని చేవిడువబడిన బాణమువలె శీఘ్రముగ సంచరించుచుండు-నక్షత్రములును సూర్యునితోడ నేతెరుచుండు-వృద్ధిపొందెడి కిరణములతోడ నుదయించి మధ్యాహ్నంబుననాకిరణములచే దపింపుచు సాయాహ్నంబున శాంతముగల కిరణములతోడనస్తమించు-మఱియు సూర్యుడపుష్కర మధ్యమునసుండునపుడు భూమియందు ముప్పదియవముహూర్తములకాలము సంచరించును. ఊర్ధ్వభాగంబున సంచరించునపుడు సూర్యునకిగలివిశేషంబులు పెక్కులుగలవు - దక్షిణదిశనుండు సూర్యుడు ప్రతిదినము ౯౦౧౮౫౦౦౦ వేలయోజనముల దూరము సంచరించు - దక్షిణదిశనుండి మఱిలి ౩౦౧-౨౧౦౦౦౦యోజనముల దూరమునందుత్తరదిశకు శ్రావణంబున బ్రవేశించు - ఈదక్షిణోత్తర దిశల మధ్యప్రదేశము విషువమండలమని పేర్కొనంబడియున్నది - అట్టిసమయంబున గోమేధిక ద్వీపమునకు దగ్భాగంబున సంచరించు- దక్షిణోత్తరదిశల మధ్యంబునంగల మండలమునకు జరద్గవ ఐరావత వైశ్వానరస్థానములను గురుతులుగ నెంచవలయు - అజవీధికి దక్షిణంబుననాగవీధికలదు - ఈరెండు నాషాఢవీధికి కారణములైయున్నవి. అశ్విని భరణి కృత్తిక రోహిణి మృగశీర్షార్ద్ర ఈయారునక్షత్రములు నాగ వీధియనంబడును. పునర్వసు పుష్యమి ఆశ్లేష ఈమూడునక్షత్రములు ఐరావతవీధియని బడును. ఈవీధులుత్తర

మార్గమని జెప్పంబడు. పూర్వఫల్గుని ఉ[illegible] ఋషభవీధి. పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర ఈరెండు గోవీధి - శ్రవణ [illegible] ములు ఈమూడు జరద్గవ వీధి - ఈమూడువీధులు మధ్యమమార్గమని జెప్పంబడు - హస్తచిత్తస్వాతి ఈమూడు నాగవీధి - విశాఖజ్యేష్ఠ అనూరాధ ఈమూడు మృగవీధి - మూలపూర్వాషాఢ ఉత్తరాషాఢ ఈమూడు వైశ్వానరవీధి - ఈవీధులుమూడు దక్షిణమార్గమని జెప్పంబడు - దక్షిణోత్తరమార్గములకు మధ్య ౧౦౦౩౨౧ యోజనములవిశాలముగలదు. ఉత్తరాయణంబున సూర్యుండు మండలమధ్య వర్తిగసంచరింపుచుండు- దక్షిణాయనంబున ముందుజెప్పిన వీధులకు వెలపటతిరుగును - దక్షిణదిశను దిరుగునపుడు సూర్యమండలము ౧౦౦౫౮ యోజనముల విశాలముగలదైయుండు. రవిచంద్రులు కులాలచక్రమువలె తిరుగుచుందురు. దక్షిణాయనంబున సూర్యునికి శీఘ్రగతిగలదుగాన పగలు - ౧౨ - ముహూర్తములకాలము ఉత్తరాయణంబున పగలు ౧౮ - ముహూర్తముల కాలము సంచరించును. ధ్రువుడు మృత్పిండమువలె ఉత్తరదక్షిణ మధ్యప్రదేశములందుండి రాత్రింబగళ్లు ముప్పదిముహూర్తములకాలమునకు లోపల మండలముగా దిరుగుచుండు, లోకాలోకపర్వతమున కుత్తరముఅగ్నిమార్గమునకు వెలపటనుండు పుష్కరదేశములకు, దక్షిణవీధియందుండుసూర్యుని కాంతివ్యాపించును - ఆదేశములకొకభాగమునందు పదివేలయోజనముల యౌన్నత్యముగల లోకాలోకపర్వతముగలదు - దానికిలోభాగంబున సూర్యచంద్రనక్షత్రతారాగణములు వర్తింపుచుండెదరు. ఇదియేగోచరంబగునది - గోచరాగోచరంబగునదియె లోకాలోకపర్వతము - ఈలోకాలోకమును సూర్యుడుచేరునట్టి కాలమే సంధ్యయనిపలుంగు - అదియరాత్రి పవళ్లసంధికాలము.

కాలవిభాగము.

ముప్పదిగడియలు పదియైదు ముహూర్తములుగల కాలము పవలనంబడు - సూర్యగతిభేదమువలన కాలముమారుచుండును-ప్రాతఃకాలము మూడుముహూర్తములు, సంగమకాలముమూడుముహూర్తములు, మధ్యాహ్నము మూడు ముహూర్తములు అపరాహ్ణముమూడుముహూర్తములు సాయాహ్నము మూడు ముహూర్తములు ఇటుల పదునైదు ముహూర్తములయ్యె గావున ముహూర్తమునకు కాలము రెండుగడియలగు- సుధాముడు హిరణ్యరోముడు, పర్జన్యుడు, కేతుమంతుడు, అనువారు లోకరక్షకులై లోకాలోకపర్వతమునకు మధ్యప్రదేశంబున ప్రళయపర్యంతము వసింపుచుండెదరు. అగస్త్యునికి ఉత్తరము అగ్నిమార్గమునకు వెలుపల పితృమార్గముగలదు- అచట నగ్నిహోత్రపరులగు ఋషులు లోకసంతానవృద్ధికి

హేతుభూతులై వసించెదరు - ధ్రువస్థానము విష్ణుపదంబని పేర్కొనబడియున్నది- అచట దుఃఖంబెరుంగనివారే వసింపుచుండెదరు.

ధ్రువసంచారవివరణము.

ఉత్తానపాదపుత్రుడగు ధ్రువుడాకసంబున పదునాలుగు నక్షత్రములయందు శింశుమారచక్రంబున మేధీభూతుడై గ్రహయుక్తులగు సూర్యచంద్రులను వాతరూపమగు పాశములచే ద్రిప్పుచు తానునుతిరుగుచుండు. చక్రమువలె నొకచో తిరుగునట్టి ధ్రువునితోడనే నక్షత్రములు సహితముతిరుగుచుండు.

మేఘమండలవివరము.

జీమూతంబులను మేఘంబులుగలవు - అవియావహంబను వాయువునాశ్రయించి యుదకంబులనిచ్చు- అవి భూమికామడదూరంబుననుండి సదావర్షింపుచుండు - పూర్వము ఇంద్రుడు పర్వతముల ఱెక్కలు నరుకునపుడు వానిలోనుండి వెడలిన పుష్కలావర్తకములను మేఘములు వాయ్వాధారములై కల్పాంతమున వర్షించు. బ్రహ్మజనించునపుడు బ్రహ్మాండము భిన్నమై యందుత్పన్నంబులైన శకలంబులు మేఘంబులయ్యె. ఈమేఘంబులు ధూమముచే వృద్ధియగు - వీటిలో పర్జన్యుడుత్తముడు, ఇతనువర్షాకాలంబున వర్షమును హేమంతఋతువున మంచునుకురిపించును. ఇవి పరివహంబను నారవవాయువుచే రక్షింపబడుచుండు. ఆకాశగంగను దిగ్గజములుతమతుండములచే గ్రహించి భూమియందు విడుచుటచే యది మంచువలె వర్షింపుచుండు - హిమవత్పర్వతమునకు దక్షిణభాగమునందుండు హేమకూటపర్వతమున పుణ్డ్రాయను పట్టణంబుకలదు. అందు మంచుకురియుచుండు. హిమగిరియందు కురిసెడిమంచే ఇచటికినివచ్చు - వర్షము, మంచు, ఎండ, పగలు, రాత్రి, సంధ్యశుభాశుభఫలములు ఇవి యన్నియు ధ్రువునివలన ప్రవర్తిల్లు - సూర్యుడు ధ్రువుని యాజ్ఞాబద్ధుడై సకలజీవులకు ప్రాణాధారమగు నుదకమునిచ్చు. స్థావరజంగమాదులనుండి ధూమరూపంబుగ వెడలెడియుదకమును సూర్యుడుతనకిరణములచే గ్రహించి మేఘము వాయువు వీనిద్వారముగ ఆఱుమాసములుభూమియందు వర్షించునటులజేయు. మేఘములయందుండి యుదకములు కదలకుండునపుడు వాయుప్రేరణముచే పైమూడును కలుగును.

సూర్యరథపరిమాణము.

ఏకచక్రముగల రథము నెక్కి సూర్యుడు ధ్రువవాధారముచే ౨౦౦మండలములుతిరుగుచుండు. ఈరథమునకాయామము ౧౦౦౦౦౦ల యోజనములుకలవు

౨౦౦౦౦ యోజనములపొడవుగల ఈపాదదండంబొకటికలదు - ఛందోరూపంబుల గునేడుగుఱ్ఱములచేనీడ్వబడుచున్నయది - మున్నీరథమును నలువసృజియించె.

వసంతాదిఋతువులయందు సూర్యగణభేదములు.

చైత్రవైశాఖములయందు - ధాత అర్యములను ఆదిత్యులును - పులస్త్యపుల హులను ప్రజాపతులును, వాసుకికంకాదులను సర్పములును, తుంబురునారదులను గంధర్వులును, కృతస్థల, పుంజికస్థలలను అప్సరలును- రథకృత్స్న రథౌజస్సులనుగ్రామణులును - హేతి ప్రహేతులను రాక్షసులును - జ్యేష్ఠాషాఢములయందు మిత్రా వరుణులను ఆదిత్యులును - అత్రి. వసిష్ఠులను మహర్షులును - తక్షకరంభకులను స ర్పములును, మేనకసహజన్యలను అప్సరలును, హాహాహూహువులను గంధర్వు లును, రథంతరరథకృత్స్నులను గ్రామణులును, పౌరుషవధులను, రాక్షసు లును, శ్రావణభాద్రపదములయందు, ఇంద్రవివస్వంతులను, ఆదిత్యులును- అం గిరోభృగువులను, మహర్షులును, ఏలాపుత్రశంఖపాలులను, సర్పములును, వి శ్వావసూగ్రసేనులను, గంధర్వులును, ప్రమ్లోచానుమ్లోచలను అప్సరలును,హే తివ్యాఘ్రులను రాక్షసులును-ఆశ్వయుజకార్తికములయందు పర్జన్యపూషులను ఆ దిత్యులును, భరద్వాజగౌతములను మహర్షులును, చిత్రసేనసురుచులను, గంధర్వులు ను, విశ్వాచీఘృతాచులను అప్సరలును; ఐరావతధనంజయులను సర్పములును, సేన జిత్సుషేణులను గ్రామణులును, పౌరుడు అపౌరుడను రాక్షసులును, మార్గశీర్షపు ష్యములయందు హంసభగులను ఆదిత్యులును, కశ్యపక్రతువులను ఋషులును, మ హాపద్మకర్కోటకులను సర్పములును, చిత్రసేనఘూర్ణాయువులనుగంధర్వులును, పూ ర్వచిత్తిఊర్వసులనుఅప్సరలును, తార్క్ష్యారిష్టనేములనుగ్రామణులును,విద్యుత్స్ఫూర్జ్యుల ను రాక్షసులును, మాఘఫాల్గుణములయందు త్వష్టావిష్ణువులను ఆదిత్యులును,జమద గ్నికౌశికులను మహర్షులును, కంబళాశ్వతరులను సర్పములును, ధృతరాష్ట్రసూర్య వర్చస్సులను గంధర్వులును, తిలోత్తమారంభలను,అప్సరలును ఋతజిత్సత్యజిత్తులను గ్రామణులును బ్రహ్మోపేతయజ్ఞోపేతులను రాక్షసులును, ఈగణములు ఆయా ఋతువులయందు తమతమ ... తకార్యంబులను సలుపుచుసూర్యుంబరివేష్టించి యుండెదరు- ఇట్టిపరివారంబులోడ సూర్యుడులోకాలోకంబుసంజుట్టుచు మనుజుల పాపంబులంబోకడచి తనకిరణములలో నొకటియగు సుషుమ్నమువలన వృద్ధిబొం దిన చంద్రునియమృతమును పితరులు దేవతలకును వర్షముచేఫలింపజేసెడి ధాన్యా దులును మనుజులకును జీవనాధారముగనునిచి రక్షింపుచుండు.

## చంద్రమండలపరిమాణాదుల వివరణము.

సూర్యవీథికి నుపరిభాగంబున చంద్రుడు, చంద్రునికి నుపరిభాగంబున నక్షత్రములు సంచరింపుచుండు. ఉదకమునుండి జనించిన చంద్రునిరథము మూడుచక్రములు పదిశుక్లాశ్వములచే నొప్పుచుండు. యుగక్షయపర్యంతము చంద్రునిరథము నీడ్చెడిపై యశ్వంబులకు అజ, శత, శాక్షి, వృష, వాజి, నర, అక్ష్య, సప్తధాతు, హంస, వామ, మృగములను నామంబులు గలిగియున్నవి. చంద్రుడు దేవతలచేతను పితరులచేతను పరివేష్టింపబడియుండు. సూర్యునిసుషుమ్న కిరణముచే శుక్లపక్షంబున చంద్రుడు వృద్ధిబొందిపూర్ణిమయందు సంపూర్ణమండలముచే ప్రకాశించు. కృష్ణపక్షద్వితీయ మొదలు చతుర్దశవరకు దేవతలును అమావాస్యయందు పితరులును చంద్రకిరణములను పానము చేసెదరు.

## బుధాదిగ్రహములరథపరిమాణాదులవివరణములు.

బుధునిరథము రాహురథంబునకెదురుగా నడుచుచుండు. ఆరథంబునకు వాయువేగంబును పచ్చనివర్ణంబునుగల యెనిమిదిగుఱ్ఱములుగలవు. అంగారకునిరథమును అగ్నిసంభవములగు ఎఱుపువర్ణముగల యెనిమిదిగుఱ్ఱము లీడ్చుచుండు. ఈయంగారకుడు ఋజువక్రాతివక్రములచే నడుచు. బృహస్పతి గౌరవర్ణముగల యెనిమిదిగుఱ్ఱములు కట్టినరథంబునెక్కి సంవత్సరమున కొకరాశివంతున మందగతితో నడుచు. శుక్రునిరథమును అగ్నిసంభవములగు ఎనిమిదిగుఱ్ఱము లీడ్చుచున్నయవి. శనైశ్చరుడు నీలిరంగుగల యెనిమిదిగుఱ్ఱములు కట్టినయినపరథము నెక్కి మందగతితో సంచరించుచుండు. రాహువునల్లని వర్ణముగల యెనిమిదిగుఱ్ఱములంబూన్చిన తమోమయంబగు రథంబునెక్కి పర్వములయందు సూర్యచంద్రులమీదికి నడుచుచుండు. కేతువుధూమ్రవర్ణముగల యెనిమిదిగుఱ్ఱములంబూన్చిన రథంబునెక్కి చరింపుచుండు. ఈగ్రహంబులన్నియు ధ్రువునిబద్ధములై వాయునామపగ్గములచే గట్టబడియుండు. ఉదకములో నావయెటులనడుచునో అటులనె వాయుమార్గంబున సూర్యచంద్రగ్రహాదినక్షత్రములు సంచరింపుచుండు. ఇట్టిగ్రహనక్షత్రములు ధ్రువుడు శింశుమారచక్రరూపంబున యాకాశములో దిరుగుచుండు. లోకమునందలి జనులు ప్రతిదినము ధ్రువునిచూచుచుండిరేని ధ్రువమండలములో నెన్నినక్షత్రములుండునో అన్నిహాయనంబులుజీవించెదరు. ఈధ్రువునికిడుత్తరపుహనువున ఉత్తానపాదుండును, ఉదరంబున యజ్ఞుండును, శిరంబున ధర్ముడును, హృదయంబున నారాయణుండును, పూర్వపాదంబులయందు సాధ్యులు యనునిదేవతలును, ఊరువులయందు నశ్వినార్యములును, మేఢ్రంబున సంవత్సరంబును, మిత్రావపానంబునను, పృష్ఠంబున అగ్నియు

హేంద్రమారీచ కాశ్యపులును, నివసించి ప్రదక్షిణముగ తిరుగుచుండెదరు. ధ్రువు డధోముఖుడై మేరు ప్రదక్షిణము చేయుచుండు.

అగ్నికిని సూర్యునికిని పరస్పరము తేజంబైక్యంబగుట.

పూర్వముననవ్యక్తజాతుండగు నలువ తిమిరముచే నావరింపబడిన లోకమును గాంచితాను మెఱుపురూపమును వహించియున్న త్రిని చింతింపుచు నగ్నిస్థానంబు తెలంగెలంగి తన తేజముననణచి యగ్ని తేజమును మూడు రూపములుగ విభజించిపచనముచేయు నగ్నికి పావకుడనియు, తపింపచేయు సూర్యుడు శుచ్యగ్నియనియు, జఠరాగ్నికి వైద్యుతుడనియు నామంబులిడియె. సూర్యుని తేజస్సు రాత్రుల యందగ్నిం బ్రవేశించియుండు. సూర్యుడు(౧౦౦౦)కిరణములచే నొప్పుచుండు గాననందు చందన మేధ్య కాంతక చోతన అమృతములు మొదలగు నన్నూరు కిరణములు వర్షమును గురిపించును. మున్నూరు కిరణములు హిమమును గురిపించును. చంద్రతారలగ్నియు సూర్యునికిరణములే-యవి శీతలముగనుండును. అందు హిమాంబువులను గురిపించు కిరణములు వెలుగుల పవిత్రములైనయవి. అవియ సంతోషంబున కాస్పదంబులుగనుండు. శుక్లములు కకుభములు గోవులు విశ్వభృత్తులు మొదలగు నామములుగల ౩౦౦ సూర్య కిరణములు ఆతపమును గలుగజేయు. సూర్యుడాయా ఋతువులయందు బ్రవేశించ నపుడు సూర్యకిరణముల నేక భేదములుగలవియై యుండు.

చంద్రాదిగ్రహములకు సూర్యకిరణములచే తృప్తిగలుగుట.

సుషుమ్నయను సూర్యకిరణము క్షీణించెడి చంద్రుని వృద్ధిపొందించును. హరికేశవను సూర్యకిరణము నక్షత్రములకు తృప్తినిగలుగజేయు- దక్షిణదిశనుండు విశ్వకర్మయను కిరణము బుధుని పోషించును. విశ్వావసువను కిరణము శుక్రుని రక్షించు. సంవర్ధనయను కిరణము అంగారకుని నాదరించు ఆఱవ కిరణము బృహస్పతికాధారంబైయుండు. స్వరాట్టను కిరణము శనైశ్చరునికి తృప్తినిగలుగజేయు.

సూర్యాదులజననము.

భగవంతుడగు సూర్యుడు అదితికి యొనిమిదవసుతుడు. తేజోవంతుడగు చంద్రుడు వసువు- భృగుముని పుత్రుడు శుక్రుడు. దేవాచార్యుడగు బృహస్పతి అంగిరస్సుకుపుత్రుడు. బుధుడు ఋషిపుత్రుడు. శనైశ్చరుడు సంజ్ఞాపుత్రుడు. కేతు అగ్నికి విశేశియందు జనించినవాడు. రాహువు సింహికాపుత్రుడు. నక్షత్రములు దక్షపుత్రులు.

సూర్యాదులమండల ప్రమాణములు.

సూర్యవిష్కంభము(౯౦౦౦) యోజనములు. మండలప్రమాణము ౨౭౦౦ యోజనములు. చంద్రమండలము సూర్యమండలమునకు ద్విగుణముగానుండు.

సూర్యచంద్రమండలముల కుపరిభాగంబున తక్కినగ్రహమండలంబు లున్నయవి. రాహువువీరికి సమానుడుగ తమోమయుండగుచు పృథ్వీచ్ఛాయనవలంబించియుండును. ఇతను చంద్రపర్వములయందు సూర్యునివదిలి చంద్రుని- సూర్యపర్వములయందు చంద్రునివదిలి సూర్యునిమ్రింగుచుండును. చంద్రమండలములో పదనాఱవభాగము శుక్రమండలము. శుక్రమండలములో నాలవభాగము గురుమండలము. ఈగురుమండలములో నాలవభాగము-అంగారకశనిమండలములు. వీరిమండలములలో నాలవభాగముబుధమండలము. తక్కిననక్షత్రములుబుధునికి సమానముగనుండును. శనిబృహస్పత్యంగారకులకు మందగమనము. వీరికిదిగువగానుండు రాహుకేతు చంద్ర శుక్రబుధులకు శీఘ్రగమనము కలిగియుండును - రాహుకేతువులుతప్పతక్కిన గ్రహములకన్నిటికి సూర్యుడుక్రిందుగానుండును. సూర్యునికుపరిచంద్రుడు చంద్రునికుపరిబుధుడు బుధునికుపరిశుక్రుడు శుక్రునికుపరియంగారకుడు అంగారకునికుపరిబృహస్పతి బృహస్పతికుపరి శని యితనికుపరి సప్తర్షిమండలముగలదు. దీనికిపైనుండునది యేఘ్రవమండలము.

త్రిపురోపాఖ్యానము - సం - అ - ౧౨౯ - మొదలు - ౧౩౯ - వరకు.

అనిచెప్పిన ఋషులు సూతునింగాంచి మహాత్మా! మహేశ్వరుండు పురారిత్వంబునెట్లుజెందె? త్రిపురంబులనెట్లుదహించె? తెలియంబలుకుమని వేడిన వారికతండిట్లనియె. మయుడను నసురుడు యుద్ధంబునసురలచేనోడి ఘోరతపంబుచేయసమకట్టిన విద్యున్మాలి తారకాక్షులను నిద్దఱు దానవులతని తపోవృద్ధికై తపంబుచేయుటకు సమకట్టిరి. పిదపవీరుముగ్గురును త్రేతాగ్నులవలె ముల్లోకములను తపోగ్నిచే దపింపచేయుచు హేమంతంబున నుదకమునందును గ్రీష్మంబున పంచాగ్నిమధ్యంబునను వర్షంబున నిరావరణస్థలములయందును నిలచితపంబు సల్పుచులోకములు చీకాకుపడునటులంజేసిన నలువయాయసురులకడకేతెంచి వారి తపంబులకు మెచ్చిమీరుకోరెడివరంబుల నిచ్చెదనేడుమన యారక్కసులునలువకు మ్రొక్కియుండనందుమయుండిట్లనియె. తారకయుద్ధంబున దానవులోడిరి దేవతలుజయించిరి మాకు రక్షకులులేమింజేసి తపంబుసలిపితిమి. కావుననొక బాణముచే దప్పయితరోపాయంబుల నాశముకాని దుర్గమువలయునని కోరినయటులవరంబొసంగియంతర్హితుడయ్యె. అంతనద్దానవులు వరప్రభావంబునకుబ్బి బాణముచేగురితగలకుండునటుల యోచించి మూడుపట్టణంబుల కట్టుటకునిశ్చయించి యొక్కొక్కదానికి నూఱుయోజనములదూరముగల ప్రతిపట్టణము నూఱుయోజనముల నిడుపువెడల్పుగలిగియుండునటుల పుష్యమినక్షత్రంబువలె భూమినినినుముచేతను ఆకాసంబున రజతముచేతను దానికిపైనబంగరుచేతను నిర్మించి భూమియందుగల యినపపట్టణమునకు తారకాక్షుడును, రజతపట్టణమునకు విద్యున్మాలియు, బంగరుపట్టణము

అమ్మృతకళేబరంబులు వైచినమాత్రన జీవితులగుదురని చెప్పుటయు శరాగ్రవాసియగువిష్ణుం డాలించి వృషరూపంబునొంది దానవపురంబుం జొచ్చి యమృతవాపిం బీల్చి మరల శరాగ్రంబుం జేరె. అంతసురప్రమథగణంబులు యుద్ధంబున శరదుర్దినంబు గావించిన దానవులు వేరుపాయంబు గానక సంగరంబున పరాజితులై తమపట్టణంబులం జేరిరి. అంతమయుండు దానవులం గాంచి ఓదానవులారా! మీకమితమగు చెడుగువాటిల్లె, ప్రథమంబున సురలం ధిక్కరించిన మరల వారిచే జిక్కిరి. పలు తెఱంగులగు నుపాయంబుల యోచించి కట్టినయీత్రిపురంబునకు నాశము సంఘటిల్లెనని మయుండు పలికింపుచుండ వాపీపాలకులరుదెంచి మయుం గాంచి దేవరా! ఎవ్వడో వృషభరూపంబుం బూని మనయమృతవాపి కడకేతెంచి దానినంతయు గ్రోలిపరుగిడెనని జెప్పిన నాపలుకులు కుక్కములుకులవలె మయుని కర్ణంబులకు సోకిన మాత్రంబున యులికి పడి దీర్ఘనిశ్వాసంబులం విడిచి దానవులం గాంచి నేనిర్మించినయమృతవాపిని జేరి యందుండు అమృతమును గ్రోలినవాడు విష్ణుండుగాని మఱియొకనికిట్టి శక్తిగలుగంజాలదు. ఇక మనకపజయంబు చేకూరు. కావున మనము సముద్రంబున జేరితిమేని సురలు జయింప జాలరని నుడివిన దానవులొడంబడి తమపురంబులతోడ జలధిం జేరిరి. ముక్కంటి నలువ నీక్షించి దానవులు సురంబున నోడి తమపురంబులతోడ వరుణాలయంబు జొచ్చిరి. కావున నచటికి యరదంబును పోనిమ్మనిన కమలగర్భుం డటులం జేసె. సురలందరు శివునింబరివేష్టించి పడమటికడలికరిగి సింహనాదంబులు చేసి యసురుల యుసురులం బాపసమకట్టి దేవేంద్రుడును లోకపాలురును ప్రమథగణంబులు మొదలగు దండినాగలు ఖండనంబు సేయ యంతజమార్గంబున నిలిచి శంఖపటహఢక్కాకాహళభేరీ భాంకారంబులు చెలంగింపుచుండ త్రిపురవాసులా ధ్వనులనాలించి హరుండు దురంబునకు వచ్చెనని తలంచి యసురులు రౌద్రాకారులై బ్రహ్మాండంబు భేదిల్లునటుల నార్చుచు సమరంబునకరుదెంచిన నిరుదెరంగులవారును దలపడి పరస్పరజయేచ్ఛలం బోరుచు కొండఱు ఖడ్గంబుల చేతను కొండఱు పరశ్వధంబుల చేతను కొండఱు ఇనుపగదియ ఘుట్టనంబు చేతను కొండఱు పిడికిటిపోటుల చేతను కొండఱు శూలంబుల చేతను నీల్గిరి - సముద్రంబునతిమి తిమింగిల మకరాదిజలచరంబులు తిరుగుచుండంబున విశిఖములచే ఖండింపబడిన కళేబరములొండొంటిం దాకుచుండె. అంతనీశపుత్రుండగు కుమారస్వామి త్రిపురదక్షిణద్వారంబునను యముండు కుబేరుడు పశ్చిమద్వారంబునను శివుండుత్తరద్వారంబునను నిలచియుండ ప్రమథగణంబులు తూర్పుద్వారంబున త్రిపురంబులోనికిం బ్రవేశించి గృహంబులం బెరికి సముద్రంబునబడవైచుటం జూచియందలి స్త్రీబాలాదివృద్ధు లనేకభంగుల విలపించుచుండిరి. అంత తారకాసురుండతిగర్వంబున నందికేశ్వరు నెదిర్చి యతనిచే హతుండయ్యె. ప్రమథగణములు సింహనాదంబులు చేసిరి. మయుడు తారకాసురుడు సమరంబున సమసెనని శూరులవలనవిని విద్యున్మాలిని

రావించి యుద్ధంబునకరుగుమని చెప్పి తానును వెడలి దానవులంగాంచి యీత్రిపురం
బును పుష్యమీసంబంధమున దహింపజేయవలయుగాన నటుల జేయుట కెవరికిని సా
ధ్యంబుగాదు. ప్రాణంబులుండువరకు యుద్ధంబు జేయుడనిన వారు సంతసించి యు
ద్ధసన్నద్ధులైరి. అంతట సూర్యుడస్తమించె. చంద్రుడుదయించినను త్రిపురంబున
తిమిరముంగప్పుకొని యరిష్టసూచకంబులు కనుపట్టె. మరునాడుదయంబున ముక్కం
టి త్రిపురంబుల మీదకెగపిసిన దానవులు కోపోద్దీపితమానసులై ప్రాసాద్యాయుధం
బులంబూని వర్షర్తు మేఘంబులంబోలి యుద్ధసన్నద్ధులై ప్రమథగణంబులంజేరి వజ్రం
బులచే బొడుచుచు చక్రంబులచే ఖండింపుచు బాణంబులచే భేదింపుచు దేవదానవులు
బోరుచుండుతటి మృతములగు గజాశ్వపదాతులు సముద్రంబునబడుచుండ నట్టి
యకాండ ప్రళయము విద్యున్మాలిచూచి నందీశ్వరునిమీదికురికి ఓరి ప్రమథాధమా!
ఇపుడు నిన్నునే యమపురంబునకనిపెద నిలునిలుమని ధిక్కరింపుచుండ నందీశ్వరు
డు వానింగాంచి నీ జాతిధర్మంబున నిటులాడెదవు, నీవయమపురంబునకరిగెదవన
నావిద్యున్మాలి ఓరి మొర్ఖయొద్ధా! సూర్యునిపదత్రోసెడి వాడైన, ఆకసంబు
ను బట్టెడివాడైన నాయెదుట నిలువంజాలడని హుంకరించి నందీశ్వరుని
హృదయంబున నొకబాణంబు నాటనేసిన నందీశ్వరుండొక్క సాలవృక్షంబుం
బెఱికి వానిపై వైచిన దాని తనబాణంబులతుండెములుగావించె. అంతనందీశ్వ
రుడు రోషించి వానిపైకురికిన నాదనుజుండొక శక్తినివైచె. నాశక్తింగొని
యాదనుజునిపై వైచినవాడు వజ్రహతంబుచే గూలెడిపర్వతంబు కరణి నేలంగూలె.
అంతసిద్ధులు పొగడిరి, దేవవాద్యంబులు ఘూర్ణిల్లె. విద్యున్మాలిసంగరంబున సమసె
ననువార్తను మయుండువిని దందహ్యమానమానసుండై దేవసంఘంబులతోడ సమ
రము చేయదలపడి శూలంబులచే భేదింపుచు గదలచే మొత్తుచు బాణంబులచే తూ
లనేయుచుండ దేవవ్యూహంబులు బెదరిచెదరి చీకాకుపడుటనీక్షించి, ఇంద్రయమ
కుమారనందీశ ప్రమథగణంబు లేకంబై యెదిర్చిన వీరిబాణజాలంబులకు మయుండు
మొదలగు దానవులు దిక్కుసొక్కు ఉక్కుచెడి హాహాకారములు చేయుచు మఱలి త్రిపు
రంబులంజేరిరి. అంత త్రిపురనాశంబునకై దైవయోగంబున పుష్యమి నక్షత్రసంబంధ
కాలము సంఘటిల్లె. ఆకాలంబును తప్పనీక ముక్కంటితనబాణంబును త్రిపురంబుల
మీదికి ప్రయోగించె. అంతనందీశుండు శివునియాజ్ఞచే త్రిపురంబులోని మయునికడకుం
జేరి, ఓమయుడా! ఈత్రిపురంబు దగ్ధంబగునట్టి కాలమాసన్నమైనది. త్వరితగతిచే దీని
విడిచి వెడలుమనియె, మయుండు వెడలిన తత్క్షణంబున శివునిచే విడువబడిన బాణంబా
పురంబులం బ్రవేశించి హర్మ్యప్రాసాదా[illegible]ోస వనాదులదహించునెడయందలి జను
లగ్నిదగ్ధులై కొందఱు ఓతాత! తల్లీ! పుత్రుడా! మామా! యనియు, కొందఱు స్త్రీ
లుభర్త్రాలింగనలై వెండొరులు విడనాడనేరక యనేకవిధంబుల చింతింపుచుండ తఱి

యుండా కవనితపులా శయనుండగాంచి కేలుమోడ్చి ఓపావకుడా! నేనన్యునిభార్యను, పతివ్రతను, కావున నీవు పరపురుషుడవు నన్ను స్పృశింపదగదని వేడుకొనినను, మరియొక శతపత్రనేత్రి ఓ అనలుడా! యీనాశిశువు ననేకదినంబులజేసి జననం బ జేసితినిగాన దహింపకుమని ప్రార్థించినను, ఇట్లనేకులనేకరీతులవిలపించినను యా యగ్ని నిర్దయుడై వారిని యాపట్టణంబుల నుదహించె. పిదప దేవతలు పరమేశ్వరుని యనేకవిధంబులం బొగడి వారి వారి స్థానంబులకేగి సుఖంబుగనుండిరి. కావున యీత్రిపురోపాఖ్యానమును వినినను చదివినను అట్టివారికి సకలాభీష్టంబులు సమకూరునని సూతుండు మునులకు నెరింగించె.

## అమావాస్యాపితృతృప్తివర్ణనము - అ - ౧౪౦.

అనిన మునులు సూతునింగాంచి ప్రతిమాసంబున అమావసయెటుల సంఘటిల్లు? పురూరవుడు పితరులకు తృప్తినెట్లు గావించె? దీనిని వినుపింపుమనిన మనువునకు మత్స్యుడు చెప్పిన చొప్పున జెప్పెద వినుండని సూతుండిట్లనియె - సౌమ్యులు, బర్హిషదులు, కావ్యులు, అగ్నిష్వాత్తులు, చంద్రుడు, నక్షత్రములు, వీరెల్లయమావసయందు సూర్యమండలమున వసించెదరు - అట్టితఱి నైళుడు (అనగా పురూరవుడు) సూర్యమండలమునకేగి తనమాతామహపితామహులను సూర్యచంద్రులకును తనపిత్రాదులకును నమస్కరించి సినీవాలీకుహువుల సంధికాలమున దర్శశ్రాద్ధంబొనర్చుట యుక్తంబనిదలంచి ఆర్తవాదులకు బఱుంగెడి తన పితరుల తృప్తికొఱకు చంద్రమండలమునం దుత్పన్నంబయ్యెడి యమృతంబును ప్రతీక్షించుచుండె. సూర్యుడు తనసుషుమ్న నాడి వలన శుక్లపక్షప్రతిపద మొదలుకొని నిండెడియుండు కాలముగలయొక్కొక్క తిథిని తనసుషుమ్ననాడిచే యమృతమును పూర్తిజేయుచు పదునైదవదియగు పూర్ణిమయందు చంద్రునిపూర్ణకళలుగల వానిగా జేయు. కావున చంద్రునకు పదునైదుకళలనే గ్రాసస్థంబును - కృష్ణపక్షప్రతిపద మొదలు యమృతమును తిథిక్రమానుసారముగ అగ్న్యాదిదేవతలు పానము సేసెదరు గాన నట్టియమృతమును పురూరవుడు జెంది తనపిత్రాదుల తృప్తిజేసెనని సూతుండు వచించి మఱల పర్వసంధులం జెప్పందొడంగె.

వేణువయందు పర్వంబులు కూర్పంబడియుండు మాడ్కి సంవత్సరాదుల యందు ఋతువులు మాసములు పర్వములయందు ప్రతిపదాదితిథులు కూడియుండుటంబట్టి పూర్ణిమామావాస్యా పర్వసంధ్యాదులయం దన్వాధానము మొదలగు దర్శపూర్ణమాసములు, పితృయాగములు, పిండపితృయజ్ఞము, దర్శశ్రాద్ధాదులొనర్పవలయు, పూర్ణిమయనగా చంద్రునికళలుసంపూర్ణమగుదినము, సూర్యుడు చంద్రుడు కూడినదినము అమావస యని జెప్పిన మునులు సూతునింగాంచి యీలోకంబున

శ్రాద్ధంబే దేవతల కొసంగవలయు? వారికమనాగమనంబు లెట్టివి? వచింపుమని వేడిన వారి కాతండిట్లనియె. ఈలోకంబుననరుడు క్షుత్పిపాసాదియుక్తులైన తనపితృమాత్రాదుల నామగోత్రంబులతోడ శ్రాద్ధంబిడిన వారేలోకంబునం దేరూపంబుగనుండినను నదివారిం జెందు. మఱియుబ్రహ్మచర్యము, కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సు జ్యోతిష్టోమాదియజ్ఞములు, సంతానోత్పత్తి, శ్రాద్ధము, విద్యాదానము, అన్నదానము, వీటినొనర్చినపితరుల కత్యంతతృప్తిగలుగు గాన మనుజుడుమరణము జెందువరకునైసత్కృత్యములను సలిపినపితరులాయురారోగ్యాది సంపత్తులొసంగుదురు. సత్కార్యంబులొనర్చెడి మనుజులుస్వర్గాది భోగంబులం జెందెదరు. వర్ణాశ్రమ ధర్మంబులను శాస్త్రకర్మములను వదలిభ్రష్టులై మృతి జెందిన యమలోకంబున నానావిధవికార యాతనాదేహంబులంబొంది క్షుత్పిపాసలుగలవారై యమభటులచే గొట్టంబడుచు తమతమవంశీయులలో నెవ్వరేని శ్రాద్ధాదులచే దృప్తింగలుగజేయుదురా; యని చింతింపుచు తమతమపాపకర్మానుసారముగ-అసిపత్రవనాది భయంకరనానావిధనరకంబులం ద్రోయంబడిదుఃఖింపుచుండెదరు - కావున మానవులు మిగులశ్రద్ధాభక్తిగలవారై తమమాతాపితరుల శ్రాద్ధముజేసిన మిగులశ్రేయంబు వాటిల్లు.

## చతుర్యుగములవివరణము సం - అ - ౧౪౧.

అటనుడివినమునులు సూతుంగాంచి మహాత్మా ! చతుర్యుగపరిమాణంబుల జెప్పవలయునని వేడిన సూతుండిట్లనియె. లౌకికప్రమాణముచేత మానుషమానమును చతుర్యుగపరిమాణమును జెప్పెదవినుడు. (౧౫) నిమిషములొక కాష్ఠ (౩౦) కాష్ఠలొక కళ (౩౦) కళలొకముహూర్తము (౩౦) ముహూర్తములొక యహోరాత్రంబని జెప్పంబడు. అట్టియహోరాత్రములను మానుషలోకమునందు సూర్యుడుతన యుదయాస్తమయములచే విభజింపుచుండు. పవలుకర్మములు జేయుటకును రాతిరి నిదురకునుమనుజుల కనుకూలంబైయున్నయది - ఇట్టియహోరాత్రంబులు ముప్పదియైన నొకమాసంబగు - పితరులకదియొకయహోరాత్రంబగు -అందుకృష్ణపక్షముపవలు శుక్లపక్షమురాత్రియునగు - అట్టిమానుషమాసంబులు (౩౬౦) యైన పితరులకొకమాసంబగు - అట్టిమాసంబులు (౧౨) అయ్యేనేని వారికొకవత్సరంబగు - లౌకికప్రమాణవత్సరంబు దేవతలకొకదినంబగు - అందుత్తరాయణముపవలు దక్షిణాయనము రాత్రియనంబడు లౌకికప్రమాణవత్సరంబులు (౩౦) యయ్యేనేని దేవతలకొకమాసంబగు - అట్టిమాసంబులు (౧౨) అయ్యేనేని దేవతలకొకవత్సరంబగు- లౌకికప్రమాణవత్సరంబులు (౩౦౩౦) అయ్యేనేనిసప్తర్షులకొకవత్సరంబగు - అట్టివత్సరంబులు (౩) అయ్యేనేనిధ్రువునికొకసంవత్సరంబగు. [illegible]

కప్రమాణవత్సరంబులు (౩౬౦౦౦) లయ్యె నేని దేవతలకు నూఱువత్సరంబులగు- ఈ భారతవర్షంబున కృతత్రేతాద్వాపరకలియుగములు దివ్యమానముచే నొప్పియున్నవి- అందు - (౧) కృతయుగము (౨) త్రేతాయుగము (౩) ద్వాపరయుగము (౪) కలియుగము- దివ్యమానముచే కృతయుగవత్సరములు (౪౦౦౦) సంధికాలవత్సరములు (౪౦౦) సంధ్యంశకాలవత్సరములు (౪౦౦) త్రేతాయుగదివ్యవత్సరములు (౩౦౦౦) సంధికాలవత్సరములు (౩౦౦) సంధ్యంశకాలవత్సరములు (౩౦౦) ద్వాపరయుగదివ్యమానవత్సరములు (౨౦౦౦) సంధికాలవత్సరములు (౨౦౦) సంధ్యంశకాలవత్సరములు (౨౦౦) కలియుగప్రమాణదివ్యవత్సరములు (౧౦౦౦) సంధికాలవత్సరములు (౧౦౦) సంధ్యంశకాలవత్సరములు (౧౦౦) చతుర్యుగదివ్యవత్సరములు (౧౨౦౦౦) ఈ చతుర్యుగములకు మానుషమానంబుచే వక్కాణించెదవినుడు - కృతయుగము (౧౭౨౮౦౦౦) త్రేతాయుగము (౧౨౯౬౦౦౦) ద్వాపరయుగము (౮౬౪౦౦౦) కలియుగము (౪౩౨౦౦౦) చతుర్యుగప్రమాణము (౪౩౨౦౦౦౦) యగుచున్నయవి. మన్వంతరప్రమాణము (౩౦౬౭౨౦౦౦౦) ఇట్టిమన్వంతరములు పదునాలుగయ్యె నేని బ్రహ్మకొకపవలగు - పవలెంతకాల మయ్యెడినో రాత్రినంతియయగు - అదియ ప్రళయమనంబడు. అనిమునులు సూతుంగాంచి యుగధర్మశేషమును జెప్పుమని వేడిన యిట్లని వక్కాణింపదొడంగె. త్రేతాయుగాదియందు మనువు, సప్తర్షులు, దారాగ్నిహోత్ర ఋగ్యజుస్సామ సంబంధములగు శ్రౌతస్మార్తధర్మములను విశేషముగజెప్పిరి. అప్పటి ఋషులు తపోబలముచే నొకయహోరాత్రంబున వేదములను సాంగముగ నధ్యయనముజేయుచుండిరి. అవ్వేదము లనాదిసిద్ధమని బ్రహ్మచేనుడువబడియె. అక్కాలంబున బ్రాహ్మణునకి జపయజ్ఞము, క్షత్రియునికారంభయజ్ఞము, వైశ్యునకి హవిర్యజ్ఞము, శూద్రునకి పరిచారయజ్ఞము విధిచోదితంబులైయుండె. అప్పటి ప్రభువులు ప్రజలకనుకూలముగ ధర్మములు జరుపుచుండిరి. అయ్యుగంబున ఆయువు రూపము బలము బుద్ధి ఆరోగ్యము ధర్మచింత ఇవి సర్వసాధారణములుగ నుండెనను యనేకధర్మములను జెప్పిరి.

త్రేతాయుగమునయజ్ఞప్రవృత్తివిషయము సం - అ - ౧౪౨.

అనివక్కాణించిన మునులు సూతుంగాంచి త్రేతాయుగంబున నెట్లుయజ్ఞంబుప్రవర్తిల్లె ననియడిగిన సూతుండిట్లనినుడువదొడంగె. కృతయుగసంధికడచినపిదప త్రేతాయుగాదియందు ఇంద్రుడు యిహపరసాధనంబగు యజ్ఞమునం దుపయుక్తంబగు మంత్రములచే నశ్వమేధయాగమును ప్రారంభించె. ఆయజ్ఞంబునకు కొందఱు మహర్షులు ఋత్విక్కులుగానుండిరి. అందులగ్నిహోత్రమునందు హవిస్సులు జేయుచుండగను, ఉద్గాతసామగానముచేయుచుండగను, హవిర్భోక్త

లగునింద్రాదిదేవతలు [illegible] లువబడుచుండగను, తక్కిన అధ్వర్యులు మొదలగువారు తమతమునియ [illegible] సుచుండగను, పశువులుపాకరణము జేయుచుండగను, అధ్వర్యుప్రేషకాలమందు ఋషులు లేచి పశువులనువీక్షించియింద్రునింగాంచి ఓయింద్రుడా! ఈయజ్ఞంబున నీవొనర్చెడి పశుహింస ధర్మనాశనంబునకు మూలముగనున్నయది. అహింస పరమధర్మముగదా; శాస్త్రానుసరణి నీవుధర్మమునుచేయుము, విధిచోదితములగు ధర్మములచేతనే యజ్ఞముజేయవలయు ధర్మార్థకామములనిచ్చెడి యజ్ఞవిధులు వేలుగానున్నవి - అట్టియజ్ఞములు బ్రహ్మచే నిర్మింపబడిన వని ఋషులు నుడివిన మానమోహ యుక్తుడగు నింద్రుడు వారివచనంబులను ధిక్కరించె - అంత వివాదంబు సంఘటిల్లె - మఱలనింద్రుడు ఋషులంగాంచి బ్రహ్మచేనిర్మింపబడినయజ్ఞము స్థావరజంగమములలో దేనిచేజేయవలయునని యడిగిన ఋషులు ప్రత్యుత్తరము జెప్పుట కోడి ఖిన్నులై ఖచరుడగు వసువునుమధ్యస్థముగోరి యతనింగాంచి మహాత్మా! యజ్ఞవిధానంబెట్టిది ? మాకుగలసంశయమును బోగొట్టుమని ప్రార్థించినవసువు నానావిధములగు ధర్మసూక్ష్మములగ్రహింపక వేదశాస్త్రములననుసరించి మంత్రలింగాదులను ఆలోచించి మోక్షాంతమైన యిహపరలోకసాధనము యజ్ఞమేయనియు, నాయజ్ఞమును, పవిత్రములగు పశువులు, కందమూలఫలాదులు - వీటిచేజేయవలెననియు నుడివిన ఋషులాగ్రహించి వసువును భూమింబడునటుల శపించిన నూర్ధ్వసంచారియగు నావసువు భూమింబడి పాతాళంబునంజేరి మఱలభూమిం జరింపుచుండె - కావున ధర్మంబున కనేకమార్గంబులుగలవు - వానిం దెలియనేరికిని శక్యముగాదు- యజ్ఞమునందు హింసదూష్యమని పూర్వము ఋషులువచించిరి. వారందఱనేక తపములుసలిపి స్వర్గమును బొందిరి - వారుహింసాయుక్తమగు యజ్ఞమును సమ్మతింపకపోయిరి. యజ్ఞము ద్రవ్యమంత్రములచేతను, తపస్సు మనస్సుచేతను, సాధింపనగు-యజ్ఞముచే దేవపదము, తపముచే వైరాజపదము, కర్మసన్న్యాసముచే బ్రహ్మపదము, వైరాగ్యముచేప్రకృతిలయము, జ్ఞానముచే కైవల్యమును, పొందెదరు-గానవి యైదుగతులుగనున్నయవి-పూర్వము ఋషులు వసువుచెప్పిన యజ్ఞవిధిని తెలిసికొనియు దాని నాదరింపకబోయిరి- ఋషులవలెనే ప్రియవ్రతుడు మొదలగు రాజులుగూడ తపముచే స్వర్గమునుబొందిరి. బ్రహ్మతపముసేసిజగత్తును సృజియించె. కావున యజ్ఞమునకన్న తపమధికఫలదంబగు.

ద్వాపరయుగ ధర్మము - సం - అ - ౧౮౩.

అనినుడివి ద్వాపరయుగ ధర్మముల మునులకు సూతుండిట్లని వక్కాణింప దొడంగె- ద్వాపరాదియందు త్రేతాయుగ ధర్మములుమారి ద్వాపరయుగ ధర్మము

లువాటిల్లె. అవిద్యాన్వయనిన లోభము, వ్యభిచారవృత్తి, వాణిజ్యము, యుద్ధము, తత్త్వానిశ్చయము, వర్ణసంకరము, కర్మవ్యత్యయము, రజస్తమోగుణవ్యాప్తి, అధర్మము, వర్ణాశ్రమధర్మములకు వైపరీత్యము, వేదములయందవిశ్వాసము, బుద్ధిభ్రంశము, స్వల్పాయువు, ఇట్టియధర్మములు ప్రబలుటయేగాక-ఏకరూపమగు వేదము ఋషులచే నాలుగువిధములుగ జేయంబడియె. మఱియు నట్టి వేదసూత్రాదులకు జనులు తమతమ మతానుసారముగ యర్థములను జెప్పెదరు. ఇటుల విపరీతధర్మములు వ్యాపించుటచే పాపంబతిశయిల్లు. ద్వాపరయుగ సంధిసంధ్యాంశములయందిట్టి యధర్మములు వృద్ధిజెంది ద్వాపరయుగాంతమున కలియుగధర్మములు ప్రారంభించు.

కలియుగధర్మములు.

ఇక కలియుగమునందు, హింసాచౌర్యానృతమాయాదులు వృద్ధియై తపంబులుక్షీణించి ధర్మస్వరూపంబునశించు. మనుజులవచనంబులుసిద్ధించుటలేదు. వారెల్లపుడు మోహసాగరమగ్నులై యుండెదరు. క్షుత్పిపాసానావృష్టి దేశవిపర్యయములు సదాకలుగుచుండు. శాస్త్రప్రమాణంబులులోపించు. మనుజులు కొందఱు గర్భమునందును, కొందఱు బాల్యయౌవన కౌమారములయందును, అల్పతేజస్కులై మృతిజెందెదరు. అనృతము, అధార్మికత్వము, కోపము, వ్రతలోపము, ఇవి మొదలగు వాటిచే మిగులపాపిష్ఠులుగనుండెదరు. బ్రాహ్మణులు వేదాధ్యయనమును యజ్ఞాదులనుత్యజించి శూద్రులచే మంత్రయోనిసంబంధులుగనుండెదరు. పాషండులు వృద్ధిజెందెదరు. కొందఱు కాషాయవస్త్రధారులై కాపాలికాదివేషములనుధరించి ధర్మహీనులయ్యెదరు. బ్రాహ్మణులు తమయునికిపోషణకై వేదవిక్రయము, జపతపహోమాదులను జేసెదరు. శూద్రులు వేదాధ్యయనముసేయుటకపేక్షించుటయేగాక ధర్మనిరూపణముచేయుటకు దలపడియెదరు. శూద్రయోనుల జనించెడి క్షత్రియులశ్వమేధాదిక్రతువులొనర్చెదరు, భ్రూణహత్యాదిమహాపాతకంబులు జేయుటకు శంకింపకుండెదరు. ఇటుల కలియుగసంధికాలముపరకు జరుగుచుండు. సంధిసంధ్యంశకాలములలో బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రవర్ణములుచెడి సంకరంబగు, శూద్రమ్లేచ్ఛప్రాయులుగనుండు రాజులను సంహరించుటకు భృగుకులమునందు ప్రమతియను నొకపురుషుడుజనించి యీభూమండలమున (౩౦) వత్సరంబులు సంచరించుచు నానావిధాయుధోపేతులగు విప్రులచే బరివేష్టింపబడి గజతురగరథపదాతులతోడంగూడి నానాదేశీయులగు దుష్టరాజులంబరిమార్చి పాషండులంబొరిగొని గంగాయమునల మధ్యప్రదేశంబువసమును - పిదపలోకరక్షకుడు లేమింజేసిప్రజలు తమతమమర్యాదలందప్పి లోభమోహాదిదూషితులై అన్యోన్యకలహంబుచే మృతినొందెదరు. ఇటుల జరిగినపిదప కృతయుగసంధియందు హతశేషులగు స్త్రీపురుషు

...కు జనించినవారు రాగల కృతయుగంబలిమిచే స్వధర్మముల నాచరింపుచుండ సప్తర్షులువచ్చి శ్రమాదినానావిధధర్మముల ప్రవర్తిల్ల జేసి లోకమునభివృద్ధిజేసెదరనియు-ఇటులనే ప్రతియుగంబునం దాయాయుగధర్మములు జరుగుననివచించె.

దేవాసురాదిపరిమాణకథనము-సం-అ-౧౭౭.

అనినమునులు మూతుంగాంచి మన్వంతరములు, దేవాసురయక్షగంధర్వమనుష్యాదుల వ్యక్తిప్రమాణంబులజెప్పుమని వేడిన వారలకిటుల జెప్పందొడంగె.

ఒక బ్రహ్మకల్పమునకతీతానాగత మన్వంతరములు పదునాలుగు - వీటియంతరములింతకుముందే విశదపరచియున్నయవి. కలియుగమునందు, మనుష్యులకుపరమాయువు (౧౦౦) వత్సరంబులు. కృతాదియుగములయందు దేవాసురమనుష్యయక్షగంధర్వరాక్షసు లేకరీతిగనుండెదరు. వీరపాదవు వానివానియంగుళములచే దొంబదియారు యంగుళముల యౌన్నత్యముగలిగియుందురు. మనుష్య పశు పక్షి మృగాదులకు యుగానుసారముగ హ్రాసవృద్ధులు గలిగియుండు. పశువులకు డెబ్బదియారు, గజముల కెనమన్నూరు, వృక్షములకు (౭౭౦౦౦) యంగుళములపరమావధిగల యౌన్నత్యముగలిగియుండు. మనుష్యులకెట్టి ముఖాద్యవయవములుగలిగియుండునో దేవతలకటులనుండినను బుద్ధియందు వారెక్కుడుగనుండెదరు. పశుపక్షి మృగాదులు మనుష్యుల కుపయుక్తముగనుండుననిచెప్పి పిదప సాధ్వాచారాదిధర్మముల జెప్పందొరకొనెను.

సాధ్వాచారధర్మములు.

శ్రుతులు, దేవతలు, పశువులు, ఇవియ సత్తులు. బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రులు ధర్మానుష్ఠానముల జేయుటచే సత్తులయ్యెదరు. బ్రాహ్మణాదులలో బ్రహ్మచారి గురుసేవాదులచేతను, గృహస్థు జ్ఞానసాధకమగు శ్రౌతస్మార్తకర్మానుష్ఠానములచేతను, వానప్రస్థుడుతపో విద్యాచరణముచేతను, యతిబ్రహ్మజ్ఞానయోగాభ్యాసములచేతను, సాధువులగుదురని వచించి ధర్మములజెప్ప నుపక్రమించె.

ధర్మావిలక్షణములు.

దేవతలు, పితరులు, ఋషులు, శిష్టులగు మనుజులు, వీరలచే దెలుపబడునవియ ధర్మాధర్మములు - అందు స్వర్గాదిప్రాపకజ్యోతిష్టోమాదులు ధర్మములు - అనిష్టమగు నరకాదిసాధనకలంజభక్షణాదు లధర్మములు - వృద్ధులయ్యు చపలులుగాక డంభాదివర్జితులగు వారు శిష్టులని [illegible] స్మార్తమనియు [illegible] ...శ్రౌతధర్మము - బ్రాహ్మణాదివర్ణములకును బ్రహ్మచర్యాద్యాశ్రమంబులకును విధిం

వబడిన సదాచారంబులు, ఇద ౧ ౬ ౨ [illegible] యయగుచి శేషంబులు, ఇవియస్మా ర్తధర్మములు, ఆచారములును [illegible] స్వాయంభువమనువు, భృగ్వాదిసప్తర్షులు, కురుక్షేత్రాదులయందుండెడి ధర్మప్రవర్తకులు, వీరలాయాయుగంబున ధర్మవ్యవస్థాపకులుగనుండెదరు. దానము, సత్యము, తపము, అలోభము, ఇజ్య, దేవపూజ, దమము, ఇవి శిష్టలక్షణములనిచెప్పి సూతుండు ఋషిలక్షణములవివరించె. అవియె వ్వియనిన ప్రతిమన్వంతరమున ఋగ్యజుస్సామరూపములగు వేదములవరుస వెవ్వేరుగనుండు - అవ్వేదములు - విధిస్తుతి, ద్రవ్యస్తుతి, గుణస్తుతి, కర్మస్తుతి, జనస్తుతి, బ్రహ్మస్తుతి, ఇటుల ననేకవిధములుగ నున్నయవి. ప్రతిమన్వంతరమున భృగువసిష్ఠాది ఋషులుగతమన్వంతరాంతములయందు లుప్తమైన వేదభాగములను తమ తపోమహిమచే బూర్ణముగ జేయుటవలననే ఋషులని పేర్కొనంబడియెదరు. వీరిలో బ్రహ్మపుత్రులగు భృగ్వాదులుముఖ్యులు - శుక్రబృహస్పతి మొదలగువారు ప్రవరాధ్యాయమునందు ప్రసిద్ధులుగనుండెదరు. వీరును బ్రహ్మర్షులే - వైవస్వతమనువు మొదలగువారు క్షత్రియఋషులు - బలంధుడు మొదలగువారు వైశ్యఋషులు, ఇటుల ఋషిసంతతివివరింపబడియె.

తారకాసురవధకథ - సం - అ - ౧౪౫.

అనిన మునులుసూతుంగాంచి తారకాసురవధకథ వివరింపుమని ప్రార్థించిన సూతుండు ప్రీతమనస్కుడై మనువుకు మత్స్యుడు చెప్పిన చాద్పుననిట్లనియె.

తొల్లివజ్రాంగుడను దైత్యుడుకలడు-అతనికి తారకుండనుసుతుడుద్భవిల్లికడు బలవంతుడై ఇంద్రాదిదేవాళినెల్ల బారదోలినవారుభీతాత్ములై కమలజుకడకరిగిన నతండు పిటికి వేల్పులంబొడగాంచి యోదేవతలారా! మీరలుభయంబు దెగడుడు -శంకరునిసుతుండును హిమవంతునిపౌత్రుడునునగు షణ్ముఖుండువధించెడిని అని చెప్పి వారలంబనిచె - అంతకొంతకాలంబునకు ముక్కంటి, గట్టిరాయనివట్టిని పరిణయంబొంది కారణాంతరమున తనవీర్యమునగ్నిముఖమున వదలిననతడు దాని దేవతలకొసంగె-వారలకుక్షులందది జీర్ణముకాక వారిగర్భములు ప్రకటించుకొని శరవణవనమందుండు పరోపరంబుజేరె. అందుండి సూర్యసమానోపేతుడగు కుమారుండుద్భవిల్లి యేడవదివసంబున తారకునివధించెనని సూతుండుచెప్పిన మునులు వెగడొంది మహాత్మా! నీవుచెప్పినయుపాఖ్యానము మిగులచిత్రముగను పరమపవిత్రముగమన్నయది - కావునవజ్రాంగుండెవడు? వానివరంబెట్టిది? వానికి తారకుండెటులనుద్భవిల్లె? సవిస్తరముగ నానతిమ్మని మునులు వేడిన వారలసూతుండిట్లనియె-బ్రహ్మమానసపుత్రుండగు దక్షుండనుప్రజాపతికలడు-అతను వైరిణియనుభార్యయందఋవదికూతుంద్రనుపుట్టించె. అందుపదునొకరిని ధర్మునకునుపదమువ్వురిని కాశ్యపునకు

...రు ఇరువదియేడ్గురుని చంద్రునికిని నలువురిని నరిష్టనేమికిని ఒకతెను బాహుకపు
...నకిని ఇరువురిని అంగిరస్సునకును ఇరువురిని కృశాశ్వునకును సమర్పించె. కశ్యపు
...ద్భిన పదమువ్వురిలో ఇంద్రోపేంద్రాదులు దితికిప్రభవించిరి. దితికి హిరణ్యకశి
...ప్రభృతులుద్భవిల్లిరి-సురభికిగోవులును వినతకు గరుడాదిపక్షులును, కద్రువకు శే
...షుడు మొదలగు సర్పములును జనించె- అందుహిరణ్యకశిపుడు త్రైలోక్యనాథుండ
...సురపతినోడించి రాజ్యంబుగైకొని మత్తుడై యుండుతఱి కొంతకాలంబునకు విష్ణువు
...హిరణ్యకశిపుప్రభృతి దైతేయులను బొరిగొనియె-తక్కిన దానవులను ఇంద్రుండు
...పుమాపె - అంతదితి కశ్యపుజేరంజని తనపుత్రనాశమును దేటపడంజెప్పి సంగ
...ంబున నింద్రుని జయించునట్టి పుత్రుంగోరిన నతడనుగ్రహించి సహస్రవత్సరంబు
...ు పరిశుద్ధతనుండుమని వాక్రుచ్చె- అంతదితియును గర్భంబుదాల్చి నియతయైయుం
...నింద్రుండు తన్నువధించెడి శత్రువుజనించునని తలంచి సహస్రవత్సరంబుల మధ్యవి
...స్నంబున నొకడైననేని యాశిశువునుపట్టి వధించెదనని యెంచి దితిసమీపంబునం జేరి
శుశ్రూష చేయుచు యంతరప్రేప్సుడై యుండ తొమ్మన్నూట తొంబదితొమ్మి
ది వత్సరంబులుగతించె- అంతదితి కృతార్థురాలనని మదినెంచి నింద్రుంగాంచిపుత్రా!
నేవ్రతము సమగ్రముగ నాచరించితి నీకనుజు డుద్భవించు కావున వానితోకూడ నీవు
రాజ్యసంపదను సుఖంబుగ ననుభవింపుమని చెప్పి మఱదియశుచియై శిఖముడివిడ
నిద్రించుట నింద్రుండుగాంచి యతిరయంబున నుదరంబుజొచ్చి గర్భస్థపిండము నేడు
ఖండములు చేసి అందొకొక్కదాని నేడేడు శకలములుగావించిన నంతదితి మేల్కాంచి
ఓరియింద్రా! నాసంతానమును వధింపకుమనిన యింద్రుడుదితినివీక్షించి ఓతల్లీ! నీవుకు
రులముడివిడి పగలు నిద్రించితివి గావున నీగర్భంబునంజొరబడి అందలిపిండమును నలువ
దితొమ్మిది శకలములుగావించితి కావున వారికిస్థానంబులనొసంగెదననియె. అంతదితి
మారుమాటాడక కశ్యపుంగాంచి మహాత్మా! ఇంద్రుంజయించునట్టిపుత్రునిమ్మని మఱ
లంబ్రార్థించినయతనువజ్రకవచయుక్తుడగు పుత్రునింగాంచెదవని వరంబొసంగె. అంత
నాదితితపంబునకు వనంబునకరిగి (౧౦౦౦౦)వత్సరంబు లత్యుగ్రతపం బొనర్చిన శ
త్రుదుర్జయుండగు వజ్రాంగుడు శస్త్రాస్త్రయుక్తుడై జనించి తల్లింగాంచి ఓతల్లీ! నే
నేమి జేయవలయుననిన వానింజూచి నాకుజనించిన ననేకసుతులనునింద్రుడు వధించెం
గావున నీవతనివధింపుమని జెప్పె-అత్తఱిబ్రహ్మయును కశ్యపుడును నేతెంచి వజ్రాం
గునింగాంచి స్వాధీనుడగు దేవేంద్రుని జంపుటచే బ్రయోజనంబెద్ది అతనుబ్రతికియు
చచ్చినవాడే- అనిన వజ్రాంగుడు కమలజుంగాంచి నేతపంబున కేగెద- విఘ్నంబు
లేకుండు నట్లనుగ్రహింపుమని వేడిన కమలజుడు సంతసిల్లి వజ్రాంగియను నొక
కన్నియంబుట్టించి యతనికొసంగి యంతర్ధానంబునొందె. పిదపనావజ్రాంగుడు వ
జ్రాంగింగూడి వనంబునకరిగి యూర్ధ్వబాహుండై (౮౦౦౦)ల వత్సరంబులు తప

బుసలిపి మఱల యధోముఖుండై (౫౦౦౦) వత్సరంబులును పంచాగ్ని మధ్యంబున (౫౦౦౦)వత్సరంబులును జలమధ్యంబున(౧౦౦౦) వత్సరంబులును తపంబునలిపె-జలమధ్యంబున తపంబుజేయునపుడు అతనిభార్యయగు వజ్రాంగి యాతీరంబునసే మౌనంబున తపంబుజేయుచుండ ఇంద్రుండు వానర రూపంబున వజ్రాంగికడకే తెంచి యచటి సామగ్రుల బడద్రోచి సర్పరూపంబున పాదంబులకుం జుట్టుకొని కొంతదూరంబీడ్చి జంబుకరూపంబున యాశ్రమంబపవిత్రంబుగావించి మేఘరూపంబున నాయాశ్రమంబు నీటంజేలించి మఱియు ననేకభంగుల పీడించిన వజ్రాంగి తానుతపంజేసెడి యాశ్రమంబును పర్వతంబునకు శాపంబిచ్చుటను గమకించిన నా పర్వతరాజు ప్రత్యక్షుడై నేనేమిచేయుదు-ఇంద్రుండిట్టివికారంబులు చేయుచున్నాడనిచెప్పె - అదస్లుండ - వజ్రాంగునికడకు పద్మజుండేతెంచి నీవుతపంబుచాలించి జలంబునుండి బయలువెడలుము- నీతపంబునకు మెచ్చితి కోరినవరంబులిచ్చెద వేడుమన వజ్రాంగుడు నీటనుండి వెడలివచ్చి కమలజునకు మొక్కి- నాకాసురభావంబున యక్షయలోకంబులును తపంబునందాసక్తియుగలుగునటుల వరంబొసంగుమని వేడిన యటులయొసంగి యంతర్హితుడయ్యె - అంతవజ్రాంగుడు నాహారముకోరి తనయాశ్రమంబునకు జనుదెంచి భార్యంగానక ఫలాదులకై పర్వతంబున సంచరింపుచుండ నొకయెడ రోదనంబుజేసెడి తనభార్యంగాంచి డాయవచ్చి ఓసుందరీ ! నీకిట్టియాపదను గలుగజేసిన వాడెవడు? చెప్పుము వానినిపుడె యమపురికనిపెదననిన వజ్రాంగియిట్లనియె.

## తారకోత్పత్తి- సం - అ - ౧౪౬.

ఓదైత్యశ్రేష్ఠా! దుర్మార్గుడగు ఇంద్రునిచే నేననేకకష్టముల జెందితి-గాన ప్రాణత్యాగంబుజేసెద - అట్లు సకష్టములేదేని మహాభాగ్యవతారకుండగు పుత్రుని యొసంగుమనిన వజ్రాంగుడు భ్రుకుటీకుటిలాననుండై ఇంద్రునిజయింప బలముగల సుతుంగోరి క్రూరంబగు తపంబుజేయసమకట్టిన నది కమలజుడరసి వజ్రాంగుని కడకరుగుదెంచి యతనింగాంచి నీవునిట్టి తపంబుజేయుటకేల పనిగొంటివనిన నతండు ఇంద్రునివలన నాభార్యకమితంబగు ఆపదసంఘటిల్లినది - అతనిజయించెడి పుత్రునొసంగుమని వేడిన యటులవరంబొసంగి కమలజుండు తనపురంబునకుం బోయె. వజ్రాంగుడును ముదమంది గృహంబునకుంజని యావృత్తాంతంబంతయు తనయువతికెరుంగించి భార్యాభర్తలిరువురును సుఖంబనుభవింపుచుండ వజ్రాంగి గర్భముదాల్చి (౧౦౦౦) వత్సరంబులకు సుతుంగనియె - అంతవజ్రాంగుడు ముదమందె- భూమివడంకె- పర్వతంబులుకదలె - సుడిగాడ్పులు చెలరేగె - సింగంపుకొదములు ధ్వనులొనర్చె- సోమార్కుల తేజంబు మందంబయ్యె - దిగంబులుమంచుచే

గప్పబడియె - ఋషులు భయనివారణార్థము జపంబులు చేయుటకు తలపడిరి - అసురులు తమయంగనలం గూడి యానందభరితులైరి - దానవులుప్పొంగిరి - సురలుభయంబుచే విషణ్ణమనస్కులైరి - వజ్రాంగి మహదానందపరవశయయ్యె - దానవులందరు గుమిగూడి యాశిసువును పట్టణాభిషిక్తుం గావించిన యతనుమహారాజ్యసంపన్నుండై దానవులం గాంచి యుక్తియుక్తంబుగ నిట్లనియె.

తారక ప్రభావము - సం - అ - ౧౪౭.

ఓయసురులారా ! నే జెప్పెడి వాక్యమును వినుడు - దేవతలు మనవంశమును నాశము జేయ జ్ఞాతివైరమును పలుమారులు ప్రకటించెదరుగాన వారినిజయించుటకు నేతపంబునకు బోయెదనని పారియాత్రపర్వతంబునకరిగి యనేకవత్సరంబులు తపంబు జేయుచునూరువత్సరంబుల కొకతూరి యొకనిమిష పరిమితిగల తనశరీరమాంసము నగ్నిలో హోమము చేయుటను దేవతలు దెలిసికొని వెరగొందుచుండ కమలజుండతనికడకేతెంచి నీతపంబునకు మెచ్చితి; వరంబు వేడుమన నతండు తనజాతియులుతనచే రక్షింపబడునటులను తానితరులచే నవధ్యుండగునటులను వరంబు వేడినకమలజుండు యెవ్వరిచే నవధ్యుండగునటులడిగినవరంబునకు సమ్మతింపక సప్తవాసరంబులుగల నిసువుచే నీకోరినట్లు మరణంబుగలుగుగాక యనివరంబొసంగి యంతర్హితుడయ్యె - అంత తారకుండు నిజనివాసంబునకరిగిన దైత్యులత్యుత్కంఠత గొలిచియుండ తారకుండు వారలం గాంచి ఇంద్రుని జయింపవలయుగాన యుద్ధోపేతసన్నద్ధులై శీఘ్రింబుగ రథంబుం దెండని నియమింజేసె - దైత్యసేనాగ్రేసరుడగు గ్రసనుడు బలంబులం గూర్చి నాలుగు యోజనముల యాయామమును, ఎనిమిది చక్రములుంగలిగి గరుడపక్షులచే నలంకరింపబడిన రథమును పదికోట్ల సేనాధిపతులను తోడగొని తెచ్చిన తారకుండుతిరయంబున రథంబు నెక్కె - కయ్యంబునకుం జనుదేర శతశార్దూలంబులం బూన్చిన రథంబును గ్రసనుడు, నూరు సింగంబులం బూన్చిన రథంబును జంభుడు, పిశాచముఖంబులుగల నూరుగార్దభంబులం బూన్చిన రథంబును కుజంభుడు, నూరు ఉష్ట్రింబులం బూన్చిన రథంబును మహిషుడు, నూరు ఘోటకంబులం బూన్చిన రథంబును గజుడు నెక్కి వెడలిరి. ఇటుల వెడలిన దానవబలంబును వాయువుజూచి, ఇంద్రునికెరింగింప నావేల్పులవారె కించిన్మాత్రంబు నిమీలితలోచనుండై బృహస్పతినిపొడగని, దుర్జయులగునసురులనే యుపాయంబున జయింపవచ్చునన నతండు కాలోచితకృత్యములను యోచించి ఇంద్రుని గాంచి దండోపాయంబులందప్ప సామాద్యుపాయంబుల నసురులజయింపజాలముగాన సంగరంబునకు వెడలుమనవల్లెయని దానవులబలంబులకెదుట దేవబలంబు జేరె - సేనాధిపతియగు యముండు మహిషారూఢుడై సేనాముఖంబున నిలిచె - అగ్నితగరు వాహనమును, వరుణుడు భుజగరూ

వంబగు రథంబును, నిర్ృతినరవాహయుక్తరథంబును, కుబేరుడు సింహాయుక్త రథంబును, చంద్రుఁడశ్వయుక్తరథంబును, గంధర్వాదులనేక లనేకవాహనంబుల నెక్కి సంగరస్థలమునందలి యింద్రునిరథంబును జుట్టిముట్టియుండిరి- అంతరక్కసులు ఱొజ్జునివస్త్రంబులను ఇనపతొడవులనుధరించి ముసలాద్యాయుధంబులంబూని వికృతరూపములతోడనే తెంచిరి.

దేవాసురయుద్ధము - సం - అ - ౧౪౮.

ఇట్లు దేవదానవులు పరస్పరజయేచ్ఛలచే వీరావేశంబులు వహించి గజంబులుగజంబులతోడను, తురగంబులు తురగంబులతోడను, అరదంబులరదంబులతోడను, పదాతులు పదాతులతోడను, బహుభంగుల పెనంగుచుండిరి.

యమగ్రసనాసురయుద్ధము - సం - అ - ౧౪౯.

ఇట్లుండయముండు గ్రసనాసురు నాలోకించి క్రోధమానసుండై వాని యుదరంబున యనేకబాణంబులనాటనేసె - గ్రసనుండుగ్రుడ్డై బాణపరంపరలచే యమునింగప్పిన యతండు వానిఖండించి గ్రసనునిపై ప్రాసాయుధంబు బ్రయోగించిననతండు కించిన్మూర్ఛఁజెందె - అంత జంభుడను రక్కసుండుక్కుమిగిలియమునిపై భిండివాలంబు బ్రయోగించిన నతండురక్తంబు గ్రక్కుచు నేలంబడియె. అంతగ్రసనుండు మూర్ఛందెలిసి యమునింగని యరిమర్దన గదంబ్రయోగించె - అంతయముండుసింహనాదంబు చేయుచుదండాయుధంబుం బ్రయోగించె - ఇవిరెండును మింటికెగసి పోరుచుండుతఱి ప్రళయంబుసంఘటిల్లునని లోకంబులుభీతిల్లె - అంతయమునిదండంబరిమర్దన గదంబడగొట్టి గ్రసనునిపైబడిమొత్తిన నతండు నిశ్చేష్టుఁడై భూమిం ద్రెళ్ల రక్కసులాహాకారంబులు చేసిరి - వ ఒకముహూర్తంబునకు గ్రసనుండుతెలివినొందిపండ్లుపెటపెటకొరుకుచునొడలుజువ్వాడింపుచు యమభటులంగాంచి ముద్గరంబుచే గొట్టిన యముండు దందహ్యమాన మానసుండై కొందఱు శూలంబులచేతను, కొందఱుబాణంబులచేతను మఱికొందఱుగదలచేతను, కొందఱుముద్గరంబులచేతను ఇట్లనేకులనేకభంగుల నిర్జీవితులంగావించె- గ్రసనుండు కింకరులతోడంబోరి యలసినయముండు గ్రసనునిరథంబునబూన్చిన యశ్వంబులను తనదండముచేఁబడగొట్టె - అంతగ్రసనుండు రథంబుడిగ్గియమునికడంజేరి యతనిపిడిగుద్దులనొప్పించి తనకటివస్త్రంబునం జుట్టిగిరగిరంద్రిప్పి నేలంగొట్టిన రక్తంబుగ్రక్కుచు మూర్ఛిల్లె - అంతగ్రసనుండు తనసేనంజేరి పర్వతంబుభంగి మెరయుచుండె.

కుబేరజంభాసురాదులయుద్ధము.

అంతకుబేరజంభులు బహుభంగులపోరు నవసరంబున కుబేరుండొకగదంబ్ర

యోగించినదానిచే జంభుడుహతుడయ్యెనని కుజంభుడుదలంచి కుబేరుని తనబాణ
ములచేగప్పిన నాబాణంబుల విఫలంబుగావించి కుజంభునిపై నొకశక్తింబంపినయ
దియతనివక్షంబుంజీల్చి నేలంజొచ్చె-అద్దానవుండు ముహూర్తకాలంబున మూర్ఛం
దేరి కుబేరుంగాంచి తనపట్టిసాయుధం బతనియుదరంబుననాటనేసిన సొమసి రథం
బుపైబడియె-అదినిర్బృతిగాంచి కుజంభునిపై దూరంబునకరిగిదానవనేసిన రూపడంచె-
కుబేరుండును మఱలందెలివొంది గరుడాస్త్రమునుబ్రయోగించిన యదియనేకరూ
పంబులగాండుచు వెడలిరక్కసులబలంబును దగ్ధంబుగావించిన కుజంభుడుగనలి
కుబేరునిపైగదిసిన నతనువిహ్వలమానసుండై తనకిరీటంబును నేలంబడవైచి మకుట
విహీనుడై ఇంద్రునికడకేతెంచె యక్షులారత్నమకుటంబు జూచుచుండ కుజంభు
డు భుసుండిచే వారలనోడించి దానిం గొనిచనియె-అంతనిర్బృతి కుజంభునితో బోరు
తఱి తిమిరంబుగప్పి దానవులను దుర్బలులంగావించిన దానినరసి మహిషాసురుడు
సూర్యాస్త్రముచే తిమిరముంబాపె- అంతదానవులుమత్తులై నిర్బృతితోఁబోర సమ
కట్టిరి- అంతనిర్బృతి ప్రళయకాలయమునింబోలి యొకబాణంబున కుజంభుని సారథిని,
నాలుగస్త్రంబుల యశ్వములనుద్రెళ్లనేసిన కుజంభుడు హుంకరించి నిర్బృతింబట్టి
ఖడ్గంబుచే నతనిశిరంబు దెగవేయంబూనిన వరుణుండు పాశాయుధంబున వాని
హస్తంబులంగట్టి గదచేవానితలంగొట్టిన రక్తంబుగ్రక్కుచు నేలంబడిన మహిషు
డాయవస్థనుజూచినిర్బృతివరుణులద్రిమింగగమకించిన వారిరువురు మహిషుమార్గముం
దొలిగి నిర్బృతియింద్రునికడకేతెంచె- చంద్రుడు చంద్రాస్త్రమును వాయవ్యాస్త్ర
మునుబ్రయోగించిన దానవులుశీతబాధపీడితులై నిశ్చేష్టులై సంగరంబునను పరా
ఙ్ముఖులైరి ఇట్లుండ కాలనేమి వారలంగాంచి ఓయసురులారా! మీలోనొక్కొకడు
త్రిలోకంబులద్రిమింగుటకును దోలనలెనాడించుటకును జాలుదురు - మీకిట్టిపిరికితనం
బేలబొడమె- సంగరమునుండి తొలగెడివారి ప్రాణములను ప్రభువను మనతార
కుండు హరిగొనునని పలికిచిత్తనమాయచే (౧౦౦౦౦) సూర్యులను అందరగ్నులను
గల్పించి లోకత్రయంబునకు తేజంబుగావించిన చంద్రుండు వేడిమికోడి సంగరస్థ
లంబువిడిచిచనియె-అంతసూర్యుండు కాలనేమి మాయంగాంచి రోషించి శంబరా
స్త్రంబును ఇంద్రజాలాస్త్రంబును బ్రయోగించిన శంబరాస్త్రతాడితులగు దాన
వులు దేవతలైరి- దేవతలు దానవులైరి- దానవులుపరస్పరము ఖడ్గంబులచేతను శిల
లచేతను గదలచేతను ఇనుపగుదియలచేతను కొట్టికొని యమపురంబునకరిగిరి- నిమి
యనురక్కసుండు కాలనేమింజూచినీచే నసురులకిట్టిచెడుగువాటిల్లె- పదిలక్షులదాన
వులుహతులైరి- సర్వాస్త్రసంహారకరంబగు బ్రహ్మాస్త్రంబు బ్రయోగింపుమనిన
కాలనేమి అటులొనర్చె- దానిచే శంబరాస్త్రంబు పెంపడంగె-అంతసూర్యుండు
క్రుద్ధుడై మహేంద్రజాలంబునం బ్రవేశించి యనేకసూర్యులంగల్పించిన లోకంబులు

తపించి యగ్నివర్షంబువాటిల్లిన దానవులు వ్యధితులైరి - కాలనేమి ఇట్టి మహోత్పాతంబునుగాంచి తాను మేఘరూపముదాల్చి సూర్యబహుత్వమువారించి మిక్కుటముగవర్షించి యసురుల బ్రోకించి బలమునదిమించి సురలను బాణవర్షంబుననోడించిన సురలుగతిచెడి శీతబాధపీడితులుగనుండిరి- అంతయశ్వినీదేవతలుసంగరంబునకేగి యనేకబాణంబులచే గాలనేమింగప్పిరి-అతను చలింపక యశ్వినీదేవతల సర్వసన్యశంబులను బాణములచే నొప్పించె - అశ్వినులాబాణంబులనుఖండించి యిరువదిబాణంబుల దనుజుల నుదరంబుంబీల్చిన దనుజులు రోషావేశులైగుదియలచేమొత్తిరి - వాటిందప్పించుకొని యశ్వినులాకసంబునకెగసిరి- ఆగదాపాతముచే వారిఘోటకంబులును రథంబులునునశించె-అంతనశ్విను లాకసంబుననుండి వజ్రాయుధవర్షంబుచే గాలనేమితోబోరిరి-కాలనేమివారుణాస్త్రముం బ్రయోగించి వజ్రాయుధంబుల చూర్ణంబులుగావించిన అశ్వినులుకాలనేమితో కయ్యంబునలుపనోపక వెగడొంది ఇంద్రుకడకుం జేరిరి - ప్రళయకాలరుద్రునింబోలు కాలనేమిం జూడగాంచి వేల్పుల కపజయంబు రక్కసులకు జయంబు ఘటిల్లునని సకలభూతంబులు భీతిల్లె - దిగ్గజంబులుచలించె - పర్వతంబులువడంకె - మింటనుండి నిప్పులురాలె- గరుడధ్వజుం డీయుత్పాతంబుంగాంచి సమరంబునకేతెంచిన కాలనేమి మొదలగు దానవులువీక్షించి యితనియాశ్రయించి యింద్రాదులు యజ్ఞంబులహవిర్భాగంబులంగొనిరెదరు- కావున నితనిజయించితివేని వేల్పుల నిర్మూలంబుగావింపనగునని కయ్యంబునకుదలపడి కాలనేమి అఱువదిబాణంబులను, నిమిదతిజుడు నూఱుబాణంబులను, మథనుడు ఎనుబదిబాణంబులను, జంభాసురుడు డెబ్బదిబాణంబులను, శుంభుడుపదిబాణంబులను.ఇంకననేకు లనేకబాణంబులను వేసిన విష్ణువువాని చూర్ణంబుగావించి వాఱల ఆతేసి బాణంబులచే దనుజులనొప్పింపనగిడచే గాలనేమి తలంగొట్టిన యతనికిరీటంబు చూర్ణంబయ్యె- వాడు నిశ్చేష్టుడై రథంబునంబడియె- విష్ణువుకాలనేమింగాంచి ఓరిదనుజా! నీవిపుడు బ్రదికితివి- నిర్భయుడవై యుండుము- కొద్దికాలమున నినుబోరిగొనియెదనని నుడివిన నక్కాలనేమి సారథి వానిరథంబును దూరముగ గొనిచనియె.

గ్రసనాసురవధ - సం. అ. ౧౫౦.

దానవులునిగుల క్రుద్ధులై యమిత బలంబులంగూడి సంగరస్థలికేతెంచి విష్ణుంగాంచి (౭౭౦౦౦)ల కిరీటధారులును వారివారిగజాశ్వపదాతు లొక్కమొగిందాకి భిండివాలపట్టిస ముద్గరశూలా ద్యనేకాయుధంబులం బ్రయోగించిన విష్ణుండుకోపోద్దీపితమానసుండై వానినన్నిటిని నుసియలు గావించినిమిని యిరువదిబాణంబులచేతను మథనుని పదిబాణంబులచేతను శుంభుని నైదుబాణంబులచేతను

మహిషు నొకబాణంబుచేతను జంభుని పండ్రెండు బాణంబులచేతను తక్కినవారిని మూడుమూడు బాణంబులచేతను మూర్ఛితులం గావించె. అంతనతి మూర్ఛం దెలిసి భల్లమును చేబూని విష్ణుని ధనువును ఖండించె. అంత సంధించియున్న బాణమును మహిషుండును గరుడుని జంభుండును ప్రహరించిరి. ఇట్లు పరస్పర జయేచ్ఛలం బ్రయోగించెడి బాణపరంపరలు ముల్లోకంబులం నిండియుండె. దైత్యసేనానాయకుడు గ్రసనుండు బ్రహ్మాస్త్రమును ప్రయోగించిన విష్ణువు తన బాణంబుల చే దానిని వారించె. అంత విష్ణువు దండాస్త్రమును బ్రయోగించిననది గాడ్పులు వీచుట చే భూమి గడగడవడంకె. సముద్రంబులు కలంగె. దానవుల సేనలు హతులైరి. గ్రసనుడు ప్రయోగించిన నారాయణాస్త్రము చే దండాస్త్రమున కుపశాంతి వాటిల్లె. పిదప విష్ణువు సుదర్శనచక్రముం బ్రయోగించిననది గ్రసనుని తల ద్రుంచి మరల విష్ణువుం జేరె.

విష్ణుపలాయనము - సం - అ - ౧౫౧.

ఇట్లు దానవులు గ్రసనుని మరణంబునకు చింతింపుచుండ విష్ణుని మథనుడు భిండివాలంబు చే గొట్టిన పదునైదు బాణంబుల విష్ణువు వాని రూపడంచి మహిషాసురుండు కయ్యంబునకు గమకించిన ననేక బాణంబుల వానిం బడగొట్టి నాలవజన్మంబున స్త్రీ చే మృతినొందెదవు గాని మరణంబు సేయవలదని వారుణులం జేసె. అంత శుంభుండు క్రోధగర్జితలోచనుండై హరిం దాకిన నగడు వానిం గాంచి యోరి దానవాధమా! కుమారిస్వామి చే నీ మరణంబు సంఘటిల్లు గాన వైరంబు మానుమని హితవుం దెలిపె. ఇట్టి మాటలు విని నిమిగదను జంభుడు పరిఘంబును బూని హరిం దాకిన హరి మూర్ఛిల్లి నిమిషమాత్రంబున మూర్ఛం దెలిసి సంగరంబును వదలి మరలె.

తారకాసురవిజయము - సం - అ - ౧౫౨.

ఇట్లు మరలిన విష్ణుం గాంచి సురలు చింతిల్లిరి. అసురులు సింహనాదంబులు చేసిరి. సురలు విష్ణుకడ కేగి ఓ లక్ష్మీకాంతా! దుష్టమనస్కులగు దానవుల బోరిగొనవేని లోకంబులను బాధించెదరు. అల్పుని కుపకారము సేసిన వ్యర్థమగు. సోదరుని మరణంబునకాగ్రహించి మిమ్మెదిర్చిన హిరణ్యకశిపుడు మృతినొందె. అతని సేనలు నీతో బోరి యగ్నింబడు మిడుతల చందంబున హతులైరి. యుద్ధంబున దైత్యదానవుల మృత్యువు పాలు గావించితిరి. అటులయిపుడేల జేయరని సురలునుడివిన విష్ణువు సురేంద్రుం గాంచి దైతేయులను పాయంబున బోరిగొనవలయు గాన బలము చేజంపుట కలవి కాదు. అదెట్లన్న, తారకాసురుడు యేడుదినముల శిశువు చే మృతినొందు. జంభాసురుని నీవ వధింపవలయు నని చెప్పిన పద్మనాభుని వాక్యంబుల గైకొని యింద్రుడు దేవతలం గాంచి సురలారా! మీరు యుద్ధంబునకు వెడలుడని యాజ్ఞనొసంగి ఏకాదశరుద్రుల ముందిడుకొని తానైరావతంబు నెక్కి పురంబునకు వెడలె. విష్ణుం

డు పృష్ఠరక్షకుండుగానుండె - ఇట్టుల సేనాపరివృతుడై వచ్చెడి దేవపతింగాంచి గ
జాసురుండెదిర్చి బ్రహ్మాండంబు వ్రక్కలగునట్టుల పెడబొబ్బలిడుచు కొండలపా
దఘట్టనంబుచేతను కొండలతుండంబుచేతను వాటికొండల పరశ్వధాద్యాయుధం
బులచేతను ఇట్టుల తిరస్కారముగావింపుచుండెడి గజాసురుంగాంచి యక్షగంధర్వకిం
పురుషాదులనేకాయుధంబులుజొనిపిన నవియన్నియు గ్రసించి ఘీంకారముసేయుచు
నిర్భయుడై సంగరతలంబున చరించుచుండె అట్టియెడ నేకాదశరుద్రులును స్వరాలోక
నంబులచేయుచు వీనిజయించుదమని పలుకుచుండ నందు కపాలియను రుద్రుండావా
క్యంబుల నాలించి తీక్ష్ణంబగు నొక శూలాయుధంబు బ్రయోగింపు తఱి తక్కినరుద్రు
లును తమతమాయుధంబులం బ్రయోగించిరి. అంత నాగజాసురుడు బలంబు చెడి
రక్తంబు గ్రక్కుచు ప్రాణావశేషుడై యుండ కపాలి కత్తియుక్తగు వానిచర్మము
ను వస్త్రంబుగావించికొనియె. ఇట్టుల గజాసురుని పాటుగాంచి నిమిదానవుడు గ
జంబునెక్కి పురంబున నిలచిన నింద్రునిగని వాని గజముంగాంచి పలాయనంబు
నొందె - ఐననింద్రుండు తలద్రిప్పచక్రాయుధంబుచే వాని తుండంబునడచి గదాయు
ధంబుచే గజంబును మరణము నొందించిన నిమిదానవుండవి లెక్కింపక ముద్గరం
బుచే నైరావతంబుం గొట్టిన నాపెట్టునకు దట్టుచెడి భ్రామింబడినయల దిట్టతనమున
యుద్ధరంగమునుండి పలాయనంబయ్యె - అంతవాసవుడు సక్రోధుడై గదచే నిమి
దానవుని వాని గజంబును మొత్తిన నక్షణంబ వానిగజము మరణంబునొందె- పిదప
నిమియు బరాజితుడయ్యె - అదిపీక్షించి దేవతలు సింహనాదంబులజేసిరి - ఇట్టిసు
రనాదంబులాలించి జంభుండాజ్యసిక్తంబైన నగ్నింబోలి ప్రజ్వలింపుచు రథంబు
నెక్కి సురలనిలునిలువుడని యదలింపుచు బ్రోలనిలచిన నింద్రుండు విల్లుచేబూని యర్ధ
చంద్రాకారబాణము సంధించి జంభునిచేనున్న విల్లుందునిమె - అంత వాడు వేరొక
విల్లందికొని నింద్రునితో ఘోరయుద్ధంబుజేసె - మఱియు వాడనేకదానవమాయచే
యుద్ధంబున సురలమోహింపజేసిన నింద్రుడు నుక్కియేమియుం దోచక తడబడుచు వి
ష్ణుప్రేరితుడై బ్రహ్మాస్త్రంబు బ్రయోగించి వాని శిరంబుం దునిమె. అవ్వార్తను తార
కుడాలించి కోపోద్దీపితమానసుడై గరుడపక్షులచే నలంకరింపబడిన జయశీలంబ
గు రథము నెక్కి సంగరంబునకేతెంచిన నింద్రుండైరావతము వదలి మాతలిగుత్తమ
గు రథంబునెక్కి పురంబునకరుగ తక్కిన లోకపాలాది సురలు యింద్రుం బరివేష్టించి
యుద్ధముననిలచిరి - అంత తారకుడింద్రాదుల ననేకబాణంబుల నొప్పించిన వారలు
సుడివడియు ధీరతను తమతమముఖ్యాయుధములం బ్రయోగించిరి - తారకుడు వాటి
నన్నియు తునియలుగావించి తనయస్త్రములచే వారలం గట్టి కాలనేమి మొదలగు
వారలకొప్పగించి దానవులు జయ జయధ్వనులు జేయుచుండ తనపురిం జేరిసుఖం
బునమండె.

## పార్వతీపరమేశ్వరవివాహము - సం - అ. ౧౫౩.

ఇటులుండ తారకునికడకు ద్వారపాలకుడేతెంచి నమస్కరించి దేవరా! కాలనేమి దేవతలంగట్టిదెచ్చి వాకిటనున్నవాడు- వారి నెచటనుంచవలయునో నానతిమ్మని వేడిన తారకుండాలించి త్రిలోకంబులు నాకు గృహంబులుగనున్నయవి. కావున వారికిష్టంబగు ప్రదేశంబుననుండ నివ్వుడనినవాడట్లొనర్చి-పిదపనింద్రాదులుపిని దుఃఖింపుచు బ్రహ్మకడకేగి యతనికి సాష్టాంగనమస్కారంబులొనర్చి యనేకభంగులవినుతించిన బ్రహ్మదేవతలంగాంచి హస్తనిర్దేశంబునసనిష్ఠనిరె. ఓయింద్రుడా! నీమేనున భర్తృకవలెనిర్ధ్యానమైయున్నదదేల? ఓహుతాశనుడా! నీవేమిధూమముచేగప్పబడి ప్రకాశించుటలేదదేల? ఇటులనే తక్కినవారినడిగిన సురలునలుపంగాంచి తారకునిచే దనుకుగల యపజయంబును దెలిపిన కమలజుడు దేవతలనూరార్చి తారకుడు వధ్యుడగు. వానివధించెడి శిశువుజనించు. తొల్లి తారకుడు తపంబొనర్చి ఈశ్వరునికిజనించిన యేడుదినముల శిశువుచే మరణమునుగోరి వరంబుజేకొనె. ఇప్పుడీశ్వరు డపత్నీకుడుగ తపంబుసేయుచున్నవాడు - యతనికి హిమవంతునిపుత్రికయగు పార్వతిభార్యకాబోవుచున్నయది. ఆపార్వతియందు భగవత్స్వరూపుడగు గొవకుమారసుతుని జనింపజేయు. అటులజనించెడి శిశువు తారకుని వధించునని జెప్పిన దేవతలు కమలజునికి నమస్కరించి తమతమ నిలయంబులకుంజనిరి. అంతబ్రహ్మ తనపూర్వశరీరమగు విభావరిని స్మరించిన యది ప్రత్యక్షమైన దానివీక్షించి దేవతలకొఱకు నీవొనర్పవలసిన మహత్కార్యంబొకటికలదు. తారకుడను దానవుడు దేవతలబాధించుటంజేసి యతని జంపుటకీశ్వరునకొక పుత్రునిపుట్టించు - దక్షపుత్రియగు సతిదేవిశివునికి భార్యగానుండి కారణాంతరంబుచేతండ్రియందు కోపించిహిమవంతునికి సుతగాజనించు - గౌరీవియోగమున గౌరీజన్మనిరీక్షకుడై తపంబుసలుపుచుండెడిని - అయిన గౌరీశివులకు స్వల్పకలహముజనించు- దానివారింపకున్న తారకుడు వధ్యుండుగానేరడు. కావుననీవాకలహమును వారింపవలయు. అదియెటులనిన, మేనకగర్భమును సేవించిననంముందు పిండమునల్లదియై జనించినదానిశివుడువరించి పరిణయంబునొందిన పిదప నొకానొకసమయంబున భర్తచేపరిహసింపబడి పార్వతిసక్రోధయై తపంబుసలిపిగౌరత్వమును జెందితేజోవంతుడగు పుత్రునిగను- ఆపుత్రుడే తారకుని జంపు- నీవు కాళియంశమును గొని దుర్గయులగుదానవులనుకడంగింపుము - మఱియునిన్నెవ్వాడు పూజించునో వానికోర్కెలు నెరవేరును - గాయత్ర్యాద్యనేకనామంబుల బ్రాహ్మణాదులచే బొగడబడియెదవు - అని జెప్పనవిభావరి బ్రహ్మకు నమస్కరించి హిమగిరి కరిగి మేనకగర్భమునం ప్రవేశించె.

## పార్వతీజననము.

పిదపహిమవంతుడు మేనకయందొకకన్నియం గాంచె - అట్టియెడనఖిలలోకములయందలి స్థావరజంగమాదులకు సుఖంబువాటిల్లె - నరకవాసులునుచల్లనిగాడ్పులచే నానందించిరి. దేవవాద్యములు ఘూర్ణిల్లె - అచ్చరలాడిరి - గంధర్వులు పాడిరి - దేవతలుపుష్పవృష్టిని గురిపించిరి - ఇట్టుల జనించిన పుత్రిక సౌందర్యాదిసుగుణములచే వృద్ధినొందుచు ముల్లోకములకానందంబు వాటిల్లంజేయుచుండె - అంతశచీపతికార్యసాధనాయత్తచిత్తుడై దేవర్షియగు నారదుని స్మరించినయాతడేతెంచె- ఇంద్రుడాతనిం గాంచి ఋషిశ్రేష్ఠా! నీవుసర్వజ్ఞుండవుగానలోకబాధలనువారించుటకు దేవిజనించియున్నది. కావున నాయమకుశివుని సంబంధముకలుగునట్టులంజేయుమనిన నారదుండు హిమవద్గిరికరిగి హిమవంతునిచే నర్ఘ్యపాద్యాదిపూజలంగైకొని కనకపీఠమునందాసీనుడై కుశలంబడిగి, ఓహిమవంతుడా! నీయందుశివుడు తపంబుజేయుటంబట్టి నీవుకృతార్థుండవైతివని ననేకవిధములం బొగడుచుండ హిమవంతునిభార్యయగు మేనకనారదాగమనంబువిని కూతుతోడనేతెంచిమునివరుంగాంచి నమస్కరించి వారియాశీర్వాదంబు గైకొనియె- అంతపార్వతిని తాపసుండువీక్షించి తనసన్నికటంబునకు రావించి హిమవంతుని యూరువులయందాసీనతగావించె. అత్తఱితల్లితనయం గాంచి పుత్రీ! నీవుమునివరునకునమస్కరింపుము- భగవత్స్వరూపుడగుపతిని బొందెదవనిచెప్పిన నాబాలికతలవంచుకొని మాటాడకయుండ రిత్తనుచితంబగుబంతి నీకొసంగెద - మునికి మ్రొక్కుమని తల్లిజెప్పిన నాబాలిక తత్క్షణంబలేచి యట్లుగావించె నంతమేనక యొకచెలియంజూచి హస్తలక్షణంబుజూచునట్టుల మునికివిన్నవింపుమనిన యదియట్టులవిన్నవించె - అంతముని యాబాలిక హస్తంబువీక్షించి జననమరణవర్జితుండగు పరమేశ్వరునకు కళత్రమై నిఖిలదేవతలచే నమస్కారంబులం గొనుచుండు- కావుననీకన్నెను శివునికొసంగుమని హిమవంతునికిజెప్పి దేవలోకంబునకేగి సురపతికెఱింగించి నేజేయుకార్యంబు నెరవేర్చితి- ఇకమన్మథుని కార్యంబనివచించిన దేవపతిమన్మథుని స్మరించె - తత్క్షణంబ నతండేతెంచిన గాంచి ఓచూతాంకురాస్త్రా! నీవు దేవకార్యార్థము రతివసంతులతోడ శంకరునికడకేగి యతనిభార్యతో గూడునట్టులజేయుమని చెప్పిన మన్మథుడు హిమవంతంబునకుంబోయి తపంబుసలిపెడిశంకరుని సమీపస్థలంబునం జేరి భ్రమరయుక్తమగు నారిమ్రోయించిన నాధ్వని శంకరుని కర్ణరంధ్రంబులకు సోకిన మాత్రంబున మదనవికారమనస్కుడై మన్మథునివీక్షించి దహనాత్మకమగు దనఫాలనేత్రము దెరచినందుండి వెడలిన నొకయగ్నికణము మన్మథుని భస్మంబుజేసినదియగాక లోకంబునుసగంగాల్పంగమకించిన యాకణమునువిభజించి, తియ్యమామిడి, వసంతఋతువు, చంద్రుడు, పుష్పములు, తుమ్మెదలు, కోయిలలు, వీటి

యుండుమనటుల నియోగించె- పిదప రతీదేవి తనమగని పాటుగాంచి దుఃఖసాగరమగ్నయై వసంతునిచే నోదార్పబడి మదనుని భస్మంబును మేన నలదికొని శంకరునకునమస్కరించి పలువిధంబులం బొగడిన యతడు సంతసించి రతీదేవికి బ్రత్యక్షుడై నీమనోరథంబీడేరు నీమగడనంగుడనంబేర్కొని ఖ్యాతినొందునని చెప్పిన నంత నారతీదేవి హిమవంతమునందలి యొకయుద్యానవనంబు జేరి మరణవ్యవసాయంబునువదలి పతిరాక నిరీక్షింపుచు రోదనంబు జేయుచుండె.

ఇట్లుండ నారదునివాక్యానుపగిది హిమవంతుండు శుభలగ్నంబున చెలికత్తియలతోడ బార్వతిని శంకరునికడకు గొనిపోవుటకు వెడలి యనేకయడవులుకడచి మార్గమధ్యంబున నేడ్చుచున్నరతింగాంచి యూరార్చి నీవెవరు ? ఎందుకేడ్చెదవు? తెలియంబలుకుమన రతియిట్లనియె- నేనుమదనునిసతి, యీపర్వతంబున శంకరుండు తపంబుసేయుచుండ యత్నితపంబును నాభర్తవిఘ్నం బొనర్చుటకు సమకట్టిన శంకరుడు సక్రోధుడై తనఫాలనేత్రాగ్నికణముచే భస్మముగావించె. పిదపనేశంకరునికడంజేరి పతిభిక్షయొసంగుమని వేడిన నామనోరథం బీడేరునట్లు శంకరుండువరంబొసంగె. కావున భర్తరాక నిరీక్షింపుచు శరీరమును గాపాడుకొనుచున్నదాననసిన హిమవంతుండు శంకరునికృత్యంబునకు భీతిల్లి తనకూతునిమఱలగృహంబునకుం గొనిచన నెత్నించిన పార్వతి తండ్రింగాంచి నేతపంబొనర్చి శంకరుని కటాక్షంబువడసెద. తపంబువలన సాధింపతగనిదేమియును లేదనిన హిమవంతుడు- వలదు, వలదు, నీశరీరముతపంబున కోర్వంజాలదు- కాగలకార్యం బెటులనైన సమకూరకపోదని హితంబు జెప్పిన నొప్పక వాదులాడుచుండుతఱి యంతరిక్షంబున తపంబుజేయుము నీకుసిద్ధియగునని దివ్యవాక్కు వినబడియె. అట్టివాక్కును హిమవంతుడువిని తపంబుసేయ కూతునివిడిచి గృహంబునకరిగె. అంతబార్వతి శంకరునిగూర్చి తపంబుసేయుచుండ నింద్రుండు సప్తర్షుల స్మరించినవారు తత్క్షణంబ నేగుదెంచిన వారింగాంచి మహర్షులారా ! హిమవంతంబున సహస్రవర్షంబులుగతించియు బార్వతి తపంబుసేయుచున్నయది. కావున నాయిష్టంబు సమకూర్పుడని చెప్పిన వల్లెయని పార్వతికడకుంబోయి నీకోర్కెయెద్ది ? ఏలతపంబుసలిపెదవు ? తెలియంబలుకుమన నాబాలామణి వారినర్ఘ్యపాద్యాదులచే దృప్తులంగావించి తపోమౌనంబునువదలియు లజ్జనువదలకుండిన మౌనులు మఱలం బార్వతింగాంచి నీయాశయంబు దెలుపుమన - పార్వతి వారింగాంచి యోమౌనులారా ! తమకు బ్రాణుల మనోభీష్టంబులు దెలియనవిగావు- లోకంబున గొందఱునియతులు తపంబులుసలిపి దేవసమానులయ్యెదరు-ఇటుల ననేకులనేకభంగులతపంబుచేసెదరు-నే శంకరుని భర్తగాగోరి తపంబొనర్చెదననియె - అందునకామౌనులు శంకరుడు స్వభావముచే దిక్కులే వస్త్రముగగలవాడు- (అనగా దిగంబరుడు) శ్మశానవాసి,

భయంకరుడు, మఱియు నిట్టియనేక దుర్గుణములుకలవాడు కావున నింద్యుడు - సకలదేవపూజ్యుడగు విష్ణువుకలడు- అఖిలదేవపతియగు నింద్రుండుగలడు - దేవతలకాధారుండగు యగ్నికలడు- ఇట్టిపూజ్యులగువా రనేకులుండగ వీరిలో నీకిష్టమగు వారిని వేడుమనిన కోపోద్దీపితమానసయై శంకరుని మీ రెఱుంగరు- యాదేవుని మహిమను హరిహిరణ్యగర్భాది దేవతలుసగా గనజాలరని వచించిన యామాటలు సంతసించి పార్వతింగాంచి మఱలనిట్లనిరి, ఓదేవీ! మేము నీమనోభీష్టము దెలియటకువచించితిమి గాన నీకోరిక శీఘ్రంబుననీడేరు- తేజస్సు సూర్యుని వదలకుండునటుల నీమనంబు శంకరునియందే లయించియుండుకావున నాశంకరుడు నీమనోభీష్టంబు నెరవేర్పునని నుడివి శంకరునికడకుబోయి యతనిననేకభంగుల వినుతించిస్వామీ !మీరు జగదుపద్రవ నివారణార్థము పరిణయంబు జేసికొనవలయునని వేడిన యందుకుశంకరు డనుమతించి హిమవంతుడుతన పుత్రికనునాకిచ్చి వివాహంబుజేయునటుల మీరతనివద్దికేగి నాయాశయమును దెలుపుడనిన యాఋషులు హిమవంతునికడకేగి యీశ్వరుని యాశయము దెలిపిన నతడు పరమానందభరితుడై యుండ యతనిందోడ్కొని తపంబునలిపెడి పార్వతికడకేగి నీవుశరీరమును బోషించుకొనుము- రేపటిప్రాతఃకాలంబునశంకరుడు నీపాణిని గ్రహించును-గానతండ్రితోడనీవు గృహంబునకరుగుమని జెప్పి ఋషులుతమతమ నిలయంబులకరిగిరి.అంతపార్వతియు దండ్రితోడ గృహంబునకేగె- మరుదిన ముషఃకాలంబున పార్వతి చెలులచే నలంకరింపబడియె- మఱియుహిమవంతుని గృహములునలంకరింపబడియె- తూర్యధ్వనులు మ్రోసె-ఋతువులన్నియు శరీరములనుధరించి సేవింపుచుండె- వాయుమేఘములు నగరసమ్మార్జనాలంకారాదుల జేయుచుండిరి-శ్రీదేవి యనేకసాధనంబులతోడ నగరంబుశోభిల్లంజేసె- మఱియు చింతామణి మొదలగురత్నములును, పర్వతములును, కల్పవృక్షములును శరీరధారులై వెలసియుండిరి - ఇట్లుండ గంధమాదనపర్వతంబున హరిహిరణ్యగర్భాది నిఖిలదేవతలు సకలాలంకరణ సంభార సంభృతులై యేతెంచి పితామహుడు చంద్రఖండముచేతను, యముడు సర్పసరములచేతను, తక్కుదేవతలు నానావిధ భూషణములచేత శంకరునినలంకరించి బరివేష్టించియుండిరి. అంతదేవప్రార్థనచే రతీదేవికి మఱలభర్తగలుగునట్లనుగ్రహించి వృషభారూఢుడై దేవతాగణంబులతోడ హిమగిరికరిగె - అట్టిసమయంబున విష్ణుండు దేవసమూహంబునకు ముందు పరుగులిడుచు, జోహారులుగా[illegible]పుచు జనసమ్మర్దము లేకుండునటుల భూపరాగశోభిత దేహుడైయుండె. ఇట్లఖిలదేవతలతోడ శంకరుడు విశ్వకర్మ నివేదితంబగు హిమవంతుని గృహంబునం జేర దేవవాద్యంబులు ఘూర్ణిల్లె - పుష్పవర్షంబులువర్షించె- అంత హిమవత్పూజితుడగు నలువ పార్వతీశంకరుల కిరువురికి వివాహంబొనర్చె- ఇంద్రుడుఛత్రంబుపట్టె, గంధర్వులుపాడిరి, అప్సరలాడిరి, కుబేరుడు రత్న

మయంబులగు ఆభరణముల నొసంగె- ఇట్లు దేవతాబృందముతోడ నారాత్రియు
చటనుండి హిమవంతుని వదలి మరునాడుదయమున పార్వతీసహితుడై శంకరుడు
మందరగిరికరిగి యచట నుద్యానవనములయందును, రహస్యప్రదేశములయందును,
మన్మథప్రేరితుడై క్రీడింపుచుండె. ఇటులకొంతకాలము గడచినపిదప పార్వతి పుత్ర
కామయై చెలికత్తియలతోడ దారుమయంబులగు బొమ్మలచే నాడుకొనుచు నొ
కతఱి గంధయుక్తతైలమును మేనపూసికొని చూర్ణముచే నలుగిడుకొని నాచూర్ణ
ముచే గజాననము నరాకారముగలబొమ్మనుజేసి పుత్రుడని నుడువుచు గంగలో
వదలిన నాబొమ్మ కొంతకాలమునకు గురుశరీరముగలదై లోకమంతయు వ్యాపిం
చె. వానిని గంగయును పార్వతియు పుత్రుడనిబిలచిరి-అతనే దేవతలచేగాంగేయుడని
పూజింపబడియె- అంతచతుర్ముఖుడేతెంచి వినాయకాధిపత్యము నొసంగె- ఇటుల
నే పార్వతి చెలికత్తియలతోడంగూడి నొకయశోకాంకురమును పుత్రుడని వదింపుచు
బెంచుచుండె- బృహస్పతి మొదలగు ఋషులును, యింద్రుడు మొదలగు దేవతలును
దేవింగాంచి దారుమయ పుత్రులతోడ ఫలంబులేమగాన నిజపుత్రునిబడయుమని
ప్రార్థించిరి - అంతశంకరుడు పార్వతితోడ క్రీడాగృహంబునకుంబోయి పాచికల
నాడుచుండ సూర్యుడస్తమించె - రాత్రియగుటచే పార్వతి మిక్కిలి తమో
రూపంబునొందె.

పార్వతితనమేని నలుపుబోవుటకు దపంబుసేయుట- సం - అ- ౧౫౪.

అంతబార్వతి తనమేని నలుపును శివునిచే బరిహాసింపబడి యానలుపు బోవు
టకు తపంబుజేయ సమకట్టి తనయంతఃపురంబున నితరస్త్రీలు ప్రవేశింపకుండ వీర
కుని నియోగించె.

ఆడిదానవునివధ - సం - అ - ౧౫౫.

అంతకుసుమామోదినియను పర్వతాభిమానదేవతంజూచి నేతపంబునకేగెద
మఱలి నేవచ్చువరకిచటికితరస్త్రీలెవ్వరు రాకుండునటులమొనర్పుమని నియోగించి
పార్వతితపంబునకరిగె. అట్టియెడ నంధకపుత్రుడగుఆడిదానవుడు స్వస్వరూపంబున
నాజిలోమరణముజెందకుండునటులను వేరురూపంబుజెందిన మరణముగలుగునటుల
ను నలువంగూర్చి తపంబుసలిపి వరంబువడసి తనపితవధికుడగు శంకరునిందెగటా
ర్పంబూని ద్వారరక్షకుడగు వీరకున కగోచరుండై సర్పరూపంబుగొని బిలద్వారం
బున శంకరుని యంతఃపురంబుజొచ్చి పార్వతీరూపధారియై చరింపుచుండ శంకరు
డువానింగాంచి యాలింగనంబుజేసికొనిన పార్వతివామభాగంబునంగల పద్మాకార
మగు లోమావర్తములేమింజేసి యిది రాక్షసమాయయని దలంచి దానిభగంబున
వజ్రదంతములుగలవనియెఱింగి తనమేహనముచే వజ్రాయుధమును బ్రయోగించి మా

యారూపియగు నద్దానవుం దెగటార్చె- ద్వారరక్షకుడగు వీరకున కీవృత్తాంతమేమి యు దెలియదయ్యె - ఐనకుసుమామోదిని యావృత్తాంతంబంతయు వాయువుచే దెలిసికొని పార్వతికి నెఱింగించిన యాయమ కోపోద్దీపితమానసురాలై వీరకుని శిల యగునటుల శపించె.

పార్వతిబ్రహ్మవలన కాంచనాకారము పొందుట - సం - అ - ౧౫౬.

వీరకుని శిలయగునట్లు శపించిన నవ్వీరకుడు ఆడిదానవునిమాయ నెఱింగింపమిచే పుత్రవాత్సల్యతచే వానిననుగ్రహించె- అంత నాదేవికి బొడమిన క్రోధము సింహరూపంబుగ వెడలి దేవిసమీపంబున వర్తింపుచుండె- అంతతపంబొనర్చు పార్వతికడకు గమలజుడేతెంచి కాంచనచ్ఛాయ గలుగునట్లును శంకరుని దేహార్ధధారియగునట్లును వరంబొసంగిన నంతపార్వతితన శరీరస్థమగు నిందీవర కాంతిగల త్వక్కునువదిలె- అది స్త్రీరూపంబువడసి ఘంటాహస్తయై యెదుటనిలువంబడిన నలువ క్రోధోత్పన్నమగు సింగమును దానికివాహనంబగునటుల నియోగించి మాయావియగు పంచాలుండను యక్షాధిపుని భటునిగానిచ్చి వింధ్యాచలంబునకరిగి దేవకార్యంబులను సఫలంబుగావింపుమని యాజ్ఞాపించె-నంతపార్వతి సంపూర్ణమనోరథ యగుచు శంకరుని సమీపంబున కరుగుటకు ద్వారప్రవేశంబు జేయసమకట్టిన వీరకుండాయమంజూచి మున్నొకదైత్యుడు మాయావియై నాకును శంకరునకిని గోచరుండుగాక స్త్రీరూపంబున నంతఃపురంబునం బ్రవేశించిన శంకరుడు వానిమాయ నెఱింగివానిం దెగటార్చి ననుగాంచి యంతఃపురంబులో నెవ్వరినం జొరనివ్వకుండుమని యాజ్ఞాపించెగావున నీవుబోవలదని వచించె.

కుమారసంభవము - సం - అ - ౧౫౭ - ౧౫౮.

అం వీరకుడనపరాధియైయ్యు శపింపబడెనని గుందుచు వాయుదేవుని వా నటుల జేసితినిగదా యనిదలంచి వీరకుంగాంచి ఓరి వీరకా! నే పార్వతిని, మాతను, నీమనంబును చలింపజేయకుము, హిమవత్పుత్రికనగు నే శంకరునిభా ను - కాంచనచ్ఛాయగల నాశరీరమును జూచిభ్రమింపకుము - కమలాసనుడు నాతపంబునకు మెచ్చికాళిమమపోకడచి యిట్టికాంచనచ్ఛాయనా సంగె-మున్నుదానవమాయ నెఱుంగకనీకు నేశాపంబిచ్చితి- ఐన ననునీవుస్తోత్రంబొనర్చుటచే నీమనోభీష్టంబుజేకూరునని పలికినవీరకుండు పార్వతింగాంచి పలువిధంబులంబొగడినవాని స్తోత్రంబునకాదేవిసంతసించి భర్తృసమీపముంజేరి క్రీడావినోదంబులందేలుచుండె- అంతశివదర్శనార్థము సురలేగుదెంచిన వీరకుడువారింగాంచి ఓదేవతలారా! శివుడుపార్వతితోడంగూడి క్రీడింపుచుండుటంజేసి యిది సమయంబుగాదనివచించిన వారుముదమంది తమతమనిలయంబులకుం బోయికొంతతడవు చింతించి శివునిచేష్టలనఱయుట కగ్నింబనిచిన నతండుశుకరూపంబునొంది జాలరం

ధరిముచేనంతః పురంబుజొచ్చిన శివుండు శుకరూపియగు నగ్నింగాంచి క్రోధరక్తేక్షణుడై యిట్లనియె. నీ గాకను పార్వతినరసిసిగ్గుచే దొలంగె - కావున విఘ్నకరుడవగు నీవు పార్వతిగర్భమునందు పతనమై మిగిలినయర్ధ రేతస్సును పానముజేయుమనిన శుకరూపియగు నాయగ్నిదానిం గ్రహించి భరింపనోపక భాగక్రమంబున దేవతలకొసంగిన యది వారియుదరంబులం జీంచుకొని శరవణమునం బడి బహుయోజనవిస్తీర్ణంబగు నొకకొలంకుంజేరె - ఆకొలను కనకకమలాదుల చేతను, మనోహరంబగు యుదకంబుచేతను బ్రకాశింపుచున్నదను వార్తను పార్వతియాలించి దానిసొబగుపీక్షింప సమకట్టి చెలికత్తియలంగూడి యందరిగి జలక్రీడ మలొనర్చి యాతీరంబున విశ్రమించియుండ కృత్తికలార్గురాకొలనుంజేరి క్రీడలుసలిపి కమలపత్రంబులతోడ జలంబునుగొని పోవుటను పార్వతిగాంచి బిలచి వారిహస్తంబులందిడికొని యున్నజలంబులరిగోరిన, నాకృత్తికలటుల జేసెదముగాని నీకుద్భవిల్లెడి కొమరుడుమా నామంబులం బ్రసిద్ధియగు నట్లుజేయుమనికోరిరి. అంతపార్వతి యొడంబడి యాకృత్తికలచేనున్న యుదకంబును క్రమముగపుచ్చుకొని పానంబుజేసిన తత్క్షణంబ పార్వతి దక్షిణకుక్షినుండి లోకశోకనాశకుండును, తప్తకాంచనప్రభాకరుండును, శక్త్యాద్యాయుధోపేతుండు నగుబాలుండుద్భవిల్లె - మఱలబార్వతికి ఈశ్వర రేతోత్పన్న సరోవరజలపానముచే వామకుక్షినుండి మఱియొకబాలుండుబొడమె - అంతదేవేంద్రుండేతెంచి దేవకార్యమునూహించి పార్వతి కిరుప్రక్కలంబుట్టిన శిశువుల నిరువురిని నొకనిగాజేసి మరుదినమగు చైత్రశుద్ధషష్ఠిని నిఖిలదేవతులతోడంగూడి. తనకు సేనాధిపతిగ వానినభిషిక్తుంగావించి, గంధమాల్యాద్యలంకారంబులంజేసి తనసుతయగు దేవసేనను భార్యగానొసంగె- అంతవిష్ణువు ఆయుధములను, కుబేరుడుయక్షులను, అగ్ని తేజంబును, వాయువు వాహనంబును, నలువకుక్కుటధ్వజమును, ఇటులతక్కు దేవతలు పరివారంబులనిచ్చి పలుతెఱంగుల నాబాలుంబొగడిన నతండుసంతసిల్లి దేవతులన్వీక్షించి మీయభీష్టంబులెవ్వి! దెలుపుమనన నంత దేవతలతనింగాంచి మహాత్మా! తారకుండను దానవుడుమము బాధింపుచున్నాడు కానవాని వధింపుమని వేడ నతండట్లొనర్చెదనన తారకుని యుద్ధంబునకు రమ్మని నింద్రుండొకదూతంబనిచె. అంతతారకుండు సేనాసమన్వితుడై నానావిధాయుధంబులంబూని సంగరస్థలంబునకేతెంచి దేవసేనను వీక్షించి యందలి కుమారస్వామిని జేయుస్తోత్రంబుల నాలించె.

తారకవధ - సం - అ - ౧౫౯.

ఇట్లు తారకుడు కుమారస్వామిని జేయుస్తోత్రంబుల నాలించిపూర్వము బ్రహ్మచే దానువడసిన వరంబును దలంచిదుఃఖింపుచు కాలనేమి మొదలగు ప్రముఖులను రావిం

చినంగరంబునకు వెడలుడని నాజ్ఞాపించి తానును యుద్ధరంగమునం బ్రవేశించె-అంత తారకుడు షణ్ముఖుంజూచి నీవు బాలుడవు ఇది చెండాటగాదు - నీవు యుద్ధదుర్జయులగు దానవుల నెప్పుడును వీక్షించినవాడవు గావని బలువిధముల బరిహసించిన తారకుని వాక్యంబులనువిని ఓరి తారకా ! నన్ను బాలుడని యెంచకుము- శాస్త్రార్థమును దెలిపెదవినుము-బాల్యమున కాలసర్పమునకు విషము లేకంబోవునా! బాలసూర్యుని వీక్షించుటకు శక్యముగలదా? అల్పాక్షరముగల మంత్రమునకు మాహాత్మ్యము కొఱవడునా? నే బాలుడనైనను నను జయింపుమన తారకుండు నతనిమీద నొకనాయుధంబు వైచిన దాని వ్యర్థంబు గావించె-అంత వాడు దందహ్యమాన మనస్కుండై భిండివాలము వైచిన కుమారుండు దానినొక చేబట్టి తనగదచే వానిం గొట్టిన నాపెట్టుకు తారకుడు వడవడవడంకుచు తనకు కాలమాసన్నమైనదని యెన్నుచుండ కాలనేమి మొదలగు దానవులు మిగుల రోషించి యంపసోనలం గురిపించిరి - దానిచే దేవతలకు ప్రాణాంతకరముగనుండినను షణ్ముఖుడు వాని శిథిలములుగావించి కాలనేమి మొదలగు దానవులను విముఖులం జేసె- వ్యాకుల తారకుడు కినిసి భగ్గుభగ్గని మండెడి గదను కుమారుని పైవైచినదాని వేడిమికి కుమారుని వాహనంబు స్రుక్కుటం బట్టియా కుమారుండు రౌద్రానలభీషణుండై శక్త్యాయుధముచే దారకుని హృదయంబు వ్రక్కలగునటులం గొట్టిన తారకుడు ప్రళయకాలంబున పర్వతంబులు గూలెడి కైవడి నేలం గూలె-అంత దేవతలు ముదమంది షణ్ముఖుని పలుగతులం బొగడి తమతమ నిలయంబులకరిగిరి.ఈ షణ్ముఖుని విజయమును వినినను జదివినను ఆయురారోగ్యాభివృద్ధి యగుటయగాక యంత్యంబున స్కందుని సాయుజ్యంబు జేకూరు.

హిరణ్యకశిపు చరిత్రము- సం - అ - ౧౬౦.

మునులు సూతుంగాంచి మహాత్మా ! నృసింహావతారమును హిరణ్యకశిపుని వధను వివరింపుమని వేడిన సూతుండిట్లనియె - తొల్లి కృతయుగమున హిరణ్యకశిపుడను దైత్యుడు గలడు - అతను (౧౧౦౦౦) వత్సరంబులు జలవాసియై బ్రహ్మం గూర్చి యుగ్రతపంబొనరించిన యతనికి సంతసిల్లి సురసంఘంబులతోడం బ్రత్యక్షుడై వరంబు వేడుమన హిరణ్యకశిపు కమలజుంగాంచి దేవతలు, యసురులు, గంధర్వులు, యక్షరాక్షసులు, మనుష్యులు, పిశాచములు, శస్త్రాస్త్రగిరిపాదపములు, శుష్కార్ద్రములు, వీటిచే దివారాత్రములయం దెప్పుడు మరణంబుగలుగకుండునటులను ఋషుల శాపంబులు సోకకుండునటులను సూర్యసోమవాయ్వగ్ని సలిలాంతరిక్ష నక్షత్ర దశదిశ కామక్రోధ వరుణ వాసవ యమ కుబేర యక్ష కింపురుషాధిపుల యాధిపత్యము తనకే జెందునటులను వరంబొసంగుమన కమలజుండవ్వరంబిచ్చి యంతర్హితుడయ్యె.

అంత దేవతలవ్వరప్రదానమునువిని నలువకడకేతెంచి నీవుహిరణ్యకశిపున కేవరంబిచ్చుటంబట్టి యతనమమ్ము వధించుచున్నాఁడు గావున ననుగ్రహింపుమని వినుతించిన బ్రహ్మసురలనూరార్చి హిరణ్యకశిపు తపంబునకు మెచ్చి నేవరంబిచ్చితి - ఐనవిష్ణువు వానివధింపుననిచెప్పిన దేవతలుముదమంది తమనిలయంబులకుం జనిరి - అంత హిరణ్యకశిపు తనవరప్రభావముచే సంగరంబున సురలనోడించి ముల్లోకంబులంగైకొని యజ్ఞభాగంబులు తమవారిం జెందునటులంజేసె- అంతనాదిత్యులు, సాధ్యులు, విశ్వేదేవతలు, వసువులు, రుద్రులు, దేవతలు, యక్షులు, మహర్షులు, కడుభీతులై విష్ణువుంజేరి పలుతెఱంగులం బొగడిన వారికివిష్ణువు ప్రసన్నుఁడై హిరణ్యకశిపుని వధియించెద- వెరువకుడని వాక్రుచ్చి అర్ధ నరాకారంబును, నర్ధ సింహాకారంబు నొంది (నృసింహాకారము.) హిరణ్యకశిపు పేరోలగంబుజేరి జాజ్వల్యమాన మణిగణ ఖచిత మకరకుండల కేయూర కిరీటాద్యనేక నానాభరణ భూషితుండును, అనర్ఘ్య చిత్రరత్న చిత్రితకనకమయ సింహాసనాసీనుండును, అనేక దేవదానవ యక్షరాక్షస కిన్నరకింపురుషాది సేవ్యమానుండును, బందీకృతసురసుందరీ కరకమలసంవీజ్యమాన చామర మరుల్లరితోత్తరీయుండునునగు హిరణ్యకశిపుం గాంచె.

నృసింహమూర్తి యసురులజంపుట - సం - అ - ౧౬౧.

అంతప్రహ్లాదుండు తండ్రింజూచి జనకా ! ఘోరాకారంబగు నిట్టినృసింహ రూపంబు లోకంబున నెప్పుడు కన్నది విన్నది లేదు-ఈస్వరూపంబున బ్రహ్మేంద్రాది నానావిధదేవతలు, మానవులు, సర్పములు, సముద్రములు, సరస్సులు, పర్వతములు వీటితోఁగూడిన చతుర్దశభువనంబులు, సమస్తదానవులతో కూడియుండెడి నీవును నాకుగోచరమగుచున్నది గావున దైత్యుల కంతమువాటిల్లినదని నుడివిన హిరణ్యకశిపు రోషించి తమబలంబుంజూచి నృసింహునిని పట్టుండని యాజ్ఞాపించె-అంతవాని సేనయేకంబై సింహనాదంబులంజేయుచు ఘోరాకారంబగు నృసింహుని జుట్టుముట్టిన నామూర్తి రోషించి సింహనాదంబులంజేయుచు హిరణ్యకశిపుని సభనుంగూల్చె- అట్టిచెడుగును హిరణ్యకశిపుండువీక్షించి నృసింహోపరి ప్రయోగించిన దండాస్త్రము మొదలగునవి యగ్నికి యాహుతింబోలి నృసింహమూర్తి కోపంబును బ్రజ్వలింపంజేసె - తక్కదానవులు బ్రయోగించిన అస్త్రంబులునువ్యర్థంబులయ్యె- ఇట్టిచిత్రంబునకు దానవులు భయంబందిరి.

హిరణ్యకశిపువధ - సం - అ - ౧౬౨.

ఇట్లుదానవులువైచిన బాణజాలంబులు వ్యర్థంబులైనహిరణ్యకశిపుడు మఱల హుంకరించి రౌద్రాకారంబుగ బ్రజ్వలింపుచుండెడి శక్త్యాయుధమును నృసింహ

మూర్తిపై వైచిన దాని నృసింహమూర్తి హుంకరించినమాత్రంబున నాకసమునుం డిపతనంబైన యుల్కంబుంబోలి బ్రద్దలైనేలంగూలె- అప్పటి హిరణ్యకశిపునకనేకయ రిష్టసూచకంబులు దృశ్యంబులయ్యె- అంత నృసింహమూర్తి హిరణ్యకశిపుం గవిసి వానివక్షంబును నఖంబులచే జీల్చి యమాలయంబునకనిపె- వీని మరణంబునకు చతుర్దశభువనంబులు సంతసిల్లె- ఇంద్రాదులు తమ తమాధిపత్యంబులం జెందిరి- నృసింహమూర్తి స్వస్వరూపంబుతో వైకుంఠమునకేగె.

విష్ణునాభి పద్మోద్భవ కథనము - సం - అ - ౧౬౩.

అని చెప్పిన మునులు సూతుంగాంచి పాద్మమహాకల్పంబున జలార్ణవశాయి యగు విష్ణు నాభియందిజగత్తు హేమమయ పద్మాకారంబుగ నెటులయుత్పన్నంబయ్యె ? అట్టిపద్మంబున దేవర్షిగణాదు లెట్లువసించిరి ? అచటవిష్ణుం డెంతకాలంబు శయనింపుచుండె ? మఱల నెప్పుడు మేల్కని యీజగంబు నెటులసృజించె ? ఇటకుమున్ను జగత్తు నష్టమై తమోమయంబై యుండెగదా ? అనియడిగిన మనువుకు మత్స్యుడును, పరాశరసుతుడగు, వేదవ్యాసుడును చెప్పినచాడ్పున మునులకు సూతుండిట్లని వక్కాణించె - విష్ణుతత్వమును బ్రహ్మకూడ దెలిసికొనజాలడు- అట్టివిష్ణువే చరాచరాత్మకమగు ప్రపంచరూపిగనుండు- భగవంతుడగు విష్ణువే సృష్టిస్థితిలయములకు కారణభూతుండుగ నుండునని వచించె.

యుగపరిమాణము - సం - అ - ౧౬౪.

కృతయుగపరిమాణము సంధిసంధ్యంశములతోడదివ్యవత్సరములు (౪౮౦౦) ఇందుధర్మము నాలుగు పాదములుగ నధర్మమొకపాదముగ చరింపుటచే మనుజులు స్వధర్మనిరతులై యుండెదరు - సత్యధర్మములువృద్ధి బొందుచుండు - త్రేతాయుగ ప్రమాణము సంధిసంధ్యంశములతోడదివ్యవత్సరములు (౩౬౦౦) ధర్మమమూడు పాదములుగ నధర్మము రెండు పాదములుగచరించు - చాతుర్వర్ణములవారు సంకరము చేయుర్బలులుగనుండెదరు - ద్వాపరయుగప్రమాణము సంధి సంధ్యంశములతోడదివ్యవత్సరములు (౨౪౦౦) అందుధర్మము రెండు పాదములుగనధర్మముమూడు పాదములుగవర్తిల్లుచుండు - మనుజులద్దానపక్తులై రజోగుణ వ్యాప్తులై నీచమార్గప్రవర్తకులుగనుండెదరు - కలియుగప్రమాణము సంధిసంధ్యంశములతోడ దివ్యవత్సరములు (౧౨౦౦) ధర్మమొకపాదముగ నధర్మమునాలుగు పాదములుగనటింపుచుండు- అందుమనుజులు కాముకులై సాత్వికమునువర్జించి యనృతములాడుచు నాస్తికులుగను సాహంకారులుగను - స్నేహరహితులుగ నుండుటయేగాక బ్రాహ్మణులుశూద్రప్రాయులుగ పిలుసిల్లెదరు. యుగాంతమున వర్ణసంకరులయ్యెదరు- ఈ నాలుగుయుగములదివ్య వత్సరసంఖ్య (౧౨౦౦౦) ఇట్టియుగములు నాలుగు జేరెనేని

యొకమహాయుగంబగు - ఇట్టి వేయిమహాయుగంబులయ్యేనేని బ్రహ్మకొక పవలగు - ఇట్టిపవలుకడచినపిదప నీశ్వరుడుపంచ భూతాత్మకంబగు లోకంబుల సంహరించు.

దైనందినప్రళయము - సం - అ - ౧౬౫.

అంతనారాయణుండు సూర్యస్వరూపుడై తనకిరణములచే సముద్రములు మొదలగువానిలోని యుదకములను పీల్చి జగత్తును నీరసముగావించు - అట్టినారాయణుడే వాయురూపధరుడై జగత్తునుకంపింపంజేయుచు నందలిజీవకోటి ప్రాణాపానాదులను చక్షురాదీంద్రియగత గుణంబులను, పంచమహా భూతాంతర్గత గంధరసాదిగుణంబులను, మనోబుద్ధులను నాకర్షించి తనకిరణ వ్యాప్తిచేతను, వాయువసంఘర్షణచేతను నుత్పన్నంబైన యగ్నిజ్వలించి బ్రహ్మాండమును భస్మంబుగావించి పిదపమేఘరూపియై లోకంబును జలార్ణవముగావించి పురాణరూపంబుజెంది యోగనిద్రాతత్పరుడై యనేకదివ్యవత్సరంబు లందు శయనించు - ఇట్లు యోగనిద్రయందుండు విష్ణుతత్త్వంబు నెవరుంగనజాలరు.

నారాయణ మార్కండేయసంవాదము - సం - అ - ౧౬౬.

ఇట్లు యోగమాయాతత్పరుడై శయనించియుండు విష్ణుదేవుని కుక్షియందలి నానావిధ తీర్థాయతనములతోగూడిన భూమియందు చిరాయువుగల మార్కండేయుండు తీర్థయాత్రావ్యాజముచే సంచరింపుచు నారాయణుని ముఖమునుండి బయలువెడలి సప్తచంద్రార్కములుగలిగి జలమయమై యంధకారంబై యుండెడి జగత్త్రయంబు మేఘంబునుంబోలి బ్రహ్మాండాకారంబుగల నొకపురుషుం గాంచి భీతుడై మరల యుదరముంజొచ్చి యందలి యనేకతీర్థయాత్రలంగావించి జగత్తత్త్వంబుగానంగోరి మరలబయలువెడలిజలార్ణవమునందు కోటిసూర్యప్రకాశ దేదీప్యమానుండును, వటపత్రశాయియునగు నొకబాలుంగాంచి భీతచేతస్కుండై యుండుతఱియబ్బాలుండాతనింగాంచి ఓమార్కండేయా! నీవుభయంబందక నాచెంతం జేరుమనన నతండా వటపత్రశాయింగాంచి, అనేకదివ్యవత్సరంబులు తపంబుసలిపిన నన్నుబ్రహ్మాదులుసగా నామంబుచేబిలువ జడియుచుండ నీవట్లొనర్చితివిగాన నీవ యమపురికేగెదవన నాభగవంతు డిట్లనియె- వత్సా! నేనునీజనకుడను, భగవంతుడనునగువిష్ణుండను,తొల్లి నీతండ్రియగు నంగిరస్సుచిరాయువుగల సుతుడుద్భవిల్లుటకై నన్నుంగూర్చి తపంబుసలుప నటుల నేవరంబొసంగితినన నతండు సంతసించి కేలుమోడ్చి నమస్కరించి జగదీశా! బాలరూపివై వటపత్రశాయివగు నీమాయాతత్త్వమును నెఱుంగం గోరెదననన్భగవంతుండిట్లనియె - మార్కండేయా!

నేను నీకగుపడెడి సమస్తప్రపంచస్వరూపియు, సకలజగత్సృష్టికర్తయునగు నారాయణుడను; నాకుక్షియందే సకలబ్రహ్మాండంబు లున్నయవి- మఱియు నింద్రాదిదేవతాపరివృతుడగు బ్రహ్మయునసించు - అందేనీవును సంచరించెదవను మొదలగు ననేకతత్త్వంబులం దెలిపిన మార్కండేయుండు సంతసించి వఱల యుదరంబుంబొచ్చె.

నారాయణునినాభి పద్మావిర్భావము - సం - అ - ౧౬౭.

అంత లోకవిభుడగు నారాయణుడు ప్రపంచమును సృష్టి జేయందలంచి ప్రళయకాలమునందలి యాకారమును వదలి నిరాకారమును వాయు శూన్యంబునగు జలార్ణవమును చలింపజేసిననందొక ఛిద్రంబగుబడియె- అందుండి శబ్దంబును, వాయువు జనించివర్ధిల్లె- ఆవాయువువలన నగ్నిపుట్టి జలమునంతయు శోషింపంజేసిన నాకాశం బుత్పన్నంబయ్యె- పిదప భగవంతుడు తాజేయుసృష్టి కాధారంబగు వాయ్వాదిభూతంబులంగాంచి సంతసిల్లి సృష్టికారకుడగుబ్రహ్మ నెట్లు సృజింపవ గునని చింతింపుచు తననాభియందుండి సహస్రదళంబులుగలిగి కోటిసూర్యప్రకాశమానంబగు నొకకమలంబును పుట్టించె.

నారాయణుని నాభికమలమునందు బ్రహ్మోద్భవించుట - సం - అ - ౧౬౮.

ఇట్లుదయించిన కమలమును మహర్షులు జగదాకారంబని నుడివెదరు - అందుండి యోగవేత్తలలో శ్రేష్ఠుండును, చతుర్ముఖుండును, సృష్టికర్తయునగు బ్రహ్మజనించె.

మధుకైటభా సురోత్పత్తి - సం - అ - ౧౬౯.

అక్కమలమునుండి, సంచరించెడిపర్వతంబులంబోలిన యాకారంబులుగలవారును, రక్తాంబరధరులును, కిరీటకుండల కేయూరాద్యనేక భూషణాలంకృతులును, కడుబలిష్ఠులునునగు మధుకైటభులను నిరువురు నసురులు బొడమిరి- వారాకమలమునందు సంచరింపుచు జగత్సృష్టి యొనర్పుట కాజ్ఞప్తుడైన బ్రహ్మకడకేతెంచి ఓరికమలోద్భవా! నీవెవ్వండవు? ఇచటనివసించుట కేమి కారణము? నీనామంబెద్ది? మాతో సంగరం బొనర్పుమన చతుర్ముఖుండిట్లనియె- మీరెవ్వరు? మీరేలిచటయుండెదరు? మీనామంబులెవ్వి? యనవసుల తనంగాంచి మేముస్వయముగనే యుద్భవిల్లితిమి; మము రక్షింపువాడును, సృజించువాడు నెవడును లేడు; ప్రతియుగమునందును మేమురజస్తమోగుణములచే లోకముల నావరింపజేసెదము, ధర్మార్థకామములు మొదలగునవి మాయధీనంబుగనున్నవనిన బ్రహ్మయిట్లనియె. నేబ్రహ్మను, పరమయోగము నాశ్రయించి ప్రపంచమును సృష్టిజేసెదను - మీరువాసుదేవునిచే మడిసెదర

సముండ యోగమాయచే నిద్రించు వాసుదేవుడు మహదాకారమైన శరీరముబూని తన ప్రభావంబుచే వారినాకర్షించిన యాయసురుల తనికడంజేరి ఓజగత్సృష్టి కారణభూతుడగు పురుషోత్తమా! నీదర్శనంబమోఘంబుగాన మేము నీచే సమసునట్టుల జేయవలయునన భగవంతుడు వారల తనతొడలచే వధించె.

బ్రహ్మస్వాయంభువమనువు మొదలగువారిని సృజించుట - సం - అ - ౧౭౦.

పిదపహిరణ్యగర్భుడు తపంబొనర్చి, స్వాయంభువమనువు మొదలగు మువ్వురిని సృజింప వారు తత్త్వవేత్తలై సృష్టికివిముఖులైరి తపంబునకరిగిన బ్రహ్మతనశరీరార్థమును స్త్రీరూపంబుగ సృజించితనపోలికమిచే నాయమనుసృష్టికి శతరూపగా పిలిచియామెయు పతింగూడె, మరీచ్యాదులను, సప్తసాగరాదులను, సృజించి, పిదప విస్తారంబగుతపంబునలిపి చతుర్వేదములను, ధర్ముడు మొదలగువారిని సృజించె- అందుదక్షుడు, అదితిమొదలగు (౧౨) కన్యలను సృజించి మరీచిపుత్రుడగు కశ్యపునకు, రోహిణ్యాది (౨౭) నక్షత్రములను చంద్రునికినొసంగె- బ్రహ్మతాను సృజించినలక్ష్మ్యాది (౫) కన్యలను ధర్మునకిచ్చె- అంతసరస్వతి సురభిరూపమును ధరించి బ్రహ్మకడ నిలచిన నతండు దానింబొంది నిరృత్యాది ఏకాదశరుద్రులు, గోవులు, అజములు, హంసలు, ఓషధులు, మొదలగువానిని సృజించె. అందు కశ్యపునికి నదితియందు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవతలు, గలిగిరి. దితికి దైత్యులును, దనువుకు దానవులును, కాలకు కాలకేయులును, అనాయువుకు వ్యాధులును, క్రోధకు భూతపిశాచయక్షరాక్షసులును, వినతకు గరుత్మంతుడు మొదలగు పక్షులును, కద్రువకు సర్పములును, గలిగి జగద్వృద్ధినొందెనని వ్యాసులుచెప్పిన చాడ్పున మీకు నేనెరింగించితి గాన నీపుణ్యకర ప్రాదుర్భావోపాఖ్యానము భక్తియుక్తులై పఠనాదులొనర్చువారు సకలపాపవిముక్తులై స్వర్గాదిలోకముల జెందెదరని ఋషులకు సూతుండు వర్ణించె.

విష్ణుమహిమానువర్ణనము. - సం - అ - ౧౭౧.

అనినమునులు సూతునింగాంచి శ్రీమన్నారాయణునికి విష్ణుత్వము, కృతయుగమునందు హరిత్వము, దేవతలలో వైకుంఠత్వము, మనుష్యులలో కృష్ణత్వము, నెట్లు ప్రాప్తించెనన నతండిట్లనియె. భగవంతునిచరిత్ర కనుంగొనుట కెవ్వరికి శక్యంబుగాదైన నుడివెదవినుడు- అవ్యక్తస్వరూపియగు పరమాత్మ స్వమాయచే వ్యక్తలింగుడై నారాయణస్వరూపియై హరిస్వరూపమును బొందె ఇట్టిభగవంతుడు చతుర్ముఖబ్రహ్మగను, వాయువుగను, చంద్రుడుగను, బృహస్పతి మొదలగు నానారూపంబులు గనుండి అదితి గర్భంబున వామనుడుగాజనించి విష్ణుత్వమును బొందె- ఇతడేపూర్వకల్పమున బ్రహ్మను, సనత్సుజాతులను, మానవులను, వీరలచే సకలప్రపంచమును

జనింపంజేసె- ఇట్టిభగవంతుని మహిమందెలిసికొనుట బ్రహ్మాదులకైన నలవిగాదు- మఱియు నాతని చరిత్రంబు జెప్పెదవినుడు.

తొల్లికృతయుగమున వృత్రాసురవధ జరుగుచుండ ముల్లోకములయందు బ్రసిద్ధుడగు తారకాసురుడు దానవులతోడ సంగరంబున నింద్రాదిదేవతలం బరిభవింపవారుభీతులై విష్ణువే మనకు శరణుడని దలంచుచుండ- అతిగాఢాంధకారంబగు మేఘంబులుసూర్యచంద్రాదులంగప్పి యెల్లెడల తమోమయమై గగనంబున భయంకరమగు ఉరుములు, మెరుములతోడంగూడి మేఘంబులు ఘూర్ణింప సప్తమరుత్తులుద్భవిల్లె- అంతంతి ఉల్కంబులు భూమింబడ దొడంగె - అట్టియుత్పాతకాలంబునఁకృష్ణమూర్తి తనబాహువులచే నామేఘంబుల పైకెత్తిన నందంజనాచలాకారుండును, కిరీటమకుటకుండల పీతాంబరధారుండును, కనకరథారూఢుండునునగు భగవంతుని నింద్రాదిదేవతలుగాంచి కేలుమోడ్చి జయశబ్దంబులచే బలుగతులబొగడ నతండువారింగాంచి ఓదేవతలారా! మీరుభయంబందకుడు నేనసురుల బరిమార్చెదనని ప్రతిజ్ఞయొనర్చ యుత్పాతంబులదృశ్యంబులయ్యె- పుష్పవృష్టివర్షించె - దేవతలుముదంబందిరి.

దైత్యదానవులు యుద్ధసన్నద్ధులగుట - సం - అ - ౧౭౨.

అంతదైత్యదానవు లిట్టిభగవంతునివాక్యంబులాలించి దేవతలంగ్రుంప సమకట్టి,త్రినల్వప్రమాణంబును,నాలుగు చక్రంబులును,కింకిణీజాలాలంకృతంబును, వేయుభల్లూకములు గట్టినదియునునగు కనకరథంబును నానావిధాయుధోపేతుండగు తారకాసురుండును, సహస్రశిర యుక్తంబునగు అయోమయరథంబును విరోచనుండును,విప్రచిత్తి, అరిష్టుడు, కిశోరుడు, మొదలగు నసురులుతమతమరథాదుల నెక్కి-తక్క-సేనలు అశ్వగజ వ్యాఘ్రాద్యధిరూఢులై సంగరతలంబునకేతెంచి కొందఱు సింహనాదంబులంగావించిరి - కొందఱు భుజాస్ఫాలనముంజేసిరి - కొందఱు శంఖంబులంబూరించిరి - ఇటుల బ్రహ్మాండంబు తల్లడిల్లంజేయుచు పరిశ్వధాద్యాయుధంబులంబూని యుద్ధసన్నద్ధులుగనుండిరి.

దేవదానవయుద్ధము- సం - అ - ౧౭౩ - ౧౭౪.

అంతదేవతలిదిగాంచి ఐరావతంబును నింద్రుండును, కుబేరుడు విమానంబును, ఈశ్వరుడు వృషభంబును, శ్వేతాశ్వంబులంబూన్చిన రథంబును చంద్రుడును, సప్తాశ్వంబులుగలరథంబును సూర్యుడు తక్క-దేవతలు వారివారి రథాదులనెక్కి- యుద్ధంబునకుబయలువెడలి రందునలువురు లోకపాలురు చతుర్దిక్కులంగాపాడ శార్ఙ్గాద్యాయుధములంబూని యుద్ధసన్నద్ధులై సంగరతలమున కేతేర దేవతల

బలమున బృహస్పతియు, నసురుల బలమున శుక్రుండును, జయశబ్దంబులం బలుకుచుండిరి. ఇట్లారెండువారలు సంగరతలంబునం జేరి పరస్పర జయేచ్ఛులుగలవారై పర్వతముల పర్వతములు డీకొనుమాడ్కి ప్రాసపరిఘ శూలాద్యాయుధంబులతో బోర నందు దానవులు భుసుండిభిండివాల తోమరకుంత గదాద్యాయుధంబుల దేవసేనలపై బ్రయోగించిన వారిలో గొందరి శిరంబులు తెగి నేలంగూలె - కొందరివక్షంబులు వ్రక్కలయ్యె- కొందరు రక్తంబులు గ్రక్కుచు జీవచ్ఛవంబులుగనుండిరి. ఇట్టిఘోరంబగు సమరంబుం గాంచి నింద్రుం డసురులపై తామసాస్త్రమును బ్రయోగించిన నద్దైత్యులు తమోమయులగుచు తమవాహనంబులను తమవారినిగానక నిశ్చేష్టితులై యుండుతఱి తక్కుదేవత లాయుధములంబూని పటుచ్ఛిన్న పర్వతంబులమాడ్కి నద్దైత్యుల భూమిం ద్రెళ్లునటులం జేసిరి. ఇట్లుతమోమయంబగు సంగరతలంబును తారకామయుండు గాంచి ప్రళయకాలమునం బ్రకాశించెడి యగ్నింబోలి నొకబడబాగ్నిం బుట్టించిన నాప్రతాపంబుం గాంచి యసురులు తమంతట తామే ఉక్షీణులైరి. అంతనాయగ్ని జాజ్వల్యులై భగభగమండుచు దేవతలనావరించిన దాని వేడిమి కోడి సితాంశుడగు చంద్రునికడం జేరిరి. అట్టితఱి దేవేంద్రుడు వరుణునింగాంచి ఓవరుణుడా! ఈబడబాగ్నిం బాడ బహుదీప్తంబుగనున్నయది; దేవతలనగా గాల్పం దొడంగె గాన దీనితేజంబు నణంగింపుమని నవేడిస్లినియె.

తొల్లి సకలవిద్యాసంపూర్ణుడగు ఉర్వుడను మహర్షి ఘోరంబగు తపమునలుపుచుండ, నారదాది దేవర్షులు, బ్రహ్మర్షులు, హిరణ్యకశిపు, మునులను నసురు లనేకదకేతెంచి యిట్లనిరి. ఓఋషిశ్రేష్ఠా! ఋషివంశములు ఛిన్నమూలంబులుగ నున్నయవి. ఒక్కనికైన సంతానం బొడమదయ్యె. కావున కౌమారవయస్సుగల నీవు తపంబొనర్చి కాయక్లేశంబు జేయుట యుక్తంబుగాదు. వంశోద్ధారంబునకై పరిణయంబొందుమని నతండీకష్టకరోరంబులగు వార్తలనాలించి వారిం గాంచి బ్రహ్మర్షులారా! బ్రాహ్మణులకునియమయుగు తపంబు నేజైనెడ - దీనిచే బ్రహ్మను సగాజయింపనగు - ఇట్టిబ్రహ్మచర్యవ్రతంబుచే బ్రాహ్మణునికి బ్రాహ్మణత్వము సంఘటిల్లుచున్నయది - దారాదిపుత్రులచే సిద్ధించుగార్హస్థ్యంబునకును బ్రహ్మచర్యంబునకును మహాద్వైషమ్యంబుగాన బ్రహ్మమానసపుత్రులగు మీరు తపోమహిమచే బ్రహ్మమాడ్కి మానస పుత్రుల గలుగజేయుడు - సత్పురుషులంబోలి మీర సన్మార్గంబుల నుపదేశించెదరు గాననాతపోమహిమచే నాశరీరమునుండి పుత్రునిపుట్టించెదజూడుడని నొకరెల్లును చేతంబూనితనయూరువును నగ్నియుందునిని మథించిననందుండి జ్వాలామాలియు, నిరింధనుండును, నగ్నియనగ నొకసుతుండుద్భవిల్లి లోకంబుల దహింపంగమకించి తండ్రింగాంచి జనకా! నేమహాక్షుధితుడుగనుండుటం జేసి లోకం

నంమునా వీడేగదా; యనేకదానవుల బోరిగొనె, హిరణ్యకశిపుని వీడేగదా; వధిం చె- కావున వీడతిదయావిహీనుం డిట్టివా డింతకాలమునకు గోచరంబయ్యె- వీని నేలం ద్రెళ్లునటులం జేసిన దేవతలజయింపగునని పలుతెఱంగుల బరుషవాక్యములా డుచు-విష్ణువుం గవియసమకట్టిన నవ్విష్ణుమూర్తి చిరునగవుతో వానింగాంచి ఓయసురుడా! నీపూర్వికులేగిన మార్గంబున నిను నేనతిరయంబున జూచెదనన నా కాలనేమి భీషణాకారుండై నంమండి విస్ఫులింగంబులు వెడల సింహనాదం బుల దిక్తటంబులదరంజేయుచు దన నూఱు బాహువులచే విష్ణుని వక్షస్థలమునం గొట్టుచుండనయతారకాద్యసురులు తమతమాయుధములం బ్రయోగించినను పర్వ తములమాడ్కి- చలింపకుండుటంజేసి కాలనేమి తనగదం గిరగిరంద్రిప్పి గరు త్మంతుని శిరమున బ్రహరించిన విష్ణువుకోపించి చక్రాయుధముంబూని గరు త్మంతునితోడ బ్రహ్మాండాకారుండై తనపాదముల భూమియందిడి, కోటిసూర్య ప్రకాశమానంబును, శత్రుభయంకరంబునునగు సుదర్శనచక్రము బ్రయోగించిన నది నకాలనేమి బాహువులనఱికి శిరమును ద్రెళ్లినేసె- అంతనా మొండె శరీరయం బున బుసగిడినవ్విగరుత్మంతుని భూమింబడద్రోసి విష్ణుసమీపంబున సంచరింపుచు తత్క్షణమున నేలంగూలె. ఆచక్రంబును తక్కు-దైత్యులనుక్కు-డంగించి వారిని యమ పురికనిపె విష్ణువుంజేరె - సిద్ధచారణ గంధర్వాదులు పుష్పవర్షము కురిపించిరి- బ్రహ్మాదేవతలతోడ విష్ణుకడకేతెంచి పలుగతులబొగడ విష్ణువువారింజూచి వారి వారియధికారముల జెంది సుఖముగనుండుడనని యభయంజేసి వైకుంఠనకేతెంచె.

ఈశ్వరు డంధకాసురుని వధించుట - సం - అ - ౧౭౮.

అని చెప్పిన ఋషులు సూతుంగాంచి మహాత్మా! పద్మోద్భవప్రాదుర్భావ కథనము దేటపడంజెప్పితివి. శివుని మాహాత్మ్యమును వచింపుమని ప్రార్థించిన నతం డిట్లనియె - తొల్లి యంధకుడను దైత్యుడు నిష్ఠురంబగు తపంబొనరిపి దేవతలచే నవ ధ్యుండగునటుల వరంబువడసి యొకనాటి మహాకాళవనంబున పార్వతీపరమేశ్వరులు కేళివినోదంబులం దేలుచుండ నాయంధకాసురుడటకేతెంచి పార్వతిం గొనిచన నె న్నించిన నీశ్వరునకిని వానికిని ఘోరంబుదోరకొనియె- అట్టిసంగరమున నీశుండు వా నిపెట్టున కోడిపాశుపతాస్త్రముం బ్రయోగించిన నదివాని తనువును భేదింప నం దుండి రక్తంబుప్రవహింప దొడంగె - అందువలన ననేకనంధకాసురు లుద్భవిల్లిన వారిని నీశ్వరుండు శరములచే నొప్పింప వారిరక్తమునుండియు, ననేక కోట్లంధకు లుద్భవిల్లుటంజేసి వారిచే బ్రహ్మాండంబంతయు నావరింపంబడియె. అంతనా గౌరీపతి భీతుండై యారక్తపానంబు జేయుటకు మాహేశ్వర్యాద్యనేక మాతృకల సృజిం చిన వారారక్తపానం బొనర్చినను యంధకు లుద్భవిల్లుచుండ నీశుండు భీతచే

తనుఁ గుంఠుఁడై వాసుదేవుని శరణుజొచ్చె. అంతనతండు శుష్కరేవతియను నొకమాతృ కనుసృజించిన నదియారక్తంబు నెల్లంగ్రోలిన నీలకంఠుం డంధకుల నెల్లబొరిగొనిమూ లాంధకుని తనశూలాయుధంబునం గ్రుచ్చి గగనంబున కెత్తిన నద్దైత్యుఁడు పలుగతు లంవినుతించుటం జేసి శంకరుఁడుముదమంది గణేశాధికారమునొసంగె-పిదప మాతృక లాకలిగొని నీశుంగాంచి లోకంబుల భక్షించెదమన నతండట్లొనర్పంజనదు- లోకం బుల రక్షింపవలయుననినను, నవిశివవాక్యోల్లంఘనంబు గావించి లోకంబులభక్షిం పం దొడంగె-అంత కార్తికేయగురుండు కడుభీతుండై నృసింహునిధ్యానింప విదారిత హిరణ్యకశిపువక్షస్థలవినిస్సృత రక్తార్ద్రీకృతనఖుండును,కనకాచలసన్నిభుండును నగు నృసింహుండు బొడసూపిన శివుం డతనింగాంచి కేలుమోడ్చి యోలక్ష్మీకాం తా! నేనంధక రక్త పానార్థంబు సృజించిన మాతృకలు నన్నునాదరించి లోకంబు ల భక్షింపుచున్నయవి- నేసృజించినవాటిని నే నేనశింపజేయు టయధర్మంబుగాన సం హరింపనైతిననిన నృసింహమూర్తి తనయంగములనుండి ఘంటాకర్ణాది(౩౨) మాతృ కల సృజించిన నవిక్రోధావేశులై ఈశ్వరసృష్ట మాతృకలం దఱుమ నవిభీతులై నృసిం హుని శరణుజొచ్చిన నతండువారింగాంచి ఓమాతృకలారా! ముల్లోకములయం దు మీకు బలిపూజాదు లొసంగెడివారిని రక్షింపుడనినుడివి వారితోడ నృసింహుఁ డంతర్ధానంబునొందె- శివుండును తననిలయంబునకరిగె.

కాశీమాహాత్మ్యము - సం - అ - ౧౭౯ మొదలు - ౧౮౮ - వరకు.

అనినుడువ ఋషులు సూతుంగాంచి వారాణసీ మాహాత్మ్యంబును నుడు వుము - పింగళుండనవాఁడు ? అతనికి గణేశత్వ, అన్నదత్వ, క్షేత్రపాలకత్వాదు లెట్లుగలిగె ? వీనిని సవిస్తరంబుగ వినువేడ్కపుడన నతం డిట్లనియె- పూర్వము పూర్ణ భద్రుండను యక్షుడుగలడు అతనికిహరికేశుండను సుతుడుద్భవిల్లె - అతం డనిశము సదాశివపదారవింద మకరందపానానందుండై యుండ పూర్ణభద్రుం డతనింగాంచి కుమారా! నిను నే సుతునిగా పిలంచదగదు; మనయక్షకులంబునంబుట్టి యిట్టియకృ త్యంబు లొనర్పనగునా; ఈశ్వరుండు మనకువిధించియుండు జీవహింసయు మాంస భక్షణంబునువదలి మనుష్యాదులొనరించు శివపూజాధ్యానాదు లొనర్పంగూడదని నుడివి అతికఠినంబుగగృహంబునుండి వెలువడినీకిచ్చవచ్చిన నెచ్చోటనైన నుండుమని వచింప తత్క్షణంబ నతండు వారాణసికేతెంచి యింద్రియ నిగ్రహుండై వేయువ త్సరంబులు నిష్ఠురంబగు తపంబుసలుప నతనిపై వల్మీకంబుజనించిన క్రిమికీటాదుల చే భక్షింపబడి శల్యప్రాయుడైయుండె - అంత పార్వతీపరమేశ్వరు లుద్యానవనం బునకేగి కల్హార కేదార కరవీర జాజి విరుజాజి మొదలగు ననేకపుష్పవృక్షంబుల తోడను, సాలరసాలాది తరువులతోడను, హంసకారండవాది పక్షులతోడను, నిర్మ

లోదక రమణీయ సరోవరంబులతోడంగూడిన వనంబును పార్వతిగాంచి సంతసిల్లి యీశునంగని కాశీమాహాత్మ్యంబడుగ నతండు కాశికేగి యందువసించువారికి గలిగెడి ఫలంబును నందు దానధర్మంబులొనర్చిన లభ్యంబగు ఫలంబును మొదలగు మాహాత్మ్యంబుల దెలియంజేయుచు తపంబొనర్చెడి యక్షుండగు హరికేశుకడంజేర దేవిదేవదేవుంగాంచి ఇట్టి నీభక్తుండు శల్యమాత్రావశేషితుడగువరకు వరంబొసంగనైతివిగాన నీవవ్యుగ్రుండవగుట నిజంబేయని యనేకవిధంబులనుడువ నీలకంఠుం డతనింగాంచి ఓతపశ్శ్రేష్ఠా! నీతపంబుచాలించి వలయువరంబు వేడుమన నతండీశ్వరునకు నమస్కరించి, మీయందవిచ్ఛిన్నభక్తియు, అన్నదత్వమును, గణేశత్వమును, క్షేత్రపాలకత్వమ్ము మొదలగువరంబులొసంగుమన నీశ్వరుం డట్లొసంగి దేవితోడ యంతర్ధానంబునొందె.

నందికేశ్వరుడు సనత్కుమారుని కవిముక్త క్షేత్ర
మాహాత్మ్యంబు దెలియంజేయుట.

అని సూతుండుమడెవి నందికేశ్వరుడు సనత్కుమారునికి జెప్పిన చాడ్పున నవిముక్తక్షేత్రమాహాత్మ్యంబు జెప్పందొడంగె - తొల్లి మేరునగంబున ఉమామహేశ్వరులు సింహాసనమునం దాసీనులైయుండ గౌరినీలలోహితుంగాంచి దేవా! లోకంబున జను లేక్షేత్రంబున నివసించిన పాపంబులుదొలంగు? యెచ్చట వ్రతాచార తపాదులొనర్చిన నక్షయంబగు? క్షేత్రంబులలో నెయ్యది యెక్కుడు ఫలం బొసంగు? వీనిని దేటపడం దెలియబలుకుమన నతండిట్లనియె- ఓపంకజాక్షీ! వినుము; మున్ను నేవక్కాణించిన (౬౮) క్షేత్రములలో కాశి నాకత్యంత ప్రియకరంబు- నేనందు నిరంతరము వసించుటచే నది యవిముక్తక్షేత్రమనంబడు - అందెవ్వడేనివసించుచు సర్వేశ్వరుడగునన్ను నారాధించినజన్మాంతర దురితంబులంబాసి ముక్తుండగు- అందువ్రత తపాదులొనర్చిన నక్షయంబగు. మఱియు మనుజులు, దేవతలు, పశుపక్షి మృగాదులు, యవిముక్తక్షేత్రంబుజొచ్చి మరణంబుజెందిన నాసారూప్యంబు జెందెదరు- మఱియు మదీయక్షేత్రంబగు నవిముక్తంబునందలి గంగయందు స్నానంబొనర్చి రూప్యఖుర సహితమగు గోవును వేదపారగుడగు బ్రాహ్మణునికి దానంబొసంగిన వానియేడుకులంబు లతిపవిత్రంబులగు- అందు కాంచన రజత వస్త్రాన్నదానాదులొసంగిన యక్షయంబగుటయగాక మదీయపదంబుగలుగు. మఱియు నాగంగయందు స్నానంబొనర్చిన దశాశ్వమేధఫలంబు వాటిల్లునను మొదలగ నేకవిధంబులుగ నాయవిముక్తక్షేత్ర మాహాత్మ్యంబు దెలియంబలుక శైలజ జటాజూటుంగాంచిమన్మథాంతకా! ఈక్షేత్రంబును నెక్కుడు స్తోత్రంబొనర్చెదవు? నీవాస్థానంబు నేల వదలకుండెదవన నతండు దేవింగాంచి ఓసుందరీ! తొల్లి చతుర్ముఖునకుత ప్తకాంచన

ప్రభాభాసురంబగు నైదవశిరంబుండె. అతండొకతఱి నన్నుంగాంచి ఓయీశా! నీవుట్టక నేనెటులుంగుదునన నేను క్రోధరక్తేక్షణుడనై నావామాంగుష్ఠముచే నతని పంచమ శిరంబును ద్రెళ్లవేసిన నంత హిరణ్యగర్భుండు కడురోషించి నన్నుంగాంచి నిరపరాధియగు నాశిరంబును ద్రుంచితివిగాన నీవు కపాలిత్వమును జెంది భిక్షాటనంబొనర్చుచు బ్రహ్మహత్యా వ్యాకులుడవై తీర్థయాత్రల గావింపుదువని శాపంబొసంగ నంత నేనందుండి బయలువెడలి తీర్థయాత్రలగావింపుచు హిమవద్గిరికరిగి నందునివసించు నారాయణునిగాంచి భిక్షయొసంగుమనిన నతండు తననఖాగ్రముచే నిజపార్శ్వంబునుంజీల్చనందుండి (౫౦)యోజనముల విస్తీర్ణముగల రక్తధార వెడలిననతండు దానింభిక్షగొమ్మనె. అంత నేను ధీరతకపాలంబునొడ్డిన నాకారసహస్రమహావత్సరంబు లేకరీతింబారినను కపాలమునిండదాయె- అంత విష్ణుండు విస్మయంబంది ననుగాంచి గరళకంఠా! మిక్కిలి ఆశ్చర్యకరంబగు నీకపాలం బెక్కడిది? దీని వివరము దెలియంబలుకుమన నేనతనింగాంచి శ్రీపతీ! వినుము; పితామహుండు నూఱుదివ్య సహస్రవర్షములు ఘోరంబగు తపముసలిపి కనకాకారమును, పంచమ శీర్షమును జెందె- అట్టిశిరంబు నేద్రుంచుటంజేసి నాకపాలము నే నెక్కడికివెళ్లిన కూడ వెంబడించుననిన నను విష్ణుగాంచి నీవుపరమేష్ఠి కిష్టంబొనర్చిన నాతని తేజోమహిమచే నిది నిను వదలుననిన నేనందుండి వెడలి యనేక తీర్థయాత్రలగావింపుచు నవిముక్తక్షేత్రమునం బ్రవేశింప విష్ణ్వనుగ్రహముచే స్వప్నలబ్ధధనంబురీతి నాకపాలము సహస్రవ్రక్కలై నేలంగూలె. అగుటంజేసి యాక్షేత్రము బ్రహ్మహత్యాపహంబని బేర్కొనె - కావున నోయిందుముఖీ! యాక్షేత్రము నా యనిష్టమును బోగొట్టుటంబట్టి నాకిష్టమగు - అందు నాభక్తులుగాని విష్ణుభక్తులుగాని ప్రవేశించి మరణముజెందిన వారికి నా సాయుజ్యంబు సిద్ధించు- మఱియు నెల్లక్షేత్రములలో నవిముక్తక్షేత్రము శ్రేష్ఠముగాన, సిద్ధులు, సాధ్యులు,బ్రహ్మర్షు, లందు సదావసించెదరు. లోకమున మానవులకు యోగంబులేకున్న మోక్షంబుసిద్ధింపదు - అట్లుసిద్ధించినను అనేక సహస్రజన్మములకు యోగసిద్ధియు పిదప వేయుజన్మములకు మోక్షసిద్ధియు కలుగుగాన ఈయవిముక్తమున నివసించిన నరుల కొక జన్మమున యోగమును, మోక్షమును, జేకూరు. ఈమహిమ నెఱింగి మున్ను వ్యాసు లిందేవసియింపుచుండి శాపంబివ్వ సమకట్టెననిన దేవి నతనిగాంచి చంద్రమౌళీ! వ్యాసుడు శాపంబిచ్చుటకేల నుద్యుక్తుడయ్యెననిన నతండిట్లనియె - తొల్లి వ్యాసులనేకసహస్ర హాయనము లుగ్రంబగు తపంబొనర్చియాకలిగొని భిక్షాటనముజేయుచు నాలుమాసము లప్పట్టణమంతయు దిరిగి దిరిగి వేసరి యొకనైన భిక్షనిడకున్న సక్రోధుడై నాకాశీవాసులకు శాపంబివ్వ యత్నించుచుండ మనము భీతులమై- నరాకారములంబూని కాశికేగి యొకచో గృహస్థులమై వ్యాసరాక నిరీక్షింపుచుండ

నతండేగుదెంచిన మహాత్మా ! నేటిదినము మాగృహమున భిక్షగొమ్మన నతండు వల్లెయన భద్రసే సహిత భిక్షనిడ యాతఁడుభుజించి సంతృప్తుఁడై మనల నెఱింగి పలువిధముల బొగడ నేవ్యాసుంగాంచి కటకటా కట్టడి తనమున యిట్టి క్రూరకృత్యమునలుప సమకట్టందగునా ? ఇదిమహాపుణ్యక్షేత్రం బిందువసించునరులు పాపమూరు లట్టివారల శపింపం బూనందగునా ? నీవు కుటిలమనస్కుఁడవుగాననిందుండందగదు వెడలిపొమ్మటకేనిం బొమ్మన నతండుభరిపడి చతుర్దశ్యష్టములయందు దానుగాశిని బ్రవేశించునటుల వరమడుగ మనవాల్లో సంగి యంతర్ధానము నొందితిమి. పిదప వ్యాసుఁడాపట్టణమును విడనాడనేరక తత్పార్శ్వమున నొకస్థానంబు గల్పించికొని నందు వాసము జేయుచుండు. (అదియే వ్యాసకాశియనంబడు.) కావున వారాణసియందునివసించి మరణముజెందువారికి దశాశ్వమేధఫలమును సర్వక్రతుఫలముగలిగి నాసాయుజ్యముజెందుదురు. మఱియునందు విశ్వేశానందకానసంబున, దశాశ్వమేధము, లోలార్కము, కేశవము, బిందుమాధవము, మణికర్ణిక, యనునైదుతీర్థములు పరమపవిత్రములై వెలయుననియనేక విధములుగ నామాహాత్మ్యమును దేవికి దేవదేవుండుపదించె.

నర్మదామాహాత్మ్యము - స - అ - ౧౮౫ - మొదలు - ౧౯౩ - వరకు.

అనిచెప్పిన ఋషులు సూతుంగాంచి నర్మదామాహాత్మ్యము, ఓంకారమాహాత్మ్యముల వినుపింపుడనిన నతండు వారలంగాంచి యిట్లనియె. తొల్లి యుధిష్ఠిరుఁడు మార్కండేయునింజూచి మహాత్మా ? నర్మదామాహాత్మ్యమునుడువుమనిన నతండిట్లనియె - ఓయుధిష్ఠిరుఁడా ! కనఖలమునగంగయు, కురుక్షేత్రమున సరస్వతియు జనించుటంజేసి యందేయవిశ్రేష్ఠంబగు - నీనర్మదగ్రామమునందుండినను నరణ్యమున నుండినను సర్వత్రశ్రేష్ఠంబై వెలయు - సరస్వతీనది మూడుదినంబులును యమునానది నియేడుదినములును స్నానముసేసిన పుణ్యంబబ్బు - (౧౦౦) యోజనములపొడవు (౨) యోజనముల వెడల్పుగలిగి అరువదికోట్లయరువదివేల తీర్థములచే వెలయుచుండెడి ఈనర్మదానదియందు దేవాసుర యక్షగంధర్వ విద్యాధరులు తపంబొనర్చి సిద్ధినిజెందిరి. గానదాని గాంచినమాత్రంబున పవిత్రుండగు - అందలి తీర్థములయందు స్నానదానాదులజేసిన వారికి స్వర్గముజేకూరు. అందుముల్లోకములయందు బ్రసిద్ధిజెందిన జ్వాలేశ్వరమను తీర్థముగలదు. దానియుత్పత్తినివివరించెద వినుము.

త్రిపుర బాణాసురోపాఖ్యానము.

తొల్లి బాణుండను నసురుడు త్రిపురముల నిర్మించికొని గగనంబున సంచరింపుచు నింద్రాదిదేవతల బాధింపుచుండ వారుభీతింజెంది శివునికడకేగి యతనిగాంచి కాలకంధరా! బాణాసురుడను నసురడు మూడుపట్టణంబు లాకసంబునగల్పించి

కొని మముబాధింపుచున్నాడని నుడివిన శివుండు వారింగాంచి మీరు భయంబువ
దలుడు, నే మీదుఃఖంబును బాపెదనని వారింబనిచి నారదుని స్మరించె. అతండే
గుదెంచి నమస్కరించి ననుస్మరించిన కారణంబేమనిన శివుండతనింగాంచి నారదా!
త్రిపురాధికారియగు బాణునిపురంబులకరిగి యందలి మారకామినీసుందరాకారసమా
నులగు స్త్రీలపాతివ్రత్య మాహాత్మ్యంబుచే నానగరులు గగనంబునందిరుగుచుండుటం
జేసి నీవు వారల బుద్ధులు జెడునట్లుగం జేయుమనిన నతండందుండి వెడలి (౧౦౦)
యోజనముల వెడల్పు (౧౦౦) యోజనముల పొడవుగల బాణునిపురంబు జొచ్చె.
అంత మకరకుండలాద్యనేక భూషణాలంకృతుండై సింహాసనాసీనుడగు బాణుండు నా
రదుంగాంచి యర్ఘ్యపాద్యాది విధులచే బూజించి నతనిచే సకలలోక సంగతులనె
ఱుంగుచుండ బాణుని నెలతయగు ననౌపమ్య నారదునికడ కేతెంచి నమస్కరించి
నతనిచే నాశీర్వాదంబుగైకొని యిట్లనియె. నారదా! ఏదానముచేత దేవతలుముద
మందుదురు? ఉపవాసముచే నేమిఫలంబబ్బు? వినుపింపుమనిన నాయముం డిట్లనియె. ఓ
యిందీవరాక్షీ! వేదపారగుడగు బ్రాహ్మణునకు తిలధేనుదానంబొసంగిన సప్తద్వీ
పసహిత ధరణీదానఫలంబు జెంది స్వర్గంబునను నివసించు. ఏకన్యాలలామ ఆత్రమాదివ్ర
తదానంబొసంగునో నాయమకు భర్తృవశ్యంబై యుండు. మఱియు, అష్టమి, చతు
ర్దశి, పంచమి, ద్వాదశి, సంక్రాంతులు విషువత్పుణ్యకాలము, వీటియందుపవసిం
చు నారీమణికి స్వర్గంబుగలుగు. అనినుడివిన నారదుంగాంచి యనుపమా! నాపూర్వ
జన్మ పుణ్యఫలంబుననో, నీజన్మపుణ్యఫలంబుననో భగవదాగమనంబు జూడంగంటి
నైన నొక రహస్యతెలుంగవలెనన్నదంచెదవినుడు. నాకు విద్యావతియను నొక అత్త
గారుగలదు-ఆయమ యొకప్పుడుననుజూచి సంతోషించుటలేదు-శ్వశురుండునున
ట్లనేయుండు. మఱియునతిక్రూరురాలగు కుంభీనసయను భర్తృసోదరిగల దదిననుజూ
చినపుడెల్ల యంగుళీభంగము(మెటికలువిరుచుట)నొనర్చుచుండు. కావునవీరలు స్వా
ధీనమగు వ్రతమునుపదేశింపుడని ప్రార్థించిన నాతండిట్లనియె. మున్ను నేజెప్పిన వ్రత
ము అరుంధతి, లక్ష్మి, సరస్వతి, మొదలగు వారలనుష్ఠించి సౌఖ్యంబుం జెందిరిగా
న నీవునుదానిని సలిపిన సుఖంబువారికిల్లునని నుడువ నాసుందరాంగి యతనింగాం
చివస్త్రాదిమణులదానంబొసంగెద స్వీకరింపుడనిన నారదుండు న్యాకువలదు. వీదల
గు ద్విజులకొసంగుమని నచటనుండు పతివ్రతలమనంబులను చలనంబుగావించి
నీశ్వరాజ్ఞప్తకార్యంబొనర్చికొని నంతర్ధానంబునొందె. అంత నప్పట్టణవనితలు
యనేకభంగుల వర్తింపుచుండ నానావిధకలహములు వాటిల్లె - అంతనర్మదాత
టమందలి మహేశ్వరస్థానమునను పరమేశ్వరుడేతెంచి బాణాసురుని త్రిపురంబులద
హింప సమకట్టి చతుర్వేదంబుల గుఱ్ఱములుగను, సర్వదేవమయంబగు రథంబును
గావించి, బ్రహ్మను సారథిగాగొని మందరమును గాండీవముగను, వాసుకిని వింటి

నారిగను, విష్ణువును బాణంబుగను, అగ్నివాయువుల బాణాగ్రముగను, జేకొని రథంబునెక్కి బాణమును బ్రయోగించుటకు వేయువత్సరములు బ్రతీక్షింపుచుండి త్రిపురంబు లేకంబగు సమయమున బాణమును బ్రయోగింప నంత నప్పట్టణస్త్రీలు భ్రష్టచేతస్కలై శైథిల్యమును జెందిరి- చిత్రప్రతిమలు గనులుదెరచి జూడదొడంగె- దారుమయగుజ్జములు పకపకనవ్వసాగె- అందలిస్త్రీపురుషులు స్వప్నమున తాము దిగంబరులుగనుండుటను గనుగొనిరి- వృక్షము లు భగ్నంబులయ్యె - ఇట్టి యుత్పాతంబులనేకము లుద్భవిల్లె - అంతట నీశ్వర విసృష్టబాణాగ్ని పట్టణములవ్యాపించి హర్మ్యప్రాసాద గృహాదుల దహింపుచుండుతఱి నానావిధానేక భూషణాలంకృతులగు నారీమణులు నగ్నిచే గాల్పంబడుచు నావేదనను సహింపనోపక నగ్నింగాంచి నయ్యయో నిర్దయుడగు పావకా! క్రూరులగు పురుషులయందుగదా నీ శౌర్యమును జూపవలయు, గృహములనుపంజరములయందు వసించు కోయిలలంబోలిన స్త్రీలు నీకేమపరాధంబొనర్చిరని యనేకు లనేకభంగుల నగ్నినిదూషించినను నాబాణాగ్ని దయావిహీనుడై దహించె- అంతబాణుం డిది యీశ్వరకృత్యంబనిదలంచి తనకత్యంతప్రియమగు శివలింగమును శిరముననిడికొని పుత్రకళత్రాముల విడనాడిగగనంబును చేరి నను దహించిన నీలింగమును దహింపకుమని జగద్రక్షకుడగు శంకరుని తోటకవృత్తములతో పలువిధముల బొగడిన నుమాపతి సంతసిల్లి ఓబాణుడా! నీవు భయము దెగడుము, దేవతలచే నవధ్యుండవై నీమూడవ స్వర్ణపురమును జేకొని బ్రహ్మాదిలోకముల సంచరింపుచు సుఖంబుగనుండుమని వరంబొసంగె- అంతనా రెండుపట్టణములుదహింపబడి యొకటి శ్రీశైలంబునను, రెండవది జ్వలింపుచు యమరకంటక నగ సమీపమున బడుటంజేసి యది జ్వాలేశ్వరంబని చేరొ్కనె - పిదపనా యగ్ని లోకముల గాల్పందొడంగిన నీశ్వరుండుపసంహరించె - అగుటంజేసి జ్వాలేశ్వరమున స్నానంబొనర్చి సకలదేవతాపరివృతుడగు నీశ్వరుని దర్శించిస్నానదానాదుల గావించిన నరుడు దురితదూరుడై స్వర్గాదిలోకముల జెందు- మఱియు కావేరీసంగమము, నర్మదాసంగమము, యంత్రేశ్వరము, ధారాతీర్థము, బ్రహ్మావర్తము, అను మొదలగుతీర్థంబుల... ప స్నానము, పితృశ్రాద్ధాదులు, గోదానాదిదానములు, గావించిన మానవు... శివలోక విష్ణులోకాదులులభించు. అంమదశాశ్వమేధంబను తీర్థంబుగలదది మిక్కిలిపుణ్యకరంబు, దానికిపశ్చిమంబున భృగువను మహర్షి శివుంగూర్చి (౧౦౦౦) దివ్యవత్సరంబులు తపంబొనర్ప నతనిపైవల్మీకముద్భవిల్లి అందుపై వృక్షంబులుపెరిగి పక్షులకాధారంబుగనుండె. ఉమామహేశ్వరులొకతఱి యచటికేతెంచిన గౌరిశివుంగాంచి దేవా! ఈతపంబుసలుపు నతడుదైత్యుడా? దానవుడా? యనినడుగ నాయమకతని తెలుం గెఱింగించిన పార్వతిపశుపతింగాంచి నీవు నిర్దయుండవు, ఇతనిశిరంబున తపోగ్నివలన ధూమంబు వెడలుచున్న

దిజూడుము; నీవేల వరంబొసంగవైతివన నాగంగాధరుడు చిరునగవుతో నిట్లని యె. ఇతండు నిష్ఠురంబగు తపంబొనర్చుచుండినను క్రోధమును విడవడయ్యె యిది నీకెఱింగించెద జూడుమని తనవృషభమునుస్మరించిన నదియేతెంచి శివునికి నమస్కరించి నిలువంబడిననతండు దానింగాంచి యీవల్మీకమును పెకలించి విప్రుని భూమిం బడద్రోయుమన నావృషభమట్లొనర్ప భృగువు "పాదతాడిత భుజంగంబుమాడ్కి" క్రోధపరీతాత్ముడై నిజబాహువులంబై కెత్తిఓవృషభమా!నీవెటకేగెద నిలునిలువుము, నిను నాశంబొనర్చెదనని నుడువుచుండ నదిగగనంబునకెగసె. అంత శివగౌరులతని కడకేతెంచిన నతండు వారింగని నమస్కరించి పలువిధముల స్తుతింప శివుడు సంతుష్టుడై వలయు వరము వేడుమన నతండుమీరీస్థలంబునని వసింపవలయుననివరంబు వేడ శివుడట్లొసంగె. కావున నాతీర్థముభృగుతీర్థమని పేర్కొనంబడె. అందు సదా సదా శివుండువసించు. అందు స్నానదానాదులొనర్చెడి నరులు స్వర్గవాసులగుదురు ఓధర్మరాజా ! ఇట్లనేక తీర్థంబులుగలవందుమ్రుంకిన వారిఫలంబులంజెప్ప నలవిగాదు కావున నీవందరికి నీకోర్కులుబడయుమన నతండట్లొనర్చె. మార్కండేయుండు తననిలయంబునకరిగె.

గోత్రప్రవరాదినిర్ణయము - భృగుగోత్రవివరము - సం - అ - ౧౯౪.

అనినుడివినమనువు మత్స్యంగాంచి మహాత్మా ! ఋషులనామగోత్రవంశప్రవరాదులవినుపింపుమనిన మత్స్యండిట్లనియె. తొల్లి సప్తర్షులీశ్వరుని శాపంబుచే దనువులవిడదిమఱలజనించిరి,అదెట్లన్న,మున్నుబ్రహ్మ అశ్వమేధక్రతువునొనర్పుతఱి దేవపత్నులను, దేవమాతలనువీక్షించుటచే నాహంసవాహనునకు రేతస్స్రవించి ధరణింబడె. అంతనావీర్యమును నగ్నియందు హోమంబుజేయ నాయగ్నినుండి భృగువు, అంగారములవలన నంగిరస్సు, అర్చిస్సులవలననత్రి, కిరణములవలన మరీచి, వ్రేలుకేశములనుండిపులస్త్యుడు, కేశములవలన పులహుడు, వసుమధ్యంబువలన వసిష్ఠు, జనించిరి. అందుభృగువు పులోమునిసుతనుబరిణయమంది దానివలనభువనాది పుత్రద్వాదశకంబును వడసె. వీరలే భృగువులనిపేర్కొనంబడి దేవతలుగనెగడిరి.

ఈభృగుగోత్రము (౭) గణములుగవిలసిల్లు.

(౧) ఔర్వాది (౯౦) గోత్రకారులు - వీరు పంచార్షేయులు- ప్రవరఋషులు- భార్గవచ్యావన ఆప్నవానఔర్వజామదగ్న్యులు.

(౨) జామదగ్న్యాది (౮) గో. త్ర్యార్షేయులు - ప్ర. భార్గవచ్యావన ఆప్నవానలు.

(౩) భృగుదాసాది (౧౩) గో. పంచార్షే - ప్ర. భార్గవ, చ్యావన ఆప్నవాన, ఆర్ష్టిషేణ అనూపులు.

(౪) యస్కాది (౧౭) గో. త్ర్యా - ప్ర. భార్గవ, వైతహవ్య, సావేదులు.

(౫) శాలాయనాది (౧౦) గో. పంచార్షే - ప్ర. భార్గవ, వాధ్ర్యశ్వ - దైవోదాస, ఆర్ష్టిషేణ, అనూపులు,

(౬) ఏకాయనాది (౯) గో. వీరుముందు జెప్పిన ప్రవరాదులతోగూడియుందురు. ఆయాగణములవారు ఆయాగణములతో పరస్పరము వివాహము జేసికొనందగదు. వీరి నామము లుచ్చరించిన పాపములుదొలంగు.

అంగిరోగోత్రవివరము - సం - అ - ౧౯౫.

అంగిరస్సు మరీచి సుతయగు సురూపను పరిణయించి ఆత్మాయుష్యాది దశసుతులువడసె. వీరు సోమపులని దేవతలుగ బలగిరి. పిదప బృహస్పత్యాది (౭) గురుజనించిరి. వీరుగోత్రప్రవర్తకులు ఇందు (౧౩) గణములుగలవు.

(౧) ఉచథ్యాది (౩౦) గో. త్ర్యార్షే - ప్ర. అంగిరస్సు, సువచ, ఉచథ్యులు.
(౨) ఆత్రేయాది (౫౪) గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, బృహస్పతి, భారద్వాజులు.
(౩) కాణ్వాయనాది (౩౩) గో. పంచార్షే - ప్ర. అంగిర, బృహస్పతి, భారద్వాజ, గర్గ, శినిలు,

(౪) కపీతరాది (౨౫) గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, దమవాహ్య, ఉరుక్షయులు.
(౫) పరస్పరాయణ్యాది (౫) గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, సంకృతి, గౌరవీతులు.
(౬) బృహదుక్థాది (౨) గో. పంచార్షే - ప్ర. అంగిర, బృహదుక్థ, వామదేవ, కుత్స, కుత్సులు.

(౭) రథీతరులు — గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, విరూప, రథీతరులు.
(౮) విష్ణువృద్ధా (౨) గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, మత్స్యదగ్ధ, ముద్గలులు.
(౯) హంసజిహ్వాదులు (౮) గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, తాండ, ముద్గలులు,
(౧౦) ఆపాండ్యాది (౧౨) గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, అజమీఢ, కణ్వులు,
(౧౧) తిత్తిర్యాదులు (౩) గో. త్ర్యార్షే - ప్ర. అంగిర, తిత్తిర, కపిభూలు.
(౧౨) ఋక్షాదులు- (౫) గో. పంచార్షే - ప్ర. అంగిర, భరద్వాజ, బృహస్పతి. మిత్రవర, మానవులు.

(౧౩) భరద్వాజాది (౪) గో. పంచార్షే - ప్ర. అంగిర, బృహస్పతి, భరద్వాజ మౌద్గల శైశిరుడు వీరుద్వ్యాముష్యాయణగోత్రజులు.
ఆయాగణములవారు ఆయాగణములవారితో వివాహమొనర్పం జనదు. వీరి నామంబు లుచ్చరించిన పాపంబులుదొలంగు.

అత్రిగోత్రవివరము. సం - అ - ౧౯౬.

ఈఅత్రిగోత్రము (3) గణములు గలిగియుండు.

(౧) కర్దమాయనాది(౨౬)గో- త్ర్యార్షే - ప్ర. అత్రి, అర్చనానస, శ్యావాశ్వులు,
(౨) దాత్ర్యాది (౧౧) గో. త్ర్యార్షే - ప్ర. అత్రి, గవిష్ఠర, పూర్వాతిథులు,
(3) ఆత్రేయపుత్రికాపుత్రులుకాలేయాదులు (౫) గో. త్ర్యార్షే - ప్ర. అత్రి, వామరథ్య, పైత్రులు- ఆయాగణములవారితో ఆయాగణములవారు వివాహము జేసికొనగూడదు. వీరినామములస్మరించిన సకలపాపములునశించు.

విశ్వామిత్రగోత్రము - సం - అ - ౧౯౭.

ఈవిశ్వామిత్రగోత్రము ( ౭ ) గణములుగలిగియుండు.

(౧) విశ్వామిత్రాది (౨౫) గో - త్ర్యార్షే - ప్ర. విశ్వామిత్ర, దేవరాత, ఉద్దాలకులు.
(౨) దేవశ్రవాది (౭) గో - త్ర్యార్షే - ప్ర. విశ్వామిత్ర, దేవశ్రవ, దేవరాతులు.
(3) ధనంజయాది (౧౦) గో - త్ర్యార్షే - ప్ర. విశ్వామిత్ర,ఆద్య,మాధుచ్ఛందసులు.
(౪) కమలాయజినాది(3) గో - త్ర్యార్షే - ప్ర. విశ్వామిత్ర, అశ్మరథ్య- వంశజులు.
(౫) విశ్వామిత్రాది (౪) గో - ద్వ్యార్షే- ప్ర. విశ్వామిత్ర, పూరణుడు.
(౬) లోహితాది (౨) గో - త్ర్యార్షే - ప్ర. విశ్వామిత్ర, లోహిత, అష్టకులు.
(౭) ఉదరేణ్యాది (౯) గో - త్ర్యార్షే - ప్ర. విశ్వామిత్ర, ఖిలిఖిలి, విద్యులు.

ఆయాగణములవారాయాగణములవారిలో కన్యల బరిగ్రహింపంజనదు- వీరినామములుచ్చరించిన సకలపాపహరంబగు.

కశ్యపగోత్రవివరము - సం - అ - ౧౯౮.

ఈకశ్యపగోత్రజులు (3) గణములుగనుందురు.

(౧) ఆశ్రాయణ్యాది (౪౮) గో - త్ర్యార్షే - ప్ర. కశ్యప, వత్సార, నిధ్రువులు.
(౨) అనసూయాది (౧౨) గో - త్ర్యార్షే - ప్ర. కశ్యప, వత్సార, వసిష్ఠులు, వీరు ద్వ్యాముష్యాయణగోత్రజులు.
(3) సంయాత్యాది (౨3) గో - త్ర్యార్షే - ప్ర. కశ్యప, అసిత, దేవలులు.

ఆయాగణములవారాయాగణములతో వివాహముచేసికొనంజనదు. వీరినామములుచ్చరించిన సకలపాపభంజనమగు.

వసిష్ఠగోత్రవివరము - సం - అ

ఈవసిష్ఠగోత్రజులు (౪) గణ[illegible]ందురు.

(౧) వ్యాఘ్రపాదాది (33) గో - ఏకార్షే [illegible] సిష్ఠుడు.
(౨) శైలాలయాది (౪౦) గో - త్ర్యా[illegible] ప్ర. వసిష్ఠ, ప్రమద, భరద్వసులు.
(3) ఔపస్థలాది (౧౮) గో - త్ర్యార్షే - ప్ర. వసిష్ఠ, మిత్రావరుణ, కుండినలు.
(౪) శివకర్ణాది (3) గో - త్ర్యార్షే - ప్ర. వసిష్ఠ, జాతూకర్ణ, అత్రి.

ఆయాగణములవారాయాగణములతో వివాహంబొనర్పంగూడదు. వీరినామములుచ్చరించిన సకలపాపములువలాయనంబగు.

వసిష్ఠనిమిచరిత్రము - సం - అ - ౨౦౦.

తొల్లి నిమియను చక్రవర్తి వసిష్ఠుని పురోహితునిగగొని ననేకక్రతువులొనర్చె. అంత వసిష్ఠుండు మిక్కిలియలసి యొకచో విశ్రమించియుండునెడ నంతలో నిమియతనికడకేగి మునివర్యా! మఱలజన్నంబొనర్పదలంచియున్నాడ. కావున జరిపింపవలయునని వేడ వసిష్ఠుడిట్లనియె. నృపాలా! ఇపుడేగదా యనేకయజ్ఞంబులజేయించి బడలియున్నాడను. అలసట తీరినపిదప జేయించెదనని నిమియిట్లనియె. మహాత్మా! ధర్మకార్యంబులకాలస్యము జేయంజనదు. నరునకు "జాతస్యమరణం ధ్రువమ్" బను శాస్త్రరీతి దేహమనిత్యంబుగాన ధర్మమచిరయంబునన యొనర్పవలయు. నరుడు మృతిజెందినను ధర్మముపాథేయంబుగనుండి సుఖముగలుగంజేయు. మఱియు "శ్వఃకార్యమద్యకర్తవ్యమ్" "శుభస్యశీఘ్రమ్" బనియు శాస్త్రంబులువిధించుటంజేసి యజ్ఞార్థమైనే కూడబెట్టిన సంభారంబులు వ్యర్థమగుంగాన తామేగుదెంచి జరుపవలయు - అట్లుగావింపరేని, నన్యునిచే జేయించికొనియెదననిన నమ్మునిక్రోధావిష్టుడై భీషణారుణవీక్షణంబులవాని వీక్షించి ఓరికష్టాత్మా! యాజకుడగునన్నునాదరించియన్యునిచే జేయించికొనియెదనని నుడివితివిగాన నీవు శరీరరహితుడవుగమ్మని శపించె. అంతనిమికోపగిల్లి వసిష్ఠా! నీవును జేయింపక, నన్యునిచే జేయించుకొనక ధర్మకార్యము జేయంబూనిననను నీవిట్టులండిట్టితివిగాన నీవును విదేహుండవయ్యెదవని శపించె. ఇట్లాండొరులుశపింపబడి విదేహులై కమలాసనునికడకేగిన నతండు వీరి తెఱంగెఱింగి నిమిని సకలప్రాణులనేత్రపక్ష్మములందు వసించునటులను, వసిష్ఠుని మిత్రావరుణులకు సుతుడుగ జనించునటుల ననుగ్రహించిపంపె. అంతనిమిప్రాణులనేత్రములయందువసించె. మిత్రావరుణులొకతఱి తపంబు సలుపుచుండ నవ్వానంబున నూర్వశి పువ్వులంగోయ నేతెంచిన మిత్రావరుణులుదానింగాంచి మోహపరవశులైయుండ కృష్ణాజి[illegible] వారివీర్యముస్రవించె. అంతవారావీర్యము నొకకడవయందుంచిననందుండి [illegible]డునుఅగస్త్యుడునుజనించిరి. పిదపవసిష్ఠుడు నారదునకు తోబుట్టువగు నరుంధతి[illegible] బరిణయమాడి శక్తియను పుత్రునిబుట్టించె. వారెవ్వరనిన కౌండిన్యాది(౨౫) గో-త్ర్యార్షేయులు-ప్ర. పరాశరశక్తివసిష్ఠులు వీరు పరస్పరమవైవాహ్యులు - వీరినామములుచ్చరించిన పాపములు నశించు.

అగస్త్యగోత్రవివరము - సం - అ - ౨౦౦.

ఈగోత్రంబున (౨)గణములుగలవు.

(౧) అగస్త్యాది (౧౫) గో-త్ర్యా-ప్ర-అగస్త్య-మాహేంద్ర-మయోభువులు.
(౨) పౌర్ణమాసాది (౨) గో-త్ర్యా-ప్ర-అగస్త్య-పౌర్ణమాస-పారణులు.

ధర్మవంశవివరము సం - అ - ౨౦౧.

ఈవైవస్వతమన్వంతరమున దక్షపుత్రికలగు అరుంధతి మొదలగువారివలన ధర్మునికి ధర్మిష్ఠులగు వసువులష్టకంబును, ఘోషాదులును జనించిరి - ఓసూర్యకులతిలకా! యీధర్మునివంశమును వివరించుటకు వేదవ్యాసునకైన నలవిగాదు.

పితృగాథ - సం - అ - ౨౦౨.

పితృగాథయనగా, పితరులువచించు వచనంబులెవ్వియనిన, మనవంశస్థులలో నెవ్వరేని, నదీతీరంబున తిలోదకమును, నిత్యశ్రాద్ధమును, కాలశాకాదులచే శ్రాద్ధాదులును, ఉభయతోముఖిగోదానము, కృష్ణాజినదానము, వృషోత్సర్జనము, పృథివీసువర్ణ గోదానములు, వాపీకూపతటాకారామప్రతిష్ఠలు, మొదలగునవి జేయుదురా; అందు చేనను దృప్తిజెందుదుమా; యని పలుగతులచింతింపుచుండెదరుగాన ముందుజెప్పినవాటిని మానవులొనర్పవలయు.

ఉభయతోముఖిగోదానము-మనువుకు మత్స్యుడుజెప్పుట - సం-అ-౨౦౩.

గ్రహణాదిపుణ్యకాలములయందు ఉభయతోముఖి (పశుప్రసూతికాలంబున వత్సము అర్ధముదరంబునను నర్ధముబయలువెడలియుండునది) గోవును స్వర్ణరజతముక్తాఫలములతో నలంకరించి దక్షిణసహితముగ బ్రాహ్మణునికి దానంబొసంగిన సప్తసాగరసహితధరణీదానఫలంబు గలుగుటయగాక పితరులును దృప్తిజెందెదరు.

కృష్ణాజినదానము - మత్స్యుడుమనువుకుజెప్పుట - సం - అ - ౨౦౪.

మాఘాషాఢకార్తికలయందును, పూర్ణిమ చంద్రసూర్యగ్రహణ ఉత్తరాయణద్వాదశీపుణ్యకాలములయందును, ఆహితాగ్నియగు ద్విజునికి కల్పోక్తప్రకారము కృష్ణాజినదానంబొసంగిన శివసాయుజ్యాదులుగలుగు.

వృషోత్సర్జనవిధి - సం - అ - ౨౦౫.

పురాణోక్తసర్వలక్షణ సహితముగు గోవుదరమునందుదయించియున్నత స్కంధతామ్రాదివర్ణము మొదలగు లక్షణములుగలవృషభమును కల్పోక్తప్రకారము వదిలిన మోక్షంబుజేకూరు.

సావిత్ర్యుపాఖ్యానము - సం - అ - ౨౦౬-మొ-౨౧౨-వరకు.

మనువు మత్స్యంగాంచిమహాత్మా! పతివ్రతలలోనుత్తమురాలగుస్త్రీ యెవ్వతె? యేస్త్రీ మృత్యువునుజయించె? యేస్త్రీనామంబునుచ్చరించిన పాపభంజనంబగు? నని మనువు ప్రార్థించిన నతండిట్లనియె. ఓదినకరసమానతేజా! తొల్లిమద్రదేశంబున నశ్వపతియను పార్థివుడు మాలతియను యువతింగూడి రాజ్యపాలనంబొనర్పుచుండ పుత్రులులేమింజేసి సావిత్రీదేవతనునారాధింప నాదేవిప్రత్యక్షంబై యిట్లనియె. ఓ

నృపాలా! నన్నునీవు నీవారాధించుటంజేసి సర్వగుణయుక్తురాలగు సుతజనించు ననివచించి యంతర్ధానంబునొందె. పిదప నతని నెలతయగు మాలతిగర్భంబునందొక్క సావిత్రియనుపుత్రికంగనెను. అంతనబ్బాలికకు యౌవనంబాసన్నంబైనది జనకుం డెఱింగి సత్యవంతుడను రాజకుమారునికివ్వదలంచియుండ నాశౌకలునికడకు నార దుడేతెంచి నృపపుంగవుంగాంచి ఓ తండ్రీ! నీవిపుడు కన్యనివ్వందలంచియుండు సత్యవంతుడొకవత్సరంబులో మరణంబు జెందుననినుడివి యదృశ్యుండయ్యె. అంతన పార్థివుండు విగతధైర్యుండుగాక "సకృత్కన్యాప్రదాతవ్యా" అను శాస్త్రరీతి నాసత్యవంతునకి తనసుతనొసంగె. పిదపసావిత్రినారదు వాక్యంబులదలంచి చింతిం పుచు భర్తతోడంగూడి రాజ్యభ్రష్టులైయంధులై కళత్రపుత్రాదులతో వనంబున వసించుతనశ్వశురుడు మొదలగువారికి శుశ్రూషజేయుచు నొకవత్సరంబు గతింపం జేసె. అనంతర మా యువతితన భర్తమృత్యువుపాలగు దివసమునకు నాలుగుదినములు మొదలుకొని ఫలాద్యాహారంబులచే వ్రతాచారాదు లొనర్చుచుండె. అంతసత్య వంతు డాచతుర్థదినమున పుష్పఫలేంధనాదులం దెచ్చుటకు దండ్రిచే నాజ్ఞప్తుడై యడవికి వెడలె. సావిత్రియు ఖిన్నురాలై మామచే నాజ్ఞంగైకొని నతనితోడ వనంబు నకేగి కొంతదూరంబరిగినపిదప సత్యవంతుడు బడలినతనభార్యంగని తరణికిరణ ములుసోకని తరుచ్ఛాయయందు నిలచి నాగపున్నాగ మల్లికామతల్లికాద్యనేకకుసు మతరు రాజివిరాజమానంబును, కలాపికలహంసకోకిలాద్యనేక పక్షిరవితమనోజ్ఞ కిలకిలనినద వినోదంబును, సింహవ్యాఘ్రమత్తగజాదులు తమతమనురవంబులంగూడి కేళీవినోదంబులందేలుసొగసుల నాసత్యవంతుడు తనసుందరాంగికి దెలియంజే యుచు బడలికందీర్చి ఓ చంద్రవదనా! మనయొక్క పుష్పఫలాదు లుండుటంజేసి నే కాష్ఠంబుల నటకితెచ్చెద. నీవీద్రుమచ్ఛాయ నాశ్రయించి క్షణంబుండుమన నా యొప్పులకుప్ప నతనింగాంచి వన్నెకాడా! నిన్నెడబాసి నేనొకనిమిషంబైన నుం డజాల. దూరంబరుగవలదన నతండందుండుమాత్రిసుల నఱకబోరకొనెను.

ఇట్లారాజనందనుడు వృక్షంబును దనకుఠారంబుచే గొట్టగా నది తలయందు దగిలిన శిరోవేదన గలవాడై భార్యంగాంచి నాకు శిరోవేదన గలిగియున్నదనినుడి వినాయువతితోడయందు శయనించె. అంత మకరకుండల పీతాంబరాద్యలంకృతుడ గుకాలుండేతెంచి సత్యవంతుని శరీరంబుననుండు యంగుష్ఠమాత్ర పురుషు డగు జీవుని తనకాలపాశముచేగట్టి నతిసత్వరంబుగ దక్షిణదిక్కునకు గొనిపోవుచుం డ సావిత్రి తనపతి గతజీవుండగుటనెఱింగి యముని వెంబడించి యాతనిగాంచి కృ తాంజలురాలై ఓకృతాంతా! స్త్రీలు మాతృశుశ్రూషచే మధ్యమలోకంబును, పితృశుశ్రూషచే స్వర్గలోకంబును, భర్తృశుశ్రూషచే బ్రహ్మలోకంబును జెందెద రుగాన నేనట్టివ్రతంబులు సలిపితి నాభర్తనుపిడువుమన యముండుసావిత్రింగాంచి

ఓవనితారత్నమా! నీవట్టి శుశ్రూషలఁ జేసినదాన వైనను నను వెంబడింపకుము, నీవు బడలియుండుటం జేసి మందిరంబున కేఁగుమన నాయిందీవరాక్షి యిట్లనియె - ఓఅంతకుఁడా! "పతిర్హి దైవతం స్త్రీణాం పతిరేవ పరాగతిః" అను శాస్త్రరీతి మానినులకు పతియే దైవంబును ప్రాప్యస్థానంబును నగుటం జేసి పతినే స్త్రీలనువర్తింపఁ దగు - అట్టియవితలోకాముల నిచ్చునా ప్రాణనాథునిని నీవెచటికి గొనిచనియెదవో నేనచటికే తెంచెదనన్న యముండా కన్యాలలామంగాంచి ఓమత్తకాశిని! నీవు మహాపతివ్రతవు నీ పలుకులకు నే సంతసిల్లితి, సత్యవంతుని ప్రాణంబులం దప్ప వలయు వరంబు వేఁడుమన సావిత్రి యిట్లనియె- ఓదండధరా! నాశ్వశురుండంధకుడు, చ్యుతరాజ్యుండు కావున నాతనికి నయనంబులు గలిగి రాజ్యంబు జెందునటుల వరంబొసంగుమన నతండట్లొసంగి నీవు క్లేశంబు జెందితివి గృహంబున కేఁగుమన నాయువతి మఱలి యిట్లనియె.

ఓవైవస్వతా! వినుము; సత్పురుషుల సహవాసంబున క్లేశంబేల గలుగు క్లేశంబు జనింపఁజేయు దుష్టుల శిక్షించుటకు శక్తిశాలివగలవు - అట్లు నృపునిచే శిక్షింపబడని వారిని నీవు దండించెదవు. కావున నింద్రాది దేవతలలో నధికుఁడగు నీసమీపంబున నుండు నాకు శ్రమంబేల గలుగునని యనేకధర్మవచనంబులం బలికిన యముండిట్లనియె- ఓరాజ్ఞీ! నీవిప్పుడు వచించిన ధర్మవచనంబులవలన నే సంతుష్టుడనైతి- నీభర్తప్రాణంబులు వినా వలయు వరంబు వేఁడుమన నాకు లికితనకు సహోదరులను పుత్రులు బొడమునటుల వరంబిమ్మనిన నతండట్లొసంగి సావిత్రింగాంచి ఓతోయజాక్షీ! నీవు నను వదలి నీయింటి కేగి దేహక్రియ లొనర్చి గురు శ్వశురులకు శుశ్రూష జేయుచుండిన సద్గతి గలుగు- నీవు శ్రమంబు జెందితివి గాన నాశ్రమంబున కేఁగుమన నాపతివ్రతాశిరోమణి వెండియునిట్లనియె. ఓశమనుఁడా! ధార్మికులకు శ్రమంబెక్కడిది? లోకంబున జనులు ధర్మము గదా నాచరింపవలయు- పరలోకంబునను ధర్మమే గదా సుఖంబును గలుగంజేయు గాన నీపాదసేవే నాకు మహాధర్మంబని యనేకధర్మంబులఁ దెలియంబలికిన నతండిట్లనియె. ఓపద్మగంధీ! నీధర్మవచనంబులవలన కరంబు సంతోషంబు జెందితి- సత్యవంతుని ప్రాణంబులం దప్ప వేఱొండు వరంబడుగుమన నాకరభోరు యముంగాంచి ఓకృతాంతా! అనపత్యులకు గతులు కలగవు గాన నాకును నూర్గురు సుతులు కల్గునట్లుగ వరంబొసంగుమన నతండట్లుగాక యనిన నావరారోహ మఱల యముని బలుగతుల బొగడి మిక్కిలి యున్నతాత్మయై ఓధర్మరాజా! నను నేశరణు జొచ్చితి- పతిభిక్షయొసంగి రక్షింపుమని ప్రార్థించిన నతండు సంతసిల్లి నీభర్తనొసంగితి- ఇతను నన్నూఱు వత్సరంబులు రాజ్యంబేలి సుఖంబుగనుండునని వరంబొసంగి యంతర్ధానము నొందె. పిదప సావిత్రి తనభర్త శరీరంబుండు స్థానంబున కేతెంచిన నతండు నిదుర మేల్కాంచినరీతి నుత్థితుడై తన నెలతం గాంచి ఓప్రాణేశ్వరీ! నేనే పురుషునిచే నీడ్వంబడితినో నతండెక్కడ? నేనిదురించినందున నొక దినంబు

గడచినదిగాబోలు - జననీజనకులు గృహంబున దుఃఖింపుచుందురనిన సావిత్రిభర్తం గాంచి మనోహరా! దివాకరుడస్తగిరి జెందుటంబట్టి ఆశ్రమంబునకు బోదమురండు- పిదప సర్వవృత్తాంతంబు విన్నవించెదనని సావిత్రి సత్యవంతునితోడ వనంబునువదలి మందిరంబునకేగ లబ్ధచక్షుష్కులై మాతాపితలు సత్యవంతునిగని సంతోషభరితాంతరంగులై కోడలింగాంచి నింతతడవుండుట కేమి కారణంబన సావిత్రియు సర్వవృత్తాంతంబంతయు నివేదించె-పిదప ద్యుమత్సేనుడు రాజ్యంబు జెందె- సావిత్రియు నూర్గురు కొమరులంబడసి సుఖంబుగనుండె. ఈ సావిత్ర్యుపాఖ్యానము శ్రవణపఠనాదులొనర్చువారికి పాపంబులుదొలంగి స్వర్గంబు జేకూరు.

రాజధర్మంబులు - సం - అ - ౨౧౩ - మొదలు - ౨౨౪ వరకు.

పట్టాభిషిక్తుడైన రాజు జేయందగిన కార్యంబులెవ్వి? జెప్పుమని వేడినమనువుకు మత్స్యుండిట్లనియె. ఓ సూర్యకులోద్భవా! వినుము; పట్టాభిషిక్తుడగు రాజు తానెంతశక్తియుక్తుడైనను నొరులసహాయంబు లేక నతనివలననొక కార్యంబైన నెరవేరదుగాన కార్యంబుల యుత్తమమధ్యమాధమంబు లెఱింగి తత్తత్కార్యములయందు సమర్థులగువారిని నియమింపవలయు. ప్రభువుకుహితముగోరువాని దూతకృత్యంబునను, శౌర్యధైర్యాదిగుణయుక్తుని సంగరక్షకునిగను, సౌందర్యాది గుణసంపన్నురాలగు యువతిని తాంబూలంబొసంగుటకును, సంధివిగ్రహంబులు దెలిసినవానిని దేశరక్షకుడగను, శత్రుమిత్రులయందు సమబుద్ధిగలిగి ధర్మశాస్త్రజ్ఞుడగు వాని ధర్మకార్యంబునను, సర్వభాషాలిపిజ్ఞానముగలవాని లేఖకునిగను, నాడీస్పర్శాష్టస్థానాదిపరీక్షలుదెలిసి చికిత్సలుచేయువాని వైద్యుడుగను, ఇటుల తత్తత్కార్యములయందు సమర్థులగు వారిని నియోగింపవలయు-మఱియు రాజు యొక కార్యం బాలోచించునెడ మంత్రులు మొదలగు సభాధ్యక్షులతో యోచించందగు. రాజు ఏకనియందును నమ్మకముంచంజనదు. వినయరహితుడగు [illegible]పాలుడు రాజ్యచ్యుతుండగుగాన వేదవేత్తలై సదాచారసంపన్నులగు బ్రాహ[illegible]ులను సతతము సేవింపుచు వారివలన వినయాదిగుణముల నభ్యసించి దండనీతి, [illegible]వ్వీక్షికీ, వార్తారంభాదివిద్యల గ్రహింపవలయు. అసచ్ఛాస్త్రకులసంగముత్యజించి యింద్రియనిగ్రహోపాయంబునునహర్నిశము నభ్యసింపవలయు. మఱియు రాజసూయాశ్వమేధాదిక్రతువు లొనర్చుచు సువర్ణ, ధరణీదానాదుల సదాగావింపుచుండవలయు. తానుపరిపాలించు జనులయెడ సంవత్సరోపయుక్తమగుద్రవ్యము నే కప్పముగా గొనుచు బ్రాహ్మణాదులను వేదాధ్యయనాదులందు ప్రవర్తిల్లంజేయవలయు. రాజుయుద్ధకాలంబున తనక్షత్రియధర్మమునుస్మరించి సంగరతలమునుండిపఱలంజనదు-అట్లుపఱలకుండుట, ప్రజాపరిపాలనంబొనర్చుట, బ్రాహ్మణశుశ్రూషజేయుట, రాజుకుశ్రేయస్కరంబగు. తనరహస్యకార్యంబన్యునికి దెలియంజేయకపరుని ఛిద్రంబుంగనవలయు. మఱియురాజుమదించినయశ్వంబును, బాలగజం

బున, నెకల్రంజనను. తా నెఱుంగనియువతితోడ కేళీవినోదంబులం దేలందగదు. "రా
జానశ్చారచక్షుషః" అనురీతి రాజు చారులవలన సర్వము నెఱుంగవలయు. సేవకులు
సదాచారసంపన్నులై తమతమకార్యశక్తినతిక్రమింపక రాజాజ్ఞానుసరణిని నటింపుచు
రాజునకుప్రియంబులగు వాక్యంబుల రహస్యంబున నెఱింగింపుచు రాజవేషభాషా
దుల ననువర్తింపక, ద్యూతాదులయందు తమతమ చాతుర్యంబుల దెలియంజేయ
వలయు. ఇటుల సేవకులు రాజును సేవింపవలయు. పట్టాభిషిక్తుడైన పార్థివుడు
తృణకాష్ఠాది సమృద్ధిగల నదీతీరదేశమధ్యంబున బ్రహ్మక్షత్రియవైశ్యాదులతోఁగూడి
న నగరంబు నిర్మింపవలయు. అందు పరిఘ ప్రాకారాట్టాలకములు, నానావిధా
యుధములు, వీటితోఁగూడి, ధ్వజపతాకాదులచే నలంకరింపంబడి నాలుగు తెరువులు
గలదుర్గము నిర్మింపవలయు. అందొక వీథ్యగ్రభాగంబున దేవాయతనము, (౨) వీథ్య
గ్రభాగంబున రాజగృహము (౩) వీథిని ధర్మాధికారిమందిరము, (౪) వీథ్యగ్రభాగం
బున ప్రాకారములుగలిగి యుండవలయు. రాజగృహ దక్షిణభాగంబున కోశగృహ
ము, అందుకుదక్షిణంబున ప్రాఙ్ముఖంబుగ గజస్థానము, ఆయుధాగారము, నిర్మింపవ
లయు. రాజగృహ వామభాగంబున, పురోహితుడు, మంత్రి, వైద్యుడు, వీరినిలయం
బులు, అశ్వాదిశాలలు, నిర్మింపవలయు. సేనాపతి మొదలగువారికి వారివారికి
యుచితమగు స్థానములు నియమింపవలయు. రాజు దుర్గమునం దనేకయంత్రములని
ర్మించి నానావిధ విషంబులును, కాల కాకోలాద్యావధోపయుక్త వృక్షంబులును
సేకరింపవలయు. ఇట్టిదుర్గమును రాజుపరిపాలింపవలయు.

విషనిర్హరణోపాయము.

బిల్వాటకి, యవక్షారము, పాదిరి, ఇంగువ, పిప్పలి, లేక మిరియాలు, గు
మ్ముడు, లేక నూరనెల్లి, అందుగచెట్టు, వీటివేళ్లకషాయము పెట్టి విషముమీదప్రో
క్షించిన నది నిర్విషంబగు- విరిగిచెట్టు, జేమపోట్ల, అతివస, మునుగ, మూర్వ, గరి
జేరు, మంజిష్ఠ, అడ్డసరపుచెట్టు, వెలగ, సహదేవి, పసపు, వీటివేళ్లువిషమునుబోగొ
ట్టును- లక్క, ప్రేంకణపువేరు, మంజిష్ఠవేరు, ఏలకులు, హరేణు, యష్టిమధుకము,
ఇవి, తేనె, బభ్రుపిత్తము వీటితో జేర్చి గోవిషాణంబున నిడిదాని భూమియందు యేడు
దినములు పూడ్చిపిదప నాగొట్టమునందుండు ద్రవ్యమునుమాత్రజేసి తాయితునం
దుంచి రెట్టనుగట్టుకొనిన విషముసమీపంబునం జేరవెరచు- మతియు విషంబుంచినవా
డు, భయపడుచు స్తంభకుడ్యాదులంజూచుచు, భూమిని గోటితో గీచుచు, శిరః కం
డూయనంబొనర్చుచుండు, కావున నిట్టిలక్షణములుగలవాని విషము పెట్టినవాని
గా నెన్నందగు- ఓరవినందనా! ఇటులనేకక్రియలుగలవు ఇంక విషదిగ్ధాన్నాదిపరీక్ష
ణోపాయంబు నుడివెద యాకర్ణింపుము. విషదిగ్ధాన్నమును నగ్నియందుంచిన చి
త్రవర్ణముగలిగి చిటచిటమనుశబ్దం బుత్పన్నంబై దుర్గంధముగలుగును. అనూము

సేవనవలన శిరోరోగంబు ధ్వపిల్లుటయగాక నాయోదనమును మక్షికలుసగా స్పృశించవు. విషదిగ్ధాన్నమును చకోరపక్షిసమీపమందుంచిన దానికన్నులెఱ్ఱనగు, కోయిలవికారస్వరముగగూయు, హంసకుగతిస్ఖలనంబుగలుగు, చిలుకబొట బొటకన్నీరువిడిచి మాయాయని ప్రలాపింపదొడంగు, కారండవము మరణంబుజెందు, వానరము మూత్రోత్సర్జనంబుగావించు, వ్యంజనంబులు ద్రవములేకయుండును, కావున నిటుల పరీక్షించి భుజింపవలయు. ఇక రాజపుత్రశిక్షాక్రమమును వివరించెదవినుము. రాజు తనపుత్రునికి వేదవేదాంగాది విద్యలంగరపవలయు. ధనుర్వేదము అశ్వగజారోహణము ఇవిమొదలగువాటియందు శిక్షింపంజేయవలయు. మఱియు రాజు ద్యూతము,మద్యపానము, దివాస్వాపము, కామక్రోధాదులు, వీటినివర్జింపవలయు-స్వామి, అమాత్యుడు, స్నేహితుడు,కోశము,దుర్గము, సేన, ఇవిసప్తాంగములుగాన రాజు వీటినివృద్ధిజేయుచు దైవమేసర్వంబునొనర్చునని దైవకారంబును నమ్మిపురుషకారమునందుపేక్షజేయక నానావిధోపాయములచే రాజ్యపరిపాలనంబొనర్చిన లక్ష్మిప్రసన్నమగు. మఱియు రాజు సామ దాన భేద దండంబులనెఱింగి ప్రవర్తింపవలయు. అందు దండోపాయమావశ్యకము. ధర్మశాస్త్రము ననుసరించి బాలవృద్ధాతుర వానప్రస్థయత్యాదుల వర్జించిదండింపవలయు. దండార్హులను శిక్షించకను, దండింపదగనివారిని దండించినను, యిహలోకమున రాజ్యభ్రష్టుడై నరకంబుజెందు. ఇంద్రాదిలోకపాలురు, సకలదేవతలు, లోకోపకారంబునకై దండాదులయందు నియమింపబడియుండెదరు. కావున సకల దేవతాస్వరూపుడగు నీశ్వరుంబోలి సకలాధికారంబులజేయుటచే రాజు దేవతలకన్న నెక్కుడు. రాజు దండవిధి నావశ్యకముగ జేయవలయు. అభియోక్తయనిన ఒకడు సంఖ్యయుంచి బహునియొద్ద ద్రవ్యంబిడినదానినతడపహరించినను, మఱియొకడు ధన మొకనియొద్దనుంచక నుంచితినని కల్లలాడినను, వీరిరువురును చోరునిశిక్షకుబాధ్యులు, మఱియు కిప్పము మొదలగు రాజార్హద్రవ్యమును నపహరించిన వానికుటుంబముతోడ వధింపవలయు. ఒకండొకని యాచించినవాడు ద్రవ్యంబిచ్చి మఱలనైకొని అపహరించిన, వానిశిక్షించి ద్విగుణధనంబును యాచకునకిప్పింపవలయు- బ్రాహ్మ[ణక్షత్రి]య వైశ్యశూద్రాదులలో నెవడైన అకార్యంబులొనర్చిన నతని ధర్మశాస్త్ర[ోక్త]ప్రాయశ్చిత్తాదుల జేయింపవలయు - ఇటుల నృపపుంగవుండు ప్రజల తారతమ్యంబులంగని దండనీతులచే శిక్షింపవలయు.

ఉత్పాతశాంతులు - సం - అ - ౨౨౬ - మొదలు - ౨౩౬ వరకు.

అంతమనువు మత్స్యంగాంచి దేవా! దివ్యాంతరిక్ష భౌమోత్పాతాదులకు శాంతుల దెలియంబలుకుమన నతండిట్లనియె. దివ్యాంతరిక్ష భౌమోత్పాతము, అప్సుగోత్పాతము, దేవతార్చా వికారోత్పాతము, అగ్నివైకృతోత్పాతము, వృక్షోత్పాతము, అతివృష్ట్యాద్యుత్పాతము, నద్యాదివైకృతము, ప్రసవోత్పాతము, ఉప

స్వరవైకృతము, మృగపక్షివైకృతము, ప్రాసాదపతనాది దుర్నిమిత్తము, వీటికిపు రాణోక్తప్రకారము శాంతులుగావించిన నవిమానును.

గ్రహయజ్ఞాదివిధి. - సం - అ - ౨౩౭.

రవినందనుండు జనార్దనుని గ్రహయజ్ఞాదివిధుల నడుగుమను నతండిట్లనియె. లోకమునకు దైవకృతముగనైనను, మనుష్యకృతముగనైనను, క్షోభ వాటిల్లిన గ్రహయజ్ఞము, లక్షహోమము, కోటిహోమము, వీటిని పురాణోక్తప్రకారంబొనర్చిన యెల్లయనిష్టంబులుదొలంగి సర్వక్రతుఫలంబు జేకూరు.

రాజ్ఞోయాత్రాకాలవిధి - సం - అ - ౨౩౮.

నరపాలుం డుద్ధయాత్రం జేయుకాలం బెద్దియని పృచ్ఛంజేసిన మనువుకు మత్స్యుండిట్లనియె. అతిభయంకరమగు యుద్ధముజరుగునపుడును, తనపృష్ఠదేశము నందలి శత్రుం డెదుర్చునపుడును, పరుడిపట్టణంబున నుత్పాతంబు లుద్భవిల్లునపుడును, అతని వ్యసనకాలంబునను, యాత్రంజేయవలయు. అదియును పార్ష్ణిగ్రాహుని జయించినైనను, అతనిజయించుసేనను నగరంబునం దుంచినైనను, యుద్ధంబునకు వెడలవలయు. అయ్యాత్ర మంత్రిమొదలగువారి సహాయంబుతో చైత్రమార్గశీర్ష మాసంబులలో గావించిన శుభంబువాటిల్లు.

అవయవస్పందన లక్షణములు తత్ఫలంబులు - సం - అ - ౨౩౯.

మనువుమత్స్యుంగాంచి అవయవస్పందన లక్షణములు తత్ఫలంబులు జెప్పుమని ప్రార్థించిననతండిట్లనియె. పురుషులకు వామభాగంబున, పృష్ఠమున, హృదయమున స్పందనముగలిగిన నప్రశస్తము, శిరస్సునయందైన భూలాభము, లలాటమున స్థానవృద్ధి, కనుబొమలందు తానుకోరిన వనితాసంగమము, నేత్రంబున భృత్యలాభము, దృగుపాంతమున ధనలాభము, ఱెప్పలయందు శత్రుజయము, కడకంటియందు వనితాలాభము, శ్రవణాంతమున క్షేమ సమాచారంబాకర్ణించుట, నాసికయందు సౌఖ్యము, అధరోష్ఠమునందు యిష్టస్త్రీలాభము, కంఠమునందు భోగము, భుజంబున భోగవృద్ధి, బాహువులందు మిత్రప్రాప్తి, హస్తమున ధనప్రాప్తి, పృష్ఠమునందు పరాజయము, ఱొమ్మునందుజయము, కుక్షియందుప్రీతి ఇవిపురుషులకు దక్షిణభాగంబున గలిగిన శుభము. స్త్రీలకు స్తనము చలించిన పుత్రలాభము, బొడ్డుయందు స్థానభ్రంశము, జఘనంబున ధనాగమము, జానుసంధులయందు పగల సంధి, పాదంబున లాభయుక్తక్షోపనచుట, ఇవి స్త్రీలకు వామభాగమునందు కలిగినశుభము. అనిష్టస్పందనములు గలిగిన స్వర్ణదానంబొనర్పవలయు.

స్వప్నఫలములు - సం - అ - ౨౪౨.

మనువువత్స్యంగని పురుషోత్తమా! సుస్వప్న దుస్స్వప్నఫలంబుల నెఱింగిం పుమన నతండిట్లనియె. నాభినిదప్ప శరీరంబెల్ల తృణవృతుమార్గంబునలదికొనినట్టును, మలినవస్త్రము ధరించినట్టును, అభ్యంగనం బొనర్చినట్టును, అడుసుపూసికొనినట్టు ను, ఉన్నతస్థానంబులనుండి భూమినిబడినట్టును, ఉయ్యాలలూగినట్టును, స్వర్ణాది లోహముల నార్జించినట్టును, అశ్వమును వధించినట్టును, రక్త పుష్పద్రుమముల చుంబనం బొనర్చినట్టును, వారాహ ఖరోష్ట్రములయం దెక్కినట్టును, పక్వమాం సము, పులగము, ఇవిభక్షించినట్టును, నర్తనము సేసినట్టును, నవ్వినట్టును, వివా హము జూచినట్టును, గానముచేసినట్టును, తంత్రీవాద్యరహిత వాద్యము వాయిం చినట్టును, ప్రవాహమున మునిగినట్టును, గోమయవారి, పంకోదకము, వీటితోస్నా నము సేసినట్టును, జనని యుదరమున బ్రవేశించినట్టును, చితారోహణము సేసినట్టును, ఇంద్రధ్వజముపడినట్టును, సూర్య చంద్రులు క్రింద పడినట్టును, దివ్యాంతరిక్ష భౌ మోత్పాతంబులంగాంచినట్టును, దేవద్విజ భూపాల గురువులు కోపించినట్టును, కుమారీల నాలింగనము సేసినట్టును, పురుషులమైథునం బొనర్చినట్టును, నిజావయ వములు నష్టమైనట్టును, విరేకవమనములు గావించినట్టును, దక్షిణముగ ప్రయాణమై పోయినట్టును, వ్యాధిపీడితుడైనట్టును, ఫలపుష్పంబుల దొంగిలినట్టును, మందిరము లు మగ్నములైనట్టును, సమ్మార్జనం బొనర్చినట్టును, పిశాచ, రాక్షస, వానర, మ నుష్యాదులతో క్రీడించినట్టును, పరులచే తిరస్కృతుడై దుఃఖించినట్టును, కాషాయ వస్త్రధారియైనట్టును, కాషాయవస్త్రము ధరించిన స్త్రీతో సంభోగంబొనర్చి నట్టును, నూనెలో మునిగినట్టును, రక్తపుష్పమాలికల ధరించినట్టును, ఇవి మొదల గునవిగలిగిన దుస్స్వప్నంబులని నెఱుంగవలయు.

ఇట్టిదుస్స్వప్నంబులు జనించిన మఱలశయనించి దాని నెరుని తో వచింపక శుచియైస్నానంబొన[illegible]లహోమము, బ్రాహ్మణపూజ, భగవన్నామస్మరణ, గ జేంద్రమోక్షపా[illegible]నపఠనము, వీటినిగావించిన దుస్స్వప్నదోషమునశించు - ఓమార్తండనందనా! శుభస్వప్నంబుల వాక్రుచ్చెదనాకర్ణింపుము - గిరిప్రాసా దహస్త్యశ్వవృషభంబులు, శ్వేతకుసుమవృక్షంబులు, వీటిపైయెక్కినట్టును, తనకుబ హుశిరంబులనేక బాహువులుగలిగినట్టును, శ్వేతపుష్పమాలికలధరించినట్టును, తాను శుక్లవస్త్రధారియైనట్టును, సూర్యచంద్రనక్షత్రంబులకు గ్రహణముపట్టినట్టును, వెల కినట్టును, శక్రధ్వజాలింగనంబొనర్చినట్టును, ధ్వజనిగగనంబునకెత్తినట్టును, ధరణీర రత్నాకరంబును మ్రింగినట్టును, శత్రునివధించినట్టును, కలహము, వాదము, యుద్ధ ము, వీటియందు [illegible]యుండినట్టును, పక్వమాంసము, మత్స్యమాంసము

హాయసము, వీటిని భక్షించినట్టును, రక్తముం గాంచినట్టును, అందుస్నానము సేసినట్టును, సురా, రక్తము, మద్యము, క్షీరము, వీటిని పానంబు సేసినట్టును, పేగులచే కట్టంబడి భూమిని పొర్లినట్టును, ఆకసంబును గాంచినట్టును, మహిషములు, పశువులు, స్త్రీసింహంబులు, స్త్రీనాగంబులు, వీటిని ముఖముతో దోహనము సేసినట్టును, దేవబ్రాహ్మణగురువుల బూజించినట్టును, గోశృంగోదకము, శుద్ధోదకము, వీటితో స్నానము సేసినట్టును, స్వప్నంబులు గలిగిన శుభంబు వాటిల్లును - చంద్రుడు పరిపూర్ణుండైనట్టు స్వప్నంబైన రాజ్యలాభంబు గలుగు - తాను పట్టాభిషిక్తుడైనట్టును, తన శిరంబు తెగినట్టును, మరణము సంప్రాప్తించినట్టును, తానగ్నియందు దహింపబడినట్టును, గృహంబులగ్నిచే నాశము జెందినట్టును, ఛత్రచామరంబులు జెందినట్టును, తంత్రీవాద్యాదుల వాయించినట్టును, నద్యాదియుదకంబుల తరించినట్టును, నిమ్నోన్నతధరణిని దాటినట్టును, హస్త్యశ్వపశువులు గృహంబున బ్రసవించినట్టును, తాను ప్రలాపించినట్టును, ఉత్తమస్త్రీలాభము గలిగినట్టును, నాయుపతి వారింగ సంభోగనర్చినట్టును, తాను శృంఖలముంచే గట్టుబడ్డట్టును, పురీషంబు మేనసలదికొనినట్టును, తత్కాలంబున జీవించియుండు నృపులను, స్నేహితులను, దేవతాగ్రహంబులను, నిర్మలోదకంబులను బొడగాంచినట్టును, స్వప్నంబైన శుభంబు గలుగు. ఇట్టిసుస్వప్నంబులు గలిగిన నెవ్వనికిని దెలుపంజనదు. ఈ స్వప్నంబుల గన్నవారికి అర్థలాభాదులు గలుగు - రోగికి రోగము నివర్తించు - మఱియు ప్రథమయామంబున స్వప్నంబైన ఫలము సంవత్సరంబునకును, ద్వితీయంబున ఆఱుమాసంబులకును, తృతీయంబున మూడుమాసంబులకును, చతుర్థయామంబున నొకమాసంబునకును, అరుణోదయ వేళనైన పదిదివసంబులలోను గలుగు.

శుభాశుభశకునవిచారము-సం-అ-౨౪౧.

మనువు మత్స్యంగాంచి దేవా! తావకంబగు నపాంగావలోకనంబు నాపయిం గలుగంజేసి శుభాశుభశకునంబుల దెలియంబలుకుమన నతండిట్లనియె- ఓ దినకరకులోత్తమా! ప్రథమంబున నశుభశకునంబుల నుడివెద వినుము- కృష్ణధాన్యంబులు, ప్రత్తి, కసువు, కరీషము, కాష్ఠములు, అగ్ని, గుడము, తైలము, తలంటుకొన్నవారు, మలినులు, శిరోముండనంబొనర్చికొనినవారు, రోగి, ఒంటిపిఱ్ఱి, కాషాయవస్త్రధారి, ఉన్మత్తుడు, బలహీనుడు, దీనుడు, నపుంసకుడు, ఇనుము, అడుసు, చర్మము, కేశబంధనము, తెలికపిండి మొదలగునవియు, చండాలుడు శ్వపచుడు, రాజబంధనపాలకుడు, వధకుడు, పాపకర్మ చేయువాడు, గర్భిణిస్త్రీలు, పొట్టు, భస్మము, ఎముకలు, పుఱ్ఱెలు, పగిలినకుండలు, ఎఱ్ఱకుండలు, విషాణంబులచే జేయంబడిన పాత్రలు, ఇవి తాను ప్రయాణంబై పోవునెడ నెదురుగా వచ్చిన నశుభము- భిన్నవాద్యము, భయం

కరవాద్యము వీటినాలించినను నశుభము - తానుబయలు వెడలి పోవునపుడు పృష్ఠపార్శ్వంబునుండి పిలుచుట, తనయెదురుపార్శ్వమున పో అనుశబ్దము, ఎక్కడికిబోయెదవనుట, పోవువాని కూర్చుండుమనిచెప్పుట, పోవువాని రమ్మనిపిలుచుట, ఏమిపనిగాజనియెదవు? నేనునువచ్చెదననుట ఇవి మొదలగునవియు, ధ్వజాదులయందు గృధ్రము మొదలగు పక్షులుకూర్చుండుట. వాహనములుజారిగిపడుట, తనపైవస్త్రము క్రిందపడుట, గృహమునుండి బయలు వెడలునెడ ద్వారబంధనము తలతాకుట, ఛత్రధ్వజంబులు భూమింబడుట, ఇవి మొదలగు నపశకునంబులు గలిగిన నరులు భగవన్నామస్మరణంజేసి జనవలయు. ద్విరావృత్తికలిగిన గృహంబునకేగవలయు. ఓరవికులరత్నమా! ఇకశుభశకునంబులం బేర్కొనియెద నాకర్ణింపుము. శ్వేతపుష్పంబులు, ఉదకుంభములు, హంసాదిపక్షులు, మాంసము, మత్స్యములు, నాగాశ్వపశువులు, ఒంటిబౌద్ధుడు, మేక, మిత్రులు, దేవతలు, అనేకబ్రాహ్మణులు, భగభగమండెడగ్ని, భోగముచాన, గరిక, ఆర్ద్రగోమయము, స్వర్ణరూప్యతామ్రంబులు, వజ్రవైడూర్యాదిరత్నంబులు, ఔషధంబులు, యవలు, తైలాలు, పల్లకి, సింహాసనము, ఖడ్గాద్యాయుధములు, రాజచిహ్నంబులగు ఛత్రచామరాదులు, దధిక్షీరఘృతంబులు, నానావిధఫలములు, మంగళద్రవ్యంబులు, భూషణములు, నంద్యావర్తము, ఇవి యెదుర్కొనుట, మనోహరవాద్యశబ్దంబులు వినుట, సుఖస్పర్శాది గుణయుక్తమగు వాయువు, తటిత్సనితయుక్తంబై గర్జించు మేఘము, అనులోమగ్రహములు, ఇవిప్రయాణమై పోవునెడ గలిగినశుభము, మఱియు తానుబయలు వెడలు సమయమున, ఔత్సుక్యస్థిక్యము, శ్రద్ధకలుగుట, పెద్దలనుబూజించుట, జయశబ్దములంబలుకుట, ఔత్సుక్యముగలుగుట, ఇవియును ప్రశస్తంబులు, ఇందు మనస్సంతుష్టియే శ్రేష్ఠముగాన ప్రయాణమైపోవునెడ సంతుష్టుడై జనవలయు.

వామనచరిత్ర - సం - అ - ౨౪౨-మొదలు - ౨౪౪-వరకు.

ఇటులరాజధర్మములవినుపించినమునులొప్పొంగి సూతుంగాంచి పుణ్యపురుషా! విష్ణువామనావతారంబెత్తి బలిచక్రవర్తి నెటులబంధించె? ముల్లోకంబుల నెటులావరించె? వీనినెఱింగింపుమన నతండిట్లనియె - మునులారా! తొల్లి అర్జునుడుతీర్థయాత్రంజేయుచు కురుక్షేత్రంబున కేతెంచి యందలి వామనాయతనమున శ్రీవామనమూర్తిని దర్శించియచ్చోనివసించు శౌనకమునిఋషివర్యా! జనార్దనుండు వామనావతారంబేలయెత్తె? ఈక్షేత్రంబువామనుని కిష్టంబగుటకేది కారణము? వరాహావతారియైయెటులపూజింపబడె? ననియడిగిన నతనికి శౌనకుండిట్లనియె - పూర్వముదేవాసుర యుద్ధంబుననసురులచే తాడితులై యింద్రాదిదేవతలోడిన వారిమాతయగు నదితియాకర్ణించి ఖిన్నురాలై అయ్యయో, మిక్కిలిబలి

ష్ఠులును, అజేయులును నైన నాపుత్త్రు లసురులచే నోడిరిగదా, యనియనేకవిధంబుల విలపించి దుఃఖసాగరమగ్నయై శ్రియఃపతిని శరణుజొచ్చి పలుగతుల బొగడ నతండు ప్రత్యక్షుండై వలయు వరంబు వేడుమనఁ నదితి యిట్లనియె- ఓయిందిరారమణా! అసురులు త్రిలోకాధిపతియు, నాపుత్త్రుఁడు నగు దేవేంద్రుని రాజ్యంబపహరించి యజ్ఞభాగంబులు సగా లేకుండం జేసిరి - భవదీయప్రసాదంబుచే నతనికి రాజ్యాదులు లభించినను నాసపత్నీసుతు లపహరించిరను దుఃఖము నను బాధింపుచున్నయది- దాని నివర్తింపుమనఁ రమాపతి యిట్లనియె - ఓదేవమాతా! నీకోరినయట్టుల కశ్యపునివలన నే నీయుదరమునం దుదయించి యసురుల బరిమార్చెదననియె - అంతనదితి చరాచరాత్మక స్వరూపివగు నిను నే నెటుల భరింపనోపుదునని నుడువ మురారి యిట్లనియె. ఓదాక్షాయణీ! చతుర్దశ భువనంబులను, సకలదేవతలను, కశ్యపప్రజాపతిని, నిన్నును నేధరించెద నీవు భీతిం జెందవలదని నుడివి యంతర్హితుడయ్యె. పిదప నదితిగర్భంబున విష్ణువు బ్రవేశింప భూమికంపించె, సముద్రములు కలంగె, అదితి తనపాదంబుల పుడమినినడిన నది నిమ్నంబగుచుండె. దైత్యులు నిస్తేజస్కులైరి. ఇట్టుల ననేకంబులగు నుత్పాతంబు లుద్భవిల్లె. అంత బలిచక్రవర్తి తేజోరహితులగు నసురులం గాంచి తనపితామహుండగు ప్రహ్లాదునితో నిట్లనియె. ఓపితామహా! ఈ దైత్యులం జూచిన వహ్నిదగ్ధులుగను, శాపగ్రస్తులుగను, నుండుట కెద్ది కారణం బెఱింగింపుమన నతండు ఓదైత్యనాయకా! ఈ చెడుగుఁ గాంచిన దేవతలను జయంబుగలుగునట్టుల కానంబడుచున్నయది, యనినుడివి కించిన్మీలితలోచనుండై అదితిగర్భంబున భగవంతుఁడు వామనాకృతింబూని ప్రవిష్టుడై యుండుటను, యతనియందు సూర్యచంద్రగ్రహనక్షత్త్రములు, బ్రహ్మాదిదేవతలు, జంభకుజంభాద్యసురులు, బలి, తాను, మఱియు జంగమస్థావరాములుండుటం గనుంగొని విస్మయావిష్టుడై యున్మీలితలోచనుండై బలింగాంచి వత్సా! పరాత్పరుఁడును సనాతనుండు ముల్లోకముల నింద్రుని కివ్వంబూని స్వాంశంబుతో నదితిగర్భమున బ్రవేశించియుండుటచే నిట్టియుత్పాతంబు లుద్భవిల్లెననియె. అంత బలి పితామహా! మనకు భీతింగలుగఁ జేయు హరియనువాడెవడు? మహాశౌర్యవీర్య ధైర్యాదులతో గూడి నాకంటెంబుతో రయింబున బృథ్విని నగా గగనమున కెత్తునట్టి శక్తిగల విప్రచిత్తి, శివి, శంకు, అయశ్శీర్షుడు మొదలగు నసురులుండ వారియంశమున నొకఁడైనను నాహరిబోలునా యనిపలువిధంబుల నిందించిన ప్రహ్లాదుడు నిజకరంబులచే గర్ణంబులం బొదివికొని హరిహరి యని క్రోధావేశుఁడై యిట్లనియె - ఓరిపాపాత్మా! నాను ఇందును, జగద్రక్షకుండును నగు లక్ష్మీపతిని నిందించితివి గావున రాజ్యభ్రష్టుడవగుదువని శపించె. అంత బలి దీనమనస్కుఁడై ప్రహ్లాదునకు నమస్కరించి పితామహా! మోహావిష్టుడనై మదోన్మత్తతచే నే వచించిన వాక్యంబుల కాగ్రహింపవలదని యనేకభంగుల వేడిన

ప్రహ్లాదుండు బలింగాంచి నీవిక మీదు హరింగూరకుమని నియతింజేసె. ఓ యర్జునా! యిదియిట్లుండనిమ్ము, అంత లీలామానుష విగ్రహుండు వామనాకృతింబూని నదితిగర్భమునుండి వెడలిన దేవతలుముదమంది పుష్పవర్షము గురిపించిరి. శైత్యసౌరభ్యాదియుక్తమగు వాయువువీచె. దేవవాద్యంబులుఘూర్ణిల్లె, అంత విరించి యేగుదెంచి వామనునికి జాతకర్మాదిక్రియలొనర్చి పలుగతులబొగడ నతండును నింద్రునికి త్రైలోక్యాధిపత్యమునొసంగి దేవతలకు హవిర్భాగములు గలుగునటులం జేసెదననిన హిరణ్యగర్భుడు కృష్ణాజినమును, బృహస్పతి యజ్ఞోపవీతమును, మరీచి పాలాశదండమును, వసిష్ఠుడు కమండలమును, అంగిరస్సు వేదమును, పులహుండక్షసూత్రమును, పులస్త్యుడు శుభ్రవస్త్రమును, నిట్లొసంగిన వానింగైకొని వేదములచే బొగడంబడుచు వామనమూర్తి జటాదండ ఛత్రకమండులలతో గూడి బలియజ్ఞవాటంబున కేతెంచుచుండు నెడ యనేకపర్వత సముద్రసహితంబగు నీధరణిచలించె. అంతబలిచక్రవర్తి తనకులగురుడగు శుక్రుంగాంచి ఆచార్యా! సకలద్వీపాదియుక్తమగు నీభూమి కీకంపంబేలగలిగె? అసురులకు హవిర్భాగములొసంగిన వీతిహోత్రుండు బ్రీతిచే నేలగ్రహింపడయ్యె? ఎఱింగింపుమన నసురగురుడు బలింజూచి హరివామనుడై నీయజ్ఞశాల కేతెంచుచున్నవాడు, అతనిపాదవిన్యాసముచే బుడమినిటుల చలింపదొడంగె, అతండేగుదెంచుటంబట్టియే నసుర భాగంబు లీయగ్నులు గొనవయ్యె ననిన బలి విస్మయోత్ఫుల్లలోచనుడై నేధన్యుండనైతి యజ్ఞకర్తయగు కేశవుడే నాయజ్ఞశాల కేతెంచుటంజేసి నాసము లెవ్వరు లేరుగాన నతండిట కేతెంచిన నేజేయుసత్కార్యము లెవ్వియనిన శుక్రుండో విరోచననందనా! వేదప్రామాణ్యముచే దేవతలకు హవిర్భాగములు గలిగియుండ వాటింబడగొట్టి యసురులకు కల్పించితివి, అట్టి హవిర్భాగంబసురులకు లేకుండంజేయుటకై యతడేగుదెంచు-కావున నతని కెట్టి స్వల్పవస్తువునైన నిచ్చెదనని ప్రతిజ్ఞయొనర్పకుమనియె - అంతబలిశుక్రుంగాంచి, దానముచేమానవుండు శ్లాఘింపబడు, దానమేగదా కీర్తినిగలుగజేయు- మఱియు శ్రీమద్వైకుంఠవాసుడగు హరియే "దేహీ" అనియడిగిన దానంబివ్వని వానిజన్మంబేల- అట్లొసంగని వానికి పలుచెడుగులు వాటిల్లునని యనేకవిధంబులుగ బలిశుక్రులొండొరులు వాదింపుచుండ వామనమూర్తియజ్ఞశాల కేతెంచి యజ్ఞకర్తను, నందుండు వజ్రవైడూర్యాదిమణులను, నాజన్మనిలయంబును శ్లాఘింపుచుండు తఱి బలి నర్ఘ్యపాద్యాదివిధులచే నతని బూజించి ఓ జగద్రక్షకా! సర్వసాగరవనపర్వత సహితంబగు భూమియు, గోపురప్రాకారాద్యనేక విభవంబులుగల పట్టణంబులు, పురంబులు, వనంబులుగలవు, మఱియు మరకతమాణిక్యపుష్యరాగాద్యనేకమణిగణఖచితభూషణాలంకృతులగు సుందరులును యున్నవారలు కావున మీకిష్టంబగుదాని నిచ్చెదవేడుడని ప్రార్థింపనా వామనమూర్తి మందహాసముఖారవిందుడై పృథ్వీశా! నేనగ్నిహోత్రంబులొనర్చుకొనుటకు మూడడు

గులపుడమినిమ్మనని నడుగ బలి పీతాంబరధరా! ఇంతకొద్దిభూమితో నేమిప్రయోజనంబు - లక్షపదతలంబుగా వలసిన నొసంగెదనని నుడువుచు నచ్యుతునిచ్ఛ చొప్పున మూడడుగుల భూమిని నుదకధారాసహితముగ దానంబొసంగె - తత్క్షణంబ వామనుడు సర్వదేవమయస్వరూపుండును, బ్రహ్మాండాకారుండును నై ముల్లోకంబుల నావరించి నసురులయుక్కణగ్గడంగించి త్రిలోకంబులను దేవపతివశంబు జేసి బలింగాంచి దానవేంద్రా! నీవు నాకు దానంబొసంగుటచే వైవస్వతమన్వంతరానంతరము సావర్ణికమన్వంతరంబున నింద్రుండవయ్యెదవు - మఱియు నా యాజ్ఞాప్రకారము దేవద్విజులకు విరోధంబొనర్పక సుతలంబను పాతాళలోకంబధిష్ఠించి దానిని పాలింపుచుండుమని నుడివి దేవతలతోడ నంతర్ధానమునొందె - ఓ అర్జునా! ఇచట పుండరీకాక్షుండు వామనావతారంబెత్తి బలిని బంధించుటచే నది వామనాయతనంబని బరగుంగె - ఈ విష్ణువే ద్వారకయందు కృష్ణుడై యవతరించి నీకు సారథ్యంబొనర్చునని వక్కాణించెనని సూతుండు తాపసోత్తములం గాంచి యీ వామన చరిత్రపఠనాదు లొనర్చువారు సకలపాప విముక్తులగుదురు - రాష్ట్రభ్రష్టులు రాజ్యము జెందుదురు.

వరాహావతారచరిత్ర- స-అ-౨౪౫-౨౪౮.

శౌనకుడర్జునుం గాంచి వరాహావతారవివరంబు నుడువదొడంగె - ఓ భారత కులతిలకా! యుగసహస్రాంతంబున భగవంతుడు తనజ్వాలలచే బ్రహ్మాండంబును దహింపంజేయ బ్రహ్మాదిస్తంబ పర్యంతమైన నీజగత్తు, సాంగవేద పురాణేతిహాసాదిసమస్తవిద్యలు, ఇంద్రాదిదేవతలు, వీరెల్ల వివశులై బ్రహ్మను ముందిడుకొని భగవంతునిశరీరంబున బ్రవిష్టులైరి - అంతనతండది దెలిసికొని మకరకుండలకేయూరాద్యలంకృతుడై శ్రీవత్సచిహ్నుడై పీతాంబరధరుడై సుస్థిరయోగంబు నారంభించె- అంత వేయుదివ్యయుగంబులు గడచినపిదప జగత్సృష్టి గావింపందలంచి తొల్లి తనయుదరమునందు బ్రవేశించిన బ్రహ్మాండమును మఱల బ్రకాశింపంజేసి సహస్రహాయనంబులు గడచిన పిదప కనకమయమగు దానిని ఊర్ధ్వాధోముఖములగునట్లు రెండుగ ఖండించి మఱల యెనిమిదిగ భేదించి యందు పదునాలుగు లోకంబుల సృజించె - అంత యధోభాగాండ ఛిద్రంబునుండి యొక యుల్బము భూమింబడిననది మేరుపర్వతంబయ్యె - పిదప నానావిధానేక పర్వతతరుగుల్మవన ద్విజభుజగమనుష్యాదుల భారము వహింపనేరక పృథ్వీదేవి పాతాళంబునకేగి ఖిన్నురాలై నన్నుద్ధరింపుమని యిందిరాధీశుని శరణు జొచ్చి పలుగతుల బొగడ నానందు సంతసిల్లి పంకంబున దిగబడిన నశక్తమగు గోవువలెనుండెడి ధరణింగాంచి నీవు భయంబందకుము- నిన్నుద్ధరించెదనని వచించి నూఱామడ వెడల్పు యిన్నూఱామడ పొడవుగలిగి

నీలజీమూత సంకాశంబును, యజ్ఞస్వరూపంబునునగు వరాహరూపంబు దాల్చి రసాతలంబునకేగి నిజదంష్ట్రాగ్రముచే భూమింబైకెత్తిన నదిస్వస్థానంబునంజేరి విష్ణునిపలువిధంబుల స్తుతించెననినుడివిన పార్థుండు శౌనకునకు నమస్కరించినతనిచే ననుజ్ఞవడసి గంగాద్వారంబునకేగె- శౌనకుండు నైమిశంబునకుజనె.

అమృతమథనము-సం-అ-౨౪౭-మొ-౨౪౯-వరకు.

మానుల్లిసులనారాయణ కథామృతపానం బొనర్చియు తనివిదీరకసూతుంగాంచి వ్యాసోపదేశజ్ఞానాయత్తచిత్తా! దేవతలుతపోకర్మలచేతనా, లేక, యెవరియనుగ్రహంబుననమరులైరి తెలియంబలుకుమన నతండిట్లనియె - తొల్లి దేవాసురసంగరంబున దేవతలచే దానవులు మృతులగుటను శుక్రుండుగాంచి వీరినెటులనైన పునర్జీవితులగావింపవలయునని మనంబున నెన్ని యంబికానాథుంగూర్చి నిష్ఠురంబగు తపంబుసలిపినతనిచే బ్రహ్మాదిదేవతలకును నశక్యంబగు మృతసంజీవిని యనువిద్యం జెంది యుద్ధంబునహతులైన దైత్యదానవుల నుజ్జీవింపవారలమరులై నింద్రాదిదేవతలంబరిభవింప నాకవాసులు మరణభావను జెంది విషణ్ణవదనులై మేరుపృష్ఠంబున నివసించు పరమేష్ఠి చెంతంజేర సరసిజోద్భవుడు వారింగాంచి ఓదేవతలారా! మీరుబలిమొదలగు దానవులతో సఖ్యంబొనర్చి యమృతోద్యోగం బొనర్పుడు- అదెట్లనిన, క్షీరాబ్ధిని తరించుటకై మందరనగంబును మంథానంబగునటులను, మేరువను మంథదండంబుగను, కూర్మంబును దీనికాధారంబగునటుల బ్రార్థించి యమృతము జనించునటుల జేయుడన వారును బలిచక్రవర్త్యాద్యసురులతో స్నేహంబొనర్చికొని క్షీరవారిధిని మథింపబోడంగిరి. అంత నాపర్వతము చలింపకుండుటంజేసి ఖిన్నులై దేవతలు బలిమొదలగు నసురులతోడ నారాయణునినిలయంబునకేగి దివ్యపీతాంబర స్రక్చందనాద్యలంకృతుడును, హేమపర్యంకశాయియునైయుండు దైత్యారింగాంచి నమస్కరించి పలువిధంబుల స్తుతింప నతండు వారినిమీరేతెంచిన కార్యంబెద్దియనవారల మృతోత్పన్నంబునకై మీరుసహాయంబుగనుండవలయునని వేడ నతండు దేవతలతోడ నందుండి వెడలి పాలకడలికేతెంచిన దేవాసురులు వాసుకిని మందరాచలంబునకుజుట్టి పక్షభీతులై దేవతలు పుచ్ఛభాగంబునుబట్టికొన నసురులు శిరోభాగంబునుబట్టికొనిరి - పిదప నారాయణుడు తనరెండుబాహువులచే నారెండు భాగములంబట్టికొనె - అంత వారిహితంబునకై సహస్రాక్షుడు మేఘరూపంబుదాల్చి అంబుశీకరములవర్షింప, వాయువుచల్లగావీవ నందఱు జయశబ్దములచే కలకలమని కోలాహలముల చేయుచు నాక్షీరసాగరమును దివ్యవర్షశతంబులు మథింపుచుండ నామందరగిరి గిరిగిరదిరుగుటచే నందలి పశుపక్షి మృగాదితరువులు కిడలింబడుచుయుగాక నోషధులును పతనంబగుటచే నందుఘనీభూతమగు ఘృతంబుద్భవిల్లె, పిదపనందుండి వారుణియను మద్యము

జనింప దేవాసురులు దానిపానంబొనర్చి మిక్కిలిబలిష్ఠులై మఱియు సంఖ్యాతీత వర్షములు తరించినను యమృతము పుట్టనందున మిక్కిలి డస్సి మథింప నేరక బ్రహ్మకెఱింగించిన నతండు భగవదనుగ్రహముచే వారికిబలముగలుగంజేసి మథింపుడనినవారును జలధికల్లోలం బగునటులమథించిరి. అనంతరమా క్షీరసముద్రమునుండి శీతాంశుడగు చంద్రుండు, ధౌతవసనధారియగు లక్ష్మి, సురాదేవి, ఉచ్చైశ్శ్రవము, కౌస్తుభమణి, పారిజాతము, కామధేనువు, ఐరావతము, ఇవి మొదలగునవి పుట్టె-కట్టకడ జగత్సంతాపకారిణియగు నొకధూమస్తోమంబు వెడలి భూమిని నాకసమును నావరించిన నందుగొందఱు దాని నాఘ్రాణించి మూర్ఛితులైరి-కొందఱుశిరోన్యస్త హస్తంబులుగలవారైరి-మఱికొందఱు దిక్కుదిక్కులకు బరుగులిడిరి. అంతనాధూమము భీషణజ్వాలా మాలలతోగూడి భగభగమండుచు కాలాగ్నియై యెల్లరిని దహింపుచుండె. పిండియు నారత్నాకరమునుండి డుండుభంబులు, వృశ్చికంబులు, కృష్ణసర్పములు, జనించినవిపిమ్మట నంజనాచలాకారంబును కిరీటకుండలాద్యలంకృతంబును నై విగ్రహాకృతినిం బూని మేఘంబువలె గర్జింపుచు కాలకూటవిషాగ్ని వెడలె-నంతదానినిశ్వాసాగ్ని కోర్వంజాలకనేకులు సముద్రతటమునం గూలిరి-విష్ణ్వింద్రాది దేవదానవులు దగ్ధాంగారములవలె యుండనంత గోవిందుడు దానిం గాంచి నీవెవ్వడవు! నీకోరికెయ్యది? నీకేమియొసర్చిన నిష్టంబు వాటిల్లు? ననిన నది భీషణారుణవీక్షణంబుల వారి న్వీక్షించి నేను దేవాదులచే మథింపబడిన సముద్రంబునుండి వెడలిన కాలకూటవిషంబును, నిదిగో జగంబులెల్ల క్షణమాత్రంబున దేవదానవుల నశింపంజేసెద, లేకున్నచో నన్ను మీరు భక్షింపుడనుడు విష్ణ్వాది దేవతలు భీతులై శంకరునిలయంబున కేగి యతనికి నమస్కరించి పలువిధంబుల స్తుతింప నతండు సంతుష్టుడై మీరేతెంచిన కార్యంబెద్దియని వారి నడిగెను. ఓ చంద్రశేఖరా! మేమమృతేచ్ఛగలవారమై క్షీరసాగరమును మథింపనందొక విషంబు వెడలినదై నన్ను మీరు భక్షింపుడు, లేక మిమ్మెల్లరిని దహించెదనని నుడివె- కావున నోయీశా! దానిజ్వాలలచే దహింపబడి విష్ణుండు కృష్ణవర్ణుండాయె, యముడు విమనస్కుడయ్యె - ననిమొఱబెట్టుకొన నతండువారికి భయంబొసంగి నావిషంబు నేభక్షించెదనని నుడివి వృషభారూఢుడై బ్రహ్మాది దేవతలు చామరంబులు వీవ జయజయశబ్దంబులతో పరమేశ్వరుడు పాలకడలికేతెంచి తన వామపాణిచే నావిషంబునాకర్షించి భక్షింప నదికంఠగతమగుచుండ దేవదానవులతనింగని ఇందుధరా! యీవిషమును మీ శరీరకాంతికి యొక భూషణంబుగనుండుటచే దానినందే నిలుపుడన నతండట్లొనర్చి తననిలయంబునకరిగె - (అందువలన నీలకంఠుడనిబఱంగె) పిదప దేవాసురులు మఱల పాలకడలిని మథింపదొడంగినందుండి ఆయుర్వేదకర్తయగు ధన్వంతరి అమృతకలశ హస్తుడై యుద్భవించె - పిదప లక్ష్మ్యాదులుద్భవించిన అందు లక్ష్మిని కౌస్తు

భమును విష్ణువు, ఐరావతమును కుండలములను నింద్రుడు, ఉచ్చైశ్శ్రవంబును సూర్యుడు, ఛత్రంబునువరుణుడు, పారిజాతమును వాయువు, నిటుల దేవతలుత్తమమగు పదార్థంబుల గ్రహించిరి - అంతధన్వంతరి యమృత కలశహస్తుడై దేవాసురమధ్యంబున నిలువ అమృతముమనది అమృతముమనదియని యొండొరులకు కలహంబువాటిల్లిన నసురులమృత కలశమును గ్రహించిరి - అంతవిష్ణువు జగన్మోహనాకారంబగు స్త్రీరూపంబుదాల్చి రక్కసులప్రక్క నిలువ వారాకామినీ సుందరాకారంబునకు భావజుబాణంబులం జిక్కి మోహపరవశులై యమృతకలశమా రమణికొసంగి నిశ్చేష్టితులుగ నుండుటయగాక నానీలవేణిని నితరులుగ్రహింపకుండునటుల నసురులు నానావిధాయుధంబులచే దేవతలందరిమిరి - అంత నారీమణి రూపధారియగు నారాయణుడమృతకలశంబును దేవతలకొసంగిన వారుదానింగ్రోలుచుండుతఱి రాహువుదేవరూప ధారియై నాకవాసులతోడంగూడి యమృతపానము జేయుచుండె - అంతతార్క్ష్యవాహనుడు సూర్యచంద్రులచే దేవరూపధారియగు రాహువసురుడని నెఱింగి తనచక్రంబుచే వానిశిరంబునుద్రుంచిన వాడుసూర్యచంద్రులను బాధింపుచుండు. పిదపశ్రీపతిస్త్రీరూపమును వదలి నిజాకారముజెంది ప్రాసపట్టసాద్యనేకాయుధంబులచే దైత్యదానవులం బ్రహరించినవారు రక్తంబులంగ్రక్కుచు భూమింద్రెళ్ళిరి-హతశేషులు సక్రోధులై హుంకార భయంకరాట్టహాసంబులెసంగ కోలాహల శబ్దంబులం గావింపుచు దేవతలతో బోరుచుండ నాసంగరతలంబునకు నరనారాయణులేతెంచిరి - అంత నారాయణుడు తనసుదర్శనచక్రంబును స్మరింప నదికోటిసూర్య ప్రకాశమానంబుగను, శత్రుభయంకరంబుగను, నగ్నింబోలి జ్వలింపుచు నేతెంచిన విష్ణువుదాని నసురుల పైప్రయోగింపనందుచే ననేకులు మడిసిరి - తక్కు రక్కసులుక్కు చెడి తల్లడిల్లుచు లవణసాగరంబునంజొచ్చిరి - పిదప దేవతలుమందరమును స్వస్థానంబుననునిచి నమృతరక్షకునిగ దేవపతిని నియమింజేసి తమతమ నెలవుల కుంజనిరి.

వాస్తుశాస్త్రము - సం - అ - ౨౫౦ - మొ - ౨౫౫ - వ.

ప్రాసాదాదిగృహ ని… క్రమంబును, వాస్తు విధానంబును, వాస్తుపురుషస్వరూపంబును, వివరింపుమ మునులువేడ సూతుండిట్లనియె. ఓతాపసోత్తములారా! భృగ్వత్రిమొదలగు పదునెనమండ్రుగురు మహాత్ములచే విస్తరింపంబడియుండుసీ వాస్తుశాస్త్రమును మనువుకు మత్స్యమూర్తిచెప్పిన యాద్పున నుడివెదవినుడు-తొల్లి నిటిలాక్షుడు యంధకాసురుని వధింపక్రోధమానసుండగుటచే నతని నిటిలంబునుండి స్వేదబిందువుభూమింబడియె - అంతనా స్వేదబిందువునుండి భయంకరమగు నొకభూతము వెడలియంధకుల రక్తంబునెల్లం ద్రావియుతృప్తి నొందక ముక్కంటింగూర్చి

తపంబుసలిపి తద్బాధచే ముల్లోకంబులనెల్ల భక్షింపగమకింపుచుండ విరూపా
క్షుండు నాభూతంబుంగాంచి నీకువలయు వరంబువేడుమన నదినాకిమ్ముల్లో
కంబుల భక్షింపందగిన గొప్పతనమునివ్వుమననతండట్లొసంగె - అంతనా భూతము
బ్రహ్మాండాకారియై ముల్లోకంబుల నావరింప బ్రహ్మాదిదేవతలు, సర్వలోకవాసులు,
భీతింజెంది నాభూతంబావరించిన స్థలంబుననే దానినణచినదియగాక మఱలనది వె
డలకుండయందే వసింపిరి (అందుచే వాస్తుపనంబడిరె.) పిదప నాభూతంబధోముఖము
గలదై నేనిట్లనేయుండెద నాకాహారంబొసంగుడని బ్రహ్మాదిదేవతలం బ్రార్థింపవా
రిట్లనిరి - ఓభూతమా ! వైశ్వదేవాంతంబున నివ్వంబడు బలియును, అజ్ఞానం
బుచేజేయునర్చ్య యజ్ఞహవిర్భాగంబులును, యజ్ఞోత్సవాదులయందివ్వంబడు బలి
యును, నిన్నుపూజింపక గృహారంభముజేసెడి యజమానుడును నీకాహారంబగుననిరి.
నవాస్తువుసంతసిల్లె- అదిమొదలుగా నెల్లెడలవాస్తుశాంతివాటిల్లె.

మానులారా ! గృహ నిర్మాణక్రమంబు వచించెదవినుడు - చైత్ర మాసంబున
గృహనిర్మాణంబొనర్చుట కారంభించిన వ్యాధియు, వైశాఖంబున ధనరత్న ప్రా
ప్తియు, జ్యేష్ఠంబున మృత్యువు, ఆషాఢంబున భృత్యరత్నపశుప్రాప్తియు, శ్రావణం
బున భృత్యలాభంబు, భాద్రపదంబున హానియు, ఆశ్వయుజంబున భార్యానాశం
బు, కార్తికంబున ధనధాన్యలాభంబు, పుష్యంబున చోరభయంబు, మా
ఘంబున ధనాద్యాగమంబు, ఫాల్గుణంబున సువర్ణ పుత్రలాభంబులునుగలుగు-
అశ్విని, రోహిణి, మూల, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మృగశీర్ష, స్వాతి,
హస్త, అనూరాధ, ఈనక్షత్రంబులయందును, ఆది, మంగళ,వారంబులందప్ప తక్కి
నవారంబులయందును, విష్కంభ, గండ, పరిఘ, వజ్ర ములయందును, శ్వేత,
మైత్ర, మాహేంద్ర, గాంధర్వ, అభిజిద్రౌహిణ. రాజస, ఈముహూర్తముల
యందును, సూర్యచంద్రగ్రహబలంబులయందును, శుభలగ్నంబులయందును, గృహ
నిర్మాణప్రారంభము, స్తంభోచ్ఛ్రాయము, ప్రాసాద, వాపీ,కూపంబులొనర్పందగు-
మఱియు భూపరీక్ష జేయవలయు, ఎట్టులనిన; భూమి, బ్రాహ్మణాదివర్ణ చతు
ష్టయంబునకు క్రమముగా, శ్వేత, రక్త, పీత, కృష్ణవర్ణంబులుగను, నందలి మృ
త్తిక - మధుర, కషాయ, కటుకంబులుగను నుండవలయు - వెండియు నాభూమి
యందు మూరెడుచదరముగను లోతుగను త్రవ్వినొక పచ్చిమూకుడుయందు ఘృ
తంబునుంచి నాలుగువర్తులువేసి దీపమువెలిగించి ప్రజ్వలింపంజేసిన నది ప్రాగాది
దిక్కులయందు క్రమముగాజ్వలించినను, లేక, సర్వత్రజ్వలించినను బ్రాహ్మణాదు
లకు శుభకరంబగు. మఱియు నాభూమియందే పైజెప్పిన ప్రమాణముగ త్రవ్వినందలి
మృత్తికనుబైటవెడలంజేసి మఱల నాపల్లమును పూరించిన మృత్తికయధికమైన
సుఖముగలుగు - తక్కువైనహానిగలుగు. లేక నావాస్తుభూమిని మన్నినవధాన్యం

ములందు వి త్తినవవి, ౩, ౫, ౭, దినములలో మొలిచిన శుభము, లేకున్న నశుభము ఇటుల భూమిని పరీక్షించి పిదప గోమయంబుచేనలికి స్వర్ణశలాకు చేనందేకాశీతిప దస్థానంబులమర్చి దానిపై తండులపిష్టంబును జల్లి ఈశానాదికోణస్థానములయందు శిఖాది దేవతల పురాణోక్తప్రకారము బూజించి గృహనిర్మాణంబు జేయవలయు. మఱియు, చతుశ్శాలనిర్మాణక్రమము- నలుప్రక్కల ద్వార బంధనంబులనునిచి నిర్మింపంబడిన గృహోదులు చతుశ్శాలలనియు సర్వతోభద్రంబులనియు బఱంగు. ఇందు పశ్చిమద్వారంబు లేకున్న నంద్యావర్తమనియు, దక్షిణద్వారరహితంబైన వర్ధమానంబనియు, పూర్వద్వారవిహీనంబైన స్వస్తికంబనియు, ఉత్తరద్వారము లేదేని రుచకంబనియు జెప్పంబడు - ఓమునులారా ! ఇక రాజభవన నిర్మాణక్రమంబు వచించెద నాకర్ణింపుడు - ఆభవనంబైదువిధంబులు గనుండు అందు మొదటిది - నిడుపు (౧౩౫) మూరలు, వెడల్పు (౧౦౮) మూరలుగలిగి యుండిన నుత్తమము - నిడుపు (౧౨౫) మూరలు, వెడల్పు (౧౦౦) మూరలు, గలిగియుండినమధ్యమము - నిడుపు (౧౧౫) మూరలు, వెడల్పు (౯౨) మూరలుగలిగియుండిన నధమము- నిడుపు (౧౦౩) మూరలు - వెడల్పు (౮౪) మూరలు గలిగియుండిన నధమాధమము నిడుపు (౯౫) మూరలు వెడల్పు (౭౬) మూరలు గలిగియుండినహీనము, యువరాజగృహంబైదువిధములు. నిడుపు మూరలు (౧౦౬) అంగుళములు (౧౬) వెడల్పు మూరలు (౮౦) గలిగియుండిన నుత్తమము. తక్కిన నాలుగువిధ గృహములకు వెడల్పులో క్రమముగా నాలేసిమూరలు తగ్గించి నాయా మొత్తములో మూడవభాగమును నిడుపులో హెచ్చింపుచువచ్చిన మధ్యమాధమాధమహీనములగు గృహ[illegible]ము లేర్పడును. సేనాపతిగృహంబైదువిధములు - నిడుపు మూరలు (౭౪) అంగుళములు (౧౬) వెడల్పు మూరలు (౬౪) గలిగియుండిన నుత్తమము తక్కిన నాలుగువిధగృహములకు వెడల్పులో క్రమముగా నాలేసిమూరలు తగ్గించి నాయా మొత్తములో నారింట నొకభాగము నిడుపులో హెచ్చింపుచువచ్చిన మధ్యమాదిగృహప్రమాణము లేర్పడును. (మంత్రిసామంత మాత్యశిల్పి కంచుకి వేశ్యాదైవజ్ఞ గురుభిషక్సభాసద[illegible]త బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రాది గృహనిర్మాణక్రమంబులుపురాణోక్తప్రకా[illegible]నర్పవలయు.) ఓమునివర్యులారా ! ఇటుల వాస్తువిధాన క్రమమునని[illegible]లతో గృహముని ర్మింపవలయు-మఱియు స్తంభమానంబుల బేరొకొనియెద వినుడు- స్తంభంబులు (౪) పట్టెలుతీర్చిన రుచకంబనియు, (౮) పట్టెలుతీర్చిన వజ్రంబనియు,(౧౬)పట్టెలుగాపించిన ద్వివజ్రంబనియు, (౩౨)పట్టెలుండిన ప్రలీనకంబనియు, వృత్తంబుగనుండిన వృత్తంబనియు జెప్పంబడు- ఈయైదువిధంబులగు స్తంభంబులనుపద్మ వల్లీలతాది చిత్రంబులుగలవిగ నిర్మించి సర్వవాస్తువుల యందుంచందగు- ఆ స్తంభత్రిభాగంబుచేనైనను, చతుర్భాగంబుచేనైనను, బోదెపీటలం జేయవలయు.

తూర్పునన్ ఇంద్ర జయంతస్థానములయందును, దక్షిణంబున యామ్యవితథంబులయందును, పశ్చిమంబున, పుష్పదంతవారుణములయందును, ఉత్తరబున భల్లాట సౌమ్యస్థానంబులయందును ద్వారబంధనం బొనర్పవలయు - ఇక ద్వారవేధలను తత్ఫలంబులను దెలిపెదవినుడు- రాజమార్గ నిరోధంబైన కులక్షయంబును- బురద,పల్లము, నిరోధంబైన శోకము - కూపనిరోధంబైన నపస్మారరోగము, స్తంభంబుండిన నగ్నిభయము, దేవాలయంబుండిన గృహవినాశంబు, గృహంబునకు గృహ నిరోధంబైన గృహస్వామికి మరణంబునుగలుగుగాన నివి మొదలగు వేధలవర్జించి ద్వారబంధంబుగావించి ప్రత్యహము దానిబూజింపవలయు. ఇట్టి వేధలు తనయింటి పొడవునకు ద్విగుణప్రమాణంబుగల దూరంబుననుండిన దోషంబుజేకూరదు - గృహపూర్వాది దిక్కులయందు, పున్నాగాశోకవకుళ శమీ తిలక చంపక దాడిమాది వృక్షంబులనుంచవలయు. ఓ ఋషులారా! శిల్పి, ఉత్తరదిశయందైన, తూర్పుదిశయందైన భూమిని నిమ్నంబుగావించి స్తంభశిఖరాదుల సమముగనుంచి స్తంభోచ్ఛ్రాయము సేయవలయు- దేవాలయము, ధూర్తుడు, మంత్రి, సచివుడు, వీరి గృహసమీపంబున నిలయమునిర్మించిన దుఃఖశోకభయంబులుగలుగు. కావున నటులపరీక్షించి గృహము నిర్మింపవలయు. ఇట్లు స్తంభోచ్ఛ్రాయము సేయుటకును, గృహంబునిర్మించుటకును నుపయుక్తంబైన దార్వాహరణక్రమంబుదెలిపెదవినుడు. ధనిష్ఠాపంచకాదినిషిద్ధ నక్షత్రంబులన్వదలి శుభనక్షత్రయుక్త శుభలగ్నంబున వనంబునకు వెడలి శ్మశానంబునందలి వృక్షంబులను, పిడుగులు, అగ్ని, వాయువు, ఇవి మొదలగువానిచే బీడింపబడిన వృక్షంబులను, క్షీరకంటకాది వృక్షంబులనువర్జించి దారుసంగ్రహింపంబోయెడివృక్షంబులకు బలిపూజాదులొనరించి శాస్త్రవిహిత. అశోక, మధూక, చందన, పనస, హరిద్రకాది వృక్షంబుల గ్రహింపవలయు. ఇట్టివృక్షంబులను ఛేదించునెడ నవియీశాన్యభాగంబునంబడిన శుభము, దక్షిణదిశయందు బడిన నశుభము, మఱియువాటి మధ్యంబున పీతవర్ణంబుగనుండిన గోధికయు, మాంజిష్ఠవర్ణంబుగనుండిన కప్పయు, నీలంబుగనుండిన సర్పము, రక్తంబుగనుండిన తొండయు, శ్వేతంబుగనుండిన చిలుకయు, కపిలవర్ణంబుగనుండిన నెలుకయు, ఖడ్గకాంతిగనుండిన జలంబునుండునుగాన నిట్టివర్ణంబులు గర్భంబునంగల వృక్షంబులవర్జించి పురాణోక్తవృక్షంబుల సంగ్రహించి గన్ధాక్షతాదులచే పూజించి పుష్పంబులచే నలంకరించి కలశంబును ముందిడుకొని బ్రాహ్మణులతోడ స్వస్తివాచన పూర్వకంబుగ దారువులను గృహంబునకు గొనివచ్చి వాస్తుపూజాదులొనర్చి బ్రాహ్మణసంతర్పణగావించి శుభలగ్న ముహూర్తంబున స్తంభోచ్ఛ్రాయము సేయవలయు. అట్లు సేయునెడలయందు నవరత్నంబులుంచి నందుపై పాషాణంబులనునిడి వస్త్రాలంకారాదులచే నలువురు బ్రాహ్మణులతోడ పూజా

ణోక్తప్రకారము నా స్తంభంబును బూజించి ద్విజులతోడశిల్పి శుభాశుభశ కునంబులంజూచి స్తంభోచ్ఛ్రాయము సేయవలయు.ఇటులద్వారబంధనంబును నె నర్పందగు. స్తంభోచ్ఛ్రాయాదికాలంబున నీశానదిశయందు వాయసముమధు రశబ్దంబులంగావించిన నచటధనంబుండు - సూత్రంబుపట్టునెడ నది ఛిన్నంబైన యజమానునకి మృత్యువొకలుగు. బోదెపీటలుక్రిందబడిన యజమానునకి శిరోరోగ ముస్థిరముగనుండుననియు నెఱుంగవలయు. మఱియు నితర స్తంభంబుల దిక్కు్మ్ఖం బులుగాకుండునటుల ప్రదక్షిణంబుగ నిడవలయు- పిదప గృహంబును నెల్ల దిక్కు్ల యందు సమముగ వృద్ధిజేయవలయు. అట్లుగావింపక నొక్కొక దిక్కు్యందు వృ ద్ధింజేసిన నశుభమ్ముగలుగు. నీశానంబున దేవపూజాగృహము- ఆగ్నేయంబున పా కశాలయు, దానియుత్తరంబున జలస్థానంబు,నిర్భతిదిక్కు్న సంభారగృహము, వా యవ్యంబునధనధాన్యాగారము, గృహమునకుబైట కర్మశాల పథస్థానము స్నాన ముజేసెడి స్థలము నిర్మించి పురాణోక్తప్రకారము వాస్తుపూజ, బలి హోమము బ్రాహ్మణసంతర్పణగావించి యాగృహంబుననివసించిన గృహపతిక్షేమంబుజెంది సుఖంబుగనుండు.

దేవప్రతిమాలక్షణములు-సం-అ-౨౫౬-మొ-౨౬౮-వ.

శౌనకాదులుసూతుంగాంచి పుణ్యపురుషా ! జ్ఞానయోగంబుకన్న సహస్ర గుణంబులధికంబగు కర్మయోగంబు జెప్పుడనివేడ నతండు వారింగని ఋషిశ్రే ష్ఠులారా ! దేవతాప్రతిష్ఠ, దేవతార్చానుకీర్తనము, దేవయజ్ఞము, దేవోత్సవము, ఈరూపంబులుగ నుండెడి క్రియాయోగంబునందు ప్రథమంబున విష్ణు ప్రతిమాలక్ష ణము జెప్పెదవినుడు- అప్ప్రతిమ శంఖచక్రగదాపద్మధారిగనుండు హస్తంబులును, ఛత్త్రాకారంబునుంబోలిన శిరమును, శంఖమువంటి కంఠమును, పద్మదళాయతా క్షులును, తుంగనాసికమును, శుక్తికర్ణములును, ప్రశాంతోరుభుజంబులును గలదిగ నిర్మింపవలయు (౨) మఱియునీశ్వర ప్రతిమాలక్షణంబును నుడివెదవినుడు - బలి సినతొడలు, భుజంబులు, స్కంధంబులు, చంద్రరేఖగల యూర్ధ్వ జటలు తప్త కాంచనచ్ఛాయ పదియా[illegible]యస్సుగలవర్చస్సు మకుటవ్యాఘ్రచర్మహా రకేయూర భుజగాభరణా[illegible]కారంబు వామహస్తంబున కపాల ఖట్వాంగము దక్షిణంబున ఖడ్గ త్రిశూలంబులు వామభాగంబున పార్వతి ఇట్టి చిహ్నములతో నీశ్వరప్రతిమ యొనర్పవలయు - మఱియు నృత్యేశ్వర త్రిపుర సంహారేశ్వ ర దక్షిణామూర్తి భైరవ శంకర అర్ధనారీశ్వర ఉమామహేశ్వర శివనారా యణ మహావరాహ నారసింహ త్రివిక్రమ బ్రహ్మ కార్తికేయ వినాయక కాత్యా యనీ ఇంద్ర సూర్య వహ్ని యమ నిర్భతి వరుణ వాయు కుబేరీశాన సప్తమాతృ

శ లక్ష్మీ యక్షిణీ క్షేత్రపాలక మన్మథప్రతిమాదులను, పిండికలను, శివలింగము లను, వీటి మానోన్మానంబుల నెఱింగి పురాణోక్త లక్షణంబులుగలవిగ నిర్మిం పవలయు, అధికావయవములు గలవిగాగాని, విహీనాంగములు గలవిగాని నొవ ర్పంజనము- అజ్ఞానర్పిన శిల్పినిమృత్యువాలుగావించు. స్థూలంబుగను కరాళవదన ము గలవిగను నిర్మించిన యజమానుని జంపును, కృశంబుగనుండిన నర్థనాశంబును, నాసిక కుటిలంబై హీనవక్త్రంబుగ నుండిన దుఃఖంబును, సంక్షిప్తాంగంబులు గనుండిన భీతిని, కృశోదరము గలవిగనుండిన దుర్భిక్షంబును, హీనవక్షస్థల మైన పుత్రమిత్రనాశంబును, మాంసహీనంబుగనుండిన ధననాశంబును, గలు గజేయు, శుష్కవక్త్రమైన రాజునువధించు - కావునశిల్పి మానోన్మాన ప్రమాణంబు లెఱింగిప్రతిమల నిర్మింపవలయు - పిదప వాస్తుపూజబలియజ్ఞాదులను గావించి కుండ మండపంబుల విధిప్రకారముజేసి చైత్రఫాల్గునాది శుభమాసంబు లయందును పంచమ్యాది తిథులయందును శుభముహూర్త లగ్నంబులయందును ప్రతిష్ఠను, నేత్రోన్మీలనంబును, అధివాసనదేవస్నపన ధూపదీపాదిపూజలను పురా ణోక్తప్రకారముగావించి గోవస్త్రకాంచన హిరణ్య ధరాదానంబులంజేసిన మా నవు లిహలోకంబున లక్ష్మీకరులై సుఖంబుగనుండి అంత్యంబున స్వర్గంబునంజేరి దేవతలచే పూజింపబడియెదరు.

భవిష్యద్రాజానుకీర్తనము-సం- అ- ౨౭౮-మొ-౨౭౧-వ.

ఋషులు సూతుంగని సూర్యచంద్ర వంశాంతంబున రాగలరాజులెవ్వ రు? వారి నామంబులంజెప్పుమనిన నతండిట్లనియె- ఓఋషులారా ! కలియుగమంద ు యిక్ష్వాకువంశంబున బృహద్బలుడు, అతనికిడురుక్షయుడు, వానికివత్సవ్యూహుడు, వీనికి దివాకరుడు నిటులక్రమక్రమంబుగ(౨౭)జనించెదరు- పిదపసుమిత్రునితో నిక్ష్వా కు వంశంబుసమాప్తింజెందు - తదనంతరము మగధదేశస్థులు, జరాసంధునివంశజు లగు సహదేవాదులు రాజ్యముపాలించెదరు - పిదపహైహయులు, (౨౮) కళింగ దేశస్థులు, (౨౨) అశ్మకులు,(౨౫) కురువులు (౨౬) మైథిలులు (౨౮) శూరసేనలు (౨౩) వీతిహోత్రులు (౨౦) ఇటులవీరివంశస్థులుకలియుగంబున జనించి రాజ్యపా లనంబుగావింపం బోయెదరు-వీరివంశాంతంబునకలిపురుషాంశ సంజాతుండగు మహా నందియనువాడు సర్వక్షత్రాంతకుడైశూద్ర యోనియందుజనించి రాజ్యంబేలు-అది మొదలెల్లెడల శూద్రులు రాజ్యపరిపాలనంబొనర్తురు- పిదప [illegible]లు, యవ నులు, కిలకిలులు, బర్బరులు, కిరాతకులు, వీరివంశస్థులు పృథ్వినేలుటచే ప్రజలుదుః ఖంబులంజెంది నశించెదరు - మఱియువర్ణాశ్రమధర్మంబులుచెడి పాషండులు,మిగు లవృద్ధిజెందెదరు - శూద్రులుమంత్రాధికారంబులనుబొంది బ్రాహ్మణుల కుపదేశిం చెదరు- లోకులెల్లను లనావృష్టిబాధలచే పీడితులై సస్యహీనము వర్షించక [illegible]పుదు

బొనర్చి పురాణోక్త ప్రకారము స్తోత్రపుష్పాంజలాదులం జేసి ఖడ్గంబు చేబూని తులారోహణము సేయవలయు. అందొక ప్రక్క యజమానుండు కూర్చుండి రెండవ ప్రక్క సువర్ణమునుంచి సమముగా తూగి తులంబందుండి దానివదలి యందలి ద్రవ్యంబర్ధము నాచార్యునకిని శేషంబును ఋత్విక్కులకు నిచ్చుటయగాక గ్రామాదు లొసంగవలయు. పిదప వారియనుజ్ఞచే దక్కువారలకు భూరిదానంబు లివ్వవలయు. ఓముని పుంగవులారా! యిటులొనర్చిన మానవుం డిహలోకంబున నాయువును కీర్తిని జెంది యంత్యంబున విమానారూఢుండై కిన్నరాంగనలచే బొగడంబడుచు విష్ణుపదంబు జెందు. మఱియు షోడశమహాదానంబులకు ఋత్విక్కుండపాదులు తులాపురుషదానంబువలె గావింపవలయు.

(౨) హిరణ్యగర్భదానము—స్వర్ణంబుచే డెబ్బదిరెండంగుళముల పొడవును దాని మూడవాంశము వెడల్పును గలిగి కమలంబుం బోలిన యొక కుంభంబొనర్చి ఆజ్యదధితో పూరించి వేదికయందలి ద్రోణపరిమిత తిలలయందు దాని నునిచి కల్పోక్త ప్రకారము పూజా ప్రదక్షిణాదులగావించి యజమానుడా హిరణ్యకలశ గర్భంబున నొకయుచ్ఛ్వాసకాలంబుండవలయు. పిదప నాచార్యుడు నాహిరణ్యగర్భునికి గర్భాధానపుంసవన సీమంతజాతకర్మాదిక్రియ లొనర్పవలయు. అనంతరము యజమానుండందుండి వెడలి నాకలశంబును, గ్రామాదులతోడ దానంబు సేయవలయు. అట్లొసంగిన నరుడు కల్పకోటిశతము బ్రహ్మలోకంబున వసింపుచు తనపితృపితామహాదులను నరకంబునుండి తరింపంజేయు.

(౩) బ్రహ్మాండదానము—౨౦ పలములు మొదలు ౧౦౦౦ పలములవరకు శక్తికొలది శతాంగుళాయామము, రెండుకలశంబులు, దిగ్గజాష్టకములు, అష్టదిక్పాలకులు గల యొక బ్రహ్మాండమును గావించి నందు బ్రహ్మవిష్ణు మహేశ్వర ప్రతిమలనుంచి పట్టువస్త్రములచే నలంకరించి నాబ్రహ్మాండమును ద్రోణపరిమిత తిలలపైనునిచి పురాణోక్తప్రకారము పూజానమస్కారాదులం గావించి దానంబొసంగిన మానవుడు, సకలపాపంబుల విడనాడి కోటిసూర్యప్రకాశముగల విమానంబు నెక్కి అప్సరస్సులచే బొగడంబడుచు మురారిపదంబు జేందు.

(౪) కల్పపాదపదానము—౩ పలములు మొదలు ౧౦౦౦ పలములవరకు శక్తికొలది స్వర్ణంబుచే బ్రహ్మవిష్ణు శివప్రతిమలతో నైదుశాఖలు నానావిధ పక్షులు ఫలములు వీటితోగూడిన కల్పవృక్షంబొనర్పవలయు. పూర్వదిశయందు సకళత్రకామదేవ యుక్తంబగు సంతానవృక్షంబును, దక్షిణంబున లక్ష్మీసహిత మందారంబును, పశ్చిమమున సావిత్రీయుక్త పారిజాతంబును, ఉత్తరమున సురభితో గూడిన హరిచందన వృక్షంబును, నిర్మించి పురాణోక్తప్రకారము హోమాదులు, పూ

జాప్రదక్షిణ నమస్కారంబులనుగావించి దానంబొసంగిన మనుజుడు సిద్ధచారణ కిన్నరాప్సరస్సులచే సేవింపబడుచు సర్వవర్ణవిమానంబెక్కి విష్ణులోకంబు జేరియ చట నూలుకల్పంబులువసించు.

(౫) గోసహస్రదానము—౩-పలములు మొదలు ౧౦౦౦ - పలములవర కుశక్త్యను సారముస్వర్ణంబుచే బదిగోవుల నిర్మించివాటిమధ్యంబున నొకస్వర్ణ నిర్మితవృషభంబునునిచి-పిదప(౧౦౦౦)నిజగోవులను స్వర్ణరజితాదులచే నలంకరిం చికల్పోక్తప్రకారము పూజాదానాదులం జేసినమనుజుడు,సర్వపాపవిముక్తుడై కింకి ణీజాలమాలలతోఁగూడిన విమానంబెక్కి సిద్ధచారణులచే సేవింపబడుచు నీలకంఠు నినిలయంబున నివసించుటయగాకతన (౧౦౧) గోత్రజులను తరింపంజేయు.

(౬) కనకకామధేనుదానము— శక్తినతిక్రమింపక ౧౦౦౦ -౫౦౦ - లేక ౨౫౦ - సంఖ్యగలపలంబుల స్వర్ణంబుచే వత్ససహితగోవును నిర్మించివస్త్రాభర ణాదులచే నలంకరించి పురాణోక్తప్రకారము పూజాదానాదుల గావించినమాన వుడు, పురందరాదిదేవతలచే సేవింపంబడుచు నిందుమౌళిపదంబున నివసించు.

(౭) హిరణ్యాశ్వదానము—౩- పలములు మొదలు ౧౦౦౦ - పలములవర కు శక్తికొలది హిరణ్యంబుచేనశ్వంబు నొనర్చినానావిధోపకరణ సహితమగునె కశయ్యను, ఎనిమిదిస్వర్ణకలశంబులను, వేదికయందు స్థాపించి కల్పోక్తప్రకారము పూజాదానాదులంజేసినమనుజుడు, దేవసంఘంబులచే బూజింపబడుచు నిందిరా ధీశునిపదంబుజెందు.

(౮) హిరణ్యాశ్వరథదానము—౩-పలములుమొదలు ౧౦౦౦ - పలముల వరకుశక్త్యనుసారము స్వర్ణంబుచే నొకరథంబుగావించినందు బంగరుచే నొకది వ్యమగుస్వాభీష్టదేవతాప్రతిమనునిచి దానికి-౮-లేక,౪-కనకాశ్వంబులంగట్టి వస్త్రా దులచే నలంకరించిశయ్యాది సహితముగ పురాణోక్తప్రకారము పూజాదానాదుల జేసిననరుడు, సకలపాప విముక్తుడై ప్రచండమార్తాండ ప్రకాశమానమగు శరీర కాంతిగలవాడై పినాకపాణి పదంబుజెందు.

(౯) హేమహస్తిరథదానము—౫ - పలములుమొదలొక భారువవరకు శక్తికొలది బంగరుచేనొక పుష్పరథంబును గావించి - ౪ - కనకగజములను రెం డుసజీవగజములనుగట్టి నారథమధ్యంబున లక్ష్మీనారాయణులను నిరుప్రక్కల బ్ర హ్మామహేశ్వరాదిదేవ ప్రతిమలనుంచి కల్పోక్తప్రకారము పూజాదానాదులంజేసి నమనుజుడు, సకలపాపరహితుడై విద్యాధరులచే బొగడంబడుచు పరమేశ్వరుని పట్టణంబునవసించు.

(౧౦) పంచలాంగలకదానము—సారముగల ౧౦౦ గ్రామములు లేక శక్తి కొలది గ్రామంబును దారువులతోజేయబడిన నైదులాంగలములను, స్వర్ణశృంగాదులచే నలంకరింపబడిన పదివృషభములను, ఐదుపలములు మొదలు వేయుపలముల వరకు శక్తికొలది ఐదు హేమహలంబులను, వత్ససహిత గోవును, వీటిని పురాణోక్తప్రకారము దానంబొసంగిన మానవుడు దివ్యవిమానారూఢుడై శంభుపురంబున నివసించు.

(౧౧) ధరాదానము—౧౦౦ పలములు మొదలు ౧౦౦౦ పలములవరకు శక్త్యనుసారము హిరణ్యముచే జంబూద్వీపంబుంవలె నానావిధానేక పర్వతసాగర నగరగ్రామంబులు భారతాదినవవర్షంబులతోగూడిన భూమిని నిర్మించి దానిచుట్టు సముద్రమునుగావించి - పురాణోక్తప్రకారము దానంబొసంగిన నరుడు, తననేక వంశలిగోత్రజుల తరింపంజేసి మూడుకల్పంబులు నారాయణ నగరంబుననివసించు.

(౧౨) విశ్వచక్రదానము—శక్తినతిక్రమింపక ౧౦౦౦-౫౦౦-లేక ౨౫౦-పలములకనకముచే బదియారు అరములుగల విశ్వచక్రమును నేడావరణములుగలదిగ గావించి దానిమధ్యంబున శంఖచక్రాది ధరుడును దేవ్యష్టకసమన్వితుడునునగు విష్ణుప్రతిమను, ప్రథమాద్యావరణములయందు దశావతారాది ప్రతిమలను నిర్మించి పురాణోక్త ప్రకారము పూజాదానాదులను జేసినమనుజుడు, హరిపదంబుజెందు.

(౧౩) కనకకల్పలతికాదానము—౫-పలములు మొదలు ౧౦౦౦-పలముల వరకు శక్తికొలది స్వర్ణంబుచే హంసకారండవాది పక్షులు, విద్యాధరప్రతిమలు వీటితోగూడిన పదికల్పలతలంజేసి కల్పోక్తవిధిప్రకారము పూజాదానాదులంజేసిన నరుడు, సత్యలోకంబున వసించు.

(౧౪) సప్తసాగరదానము—౫-పలములు మొదలు ౧౦౦౦పలములవరకు శక్తికొలది బంగరుచే జానెడు-లేక, మూరెడు ప్రమాణముగల నేడుకుంభంబులను నిర్మించి ప్రథమసాగర కుంభమును లవణముచేబూరించి యందు సరస్వతీయుక్త పరమేష్ఠిని, ద్వితీయసాగరకుంభమును క్షీరముచేబూరించి యందు విష్ణువును, తృతీయసాగరకుంభమును ఘృతముచే నిండించియందు శివుని, చతుర్థసాగరకుంభమును గుడముచేబూరించి యందు సూర్యుని, పంచమసాగర కుంభమును దధిచే బూరించియందు చంద్రుని, షష్ఠసాగరకుంభమును శర్కరచేబూరించి యందు లక్ష్మిని, సప్తమ సాగర కుంభమును శుద్ధోదకముచే బూరించి యందు పార్వతిని, నిటుల ప్రతిమలనునిచి పురాణోక్తప్రకారము పూజాదానాదులంగావించిన మానవుడు,

దివ్యకాంతిగల విమానంబునెక్కి ముల్లోకంబుల సంచరింపుచుండుటయగాక విష్ణు పదంబును జెందు.

(౧౫) రత్నధేనుదానము—వజ్రవిద్రుమహావైడూర్య గోమేధిక పుష్యరాగము రకత మాణిక్యాదులచేతను, శర్కరగుడాదిద్రవ్యములచేతను, పురాణోక్త ప్రకారము రత్నధేనువునొనర్చి పూజాదానాదుల గావించినమనుజుడు, దేదీప్యమానంబగు విమానంబునెక్కి మదనసమానకాంతిగలవాడై వైకుంఠనిలయంబున నివసించు.

(౧౬) మహాభూతఘటదానము—౧౦౦ - అంగుళములపొడవుగలిగి నానావిధమణిగణఖచితకుంభంబును క్షీరాజ్యంబులతో పూరించియందొక స్వర్ణకల్పవృక్షంబునునిడి బ్రహ్మ విష్ణ్వాదిదేవతలతోడ పురాణోక్తప్రకారము పూజాదానాదులం జేసిననరుడు, కోటిసూర్యప్రకాశమానంబగు విమానంబెక్కి వరస్త్రీలచే బొగడంబడుచు విష్ణుపదంబు జెందు. కావున ఋషిశ్రేష్ఠులారా! ఈషోడశమహాదానంబులం జేసిన మానవులు పునర్జన్మంబు జెందక సదా స్వర్గంబున నివసింపుచుండెదరు.

కల్పనామానుకీర్తనము - స. - అ - ౨౮౮.

మార్తాండనందనుండు మత్స్యంగాంచి కల్పనామంబులం జెప్పుమన నతండిట్లనియె. శ్వేతకల్పము, ౧ - నీలలోహితము, ౨ - వామదేవము, ౩ - రాథంతరము, ౪ - రౌరవము, ౫ - దేవకల్పము, ౬ - బృహత్కల్పము, ౭ - కందర్పము, ౮ - సద్యము, ౯ - ఈశానము, ౧౦ - తమము, ౧౧ - సారస్వతము, ౧౨ - ఉదానము, ౧౩ - గారుడము, ౧౪ - కౌర్మము, ౧౫ - నారసింహము, ౧౬ - సమానము, ౧౭ - ఆగ్నేయము, ౧౮ - సోమము, ౧౯ - మానవము, ౨౦ - పుమము, ౨౧ - వైకుంఠము, ౨౨ - లక్ష్మీకల్పము, ౨౩ - సావిత్రీకల్పము, ౨౪ - ఘోరము, ౨౫ - వారాహము, ౨౬ - వైరాజము, ౨౭ - గౌరీకల్పము, ౨౮ - మాహేశ్వరము, ౨౯ - పితృకల్పము, ౩౦ - ఇట్లు యీముప్పదికల్పంబులయ్యేనేని బ్రహ్మకొకమాసంబగు. ఇట్టిమాసంబులుపండ్రెండయ్యేనేని బ్రహ్మకొకవత్సరంబగు. ఇట్టివత్సరంబులు - ౧౦౦ - అయ్యేనేని శివునకొకదినమగు - ఇట్టిదినములుగల శివవర్షంబులు (౧౦౦) అయ్యేనేని విష్ణువుకొకనిమిషంబగు. అతండు జాగ్రదవస్థయందుండునపుడు జగత్తు చేష్టలుగలిగియుండు. విష్ణువు శాంతిజెంది నిద్రావస్థయందుండునపుడు ఈజగత్తు నిశ్చేష్టితమైయుండు. ముందుదహరించిన కల్పంబులు సాత్త్విక రాజస తామస సంకీర్ణంబులను నామంబులచే వెలయుచుండు. సాత్త్వికకల్పంబున విష్ణుమాహాత్మ్యము, రాజసంబున బ్రహ్మమాహాత్మ్యము, తామసంబున అగ్ని శివమాహాత్మ్యంబులును, సంకీర్ణంబున సరస్వతీ పితృమాహాత్మ్యంబులును, ప్రకాశింపుచుండునని వచించిమత్స్యస్వరూపుండగు నారా

కాలకూటభక్షణము, దేవాసుర యుద్ధము, వాస్తువిద్యయు, ప్రతిమాదిలక్షణంబులు, ప్రతిష్ఠావిధియు, భవిష్యద్రాజానుకీర్తనము, షోడశమహాదానంబులు, కల్పానుకీర్తనము, గ్రంథానుక్రమణికయు, ఇవి మొదలగునవి వచించితి కావున నిప్పురాణంబున నొకపాదశ్లోకంబు పఠించినవానికి సకలపాపంబులు దొలంగి నారాయణుని పదంబు జేకూరు- మఱియు నిప్పురాణంబు శ్రవణమును గావించిన బ్రాహ్మణుడు విద్యను, క్షత్రియుడు రాజ్యంబును, వైశ్యుడు ధనంబును, శూద్రుడు సుఖంబును జెందును.

శ్రీకృష్ణార్పణమస్తు.

ఓంతత్సత్.

